# వన సీమలలో

రచన :

ఫెలిక్స్ జల్తేన్

అనువాదం :

మహీధర నళినీ మోహనరావు

అవంతీ ప్రచురణాలు :
ప్రజాశక్తినగర్, విజయవాడ-2.

ఇదే రచయితవి.

విజ్ఞానము : వినోదము

ప్రపంచానికి అఖరు ఘడియలు

మొదటి ముద్రణ

రెండువేల ప్రతులు.

వెల : 8-00

ముద్రణ

సోమేశ్వర ప్రింటింగ్ ప్రెస్

విజయవాడ-2

ప్రతులకు, వివరాలకు :

హైదరాబాద్ బుక్ ట్రస్ట్

3-6-694, హిమాయత్‌నగర్,

హైదరాబాద్-500 029.

కోకిలకూడా దూరని కారడవిలో ఓ మూలగా ఉన్న ప్రదేశం అది. తీగలతో, పొదలతో, చెట్లు దట్టంగా మూసుకుపోయిన చక్కని రహస్య స్థలం. ఆ అడవిలో పుట్టి పెరిగిన వాళ్ళకు తప్ప అల్లాంటి చోటు ఒకటి ఉందనే తెలియదు. అక్కడ పుట్టాడు అతను, ఒక్క క్షణం క్రితం.

ఆ పెద్ద పెద్ద నల్లని కళ్ళు ఇంకా తెరుచుకోనేలేదు. మెత్తని పెద్ద చెవులకు ఈ ప్రపంచ ధ్వనులింకా వినపడడమే లేదు. కానీ, అప్పుడే లేచేసి నిలబడ్డాడు, సన్నని చిన్నారి కాళ్ళమీద. పట్టుకుచ్చులాంటి బంగారు రంగు చర్మం జలదంతా అక్కడక్కడ ముడతలు పడుతున్నది.

"అబ్బ! అబ్బ! ఎంతఅందంగా ఉన్నాడో ఈ గుంటడు!" దాచుకోలేని ఆశ్చర్యాన్ని బయట పెట్టేసింది గోరువంక. ఆమె అసలు ఏదో పనిమీద బయలుదేరింది. కానీ, అదంతా మరిచిపోయి, దగ్గరలోఉన్న చిన్న కొమ్మమీద చదికిలబడింది.

"అబ్బ! ఎంత అందం, ఈ అబ్బాయిది!" అంది మరెంత గట్టిగా.

గోరువంకకు సమాధానం ఎవ్వరూ చెప్పలేదు. అందు కామె చిన్నబుచ్చుకోనూ లేదు. "అరే! ఏమిటీ విడ్డూరం! ఇంత చిన్నారి పాపాయి అప్పుడే లేచి నిలుచున్నాడు! అప్పుడే నడుస్తున్నాడు కూడాను. ఇల్లాంటి వింత ఇంతవరకూ ఎప్పుడూ వినలేదు. ఎప్పుడూ చూడలేదు. అయినా నా వయస్సు మాత్రం ఏమంత ఎక్కువలే? ఏదీ, గూడు వదిలి ఇంకా ఏడాది కాలేదు. మీ అందరికి తెలుసు ఆ మాట. అయినా ఏ మాట కా మాటే చెప్పుకోవాలి – ఇంత విడ్డూరం ఎవ్వళ్లూ చూసి ఉండరు. ఏమో మరి, మీ లేళ్ళలో ఇల్లాంటి విపరీతాలు, విడ్డూరాలు జరుగుతాయేమో నాకు తెలియదు స్మీ!"

గోరువంక ఒక్క గంతువేసి కింద కొమ్మమీద నిలుచుని తల ఒరగబెట్టి చూసింది. "అన్నట్లు, అబ్బాయికి పరుగు కూడా చేతనవునా?"

"ఊఁ!" అని నెమ్మదిగా సమాధానం ఇచ్చింది అమ్మ. "మీతో బాతాఖానీ వేసుకు కూర్చోగల ఓపిక లేదు. క్షమించండి. నా కెన్ని పనులో. పైగా చాలా నీరసంగా ఉంది."

గోరింక చిన్నబుచ్చుకుంది. "ఓ యమ్మో! మీకొక్కర్తికే కాదు తీరుబడి లేనిది. నాకూ లేదు. కాకపోతే, విడ్డూరంగా అనిపించింది కనక ఓమాటు అనుకున్నాను. ఇదే మా గోరింకలలో అయితే ఇంత త్వరగా లేస్తారా? గుడ్డు పగిలి పిల ఓ పట్టాన పైకి వస్తుందీ? వాటి కెంత సుకుమారం! ఒక్క పని అంటే ఒక్క పని సొంతంగా చేసుకోలేవు కదా?

వాటి వెనకాలే ఉంటూ, ఎంత చాకిరీ చెయ్యాల్లో? చెబితే అర్థం కాదులే. అబ్బబ్బ! వాటికి ఒకటే తిండి యావ. ఆచిన్ని పొట్టలు నింపేసరికి రెక్కలు పడిపోతాయి. ఈలోపుగా, వాటికి ఏమీ కాకుండా చూసుకోవాలి. అవునంటారా, కాదంటారా? వాటికి కాస్త రెక్కలూ, అవీ వచ్చేదాకా ఎదురు చూసి కళ్ళు చిల్లులు పడిపోతాయనుకోండి! ఏమంటారు?" రెట్టించి సమాధానం కోసం ఎదురు చూసింది గోరింక.

"క్షమించండి. మీరేమంటున్నారో నేను వినలేదు" అని నీరసంగా అమ్మ సమాధానం ఇచ్చింది.

గోరింక మూతి మూడు వంకర్లు తిప్పుకుని ఎగిరి పోయింది.

"ఎక్కడో వెర్రిమాలోకం!"

గోరింక వెళ్ళిపోయిందని అమ్మ గమనించనే లేదు. అప్పుడే పుట్టిన పాపాయికి నీళ్ళుపోసే హడావిడిలో ఉంది ఆవిడ. నాలుకతో ఒళ్ళు అంతా మెత్తగా, శ్రద్ధగా నాకి శుభ్రం చేసింది. అదే స్నానం, అదే దువ్వడం, అదే నిమరడం - అన్నీను.

అబ్బాయి కొద్దిగా తూలాడు. వెచ్చని నాలుకతో అమ్మ చేయించిన స్నానానికి అలసిపోయి నేలమీద చదికిలబడ్డాడు. అతని తడిసిన చర్మంమీద తెల్లని చుక్కలు తళతళలాడాయి. కళ్ళు మూసుకున్న ఆ అబ్బాయి లేత మొగంలో ప్రశాంతమైన చిన్నతనపు అమాయకత్వం దోబూచులాడింది.

మద్ది, జువ్వి, రావి, నేరేడు, మామిడి మొదలైన

గోరువంకకు సమాధానం ఎవ్వరూ చెప్పలేదు. అంద కామె చిన్నబుచ్చుకోనూ లేదు. "అరే! ఏమిటీ విడ్డూరం! ఇంత చిన్నారి పాపాయి అప్పుడే లేచి నిలుచున్నాడు! అప్పుడే నడుస్తున్నాడు కూడాను. ఇల్లాంటి వింత ఇంతవరకూ ఎప్పుడూ వినలేదు. ఎప్పుడూ చూడలేదు. అయినా నా వయస్సు మాత్రం ఏమంత ఎక్కువలే? ఏదీ, గూడు వదిలి ఇంకా ఏడాది కాలేదు. మీ అందరికి తెలుసు ఆ మాట. అయినా ఏ మాట కా మాటే చెప్పుకోవాలి – ఇంత విడ్డూరం ఎవ్వళ్లూ చూసి ఉండరు. ఏమో మరి, మీ లేళ్ళలో ఇల్లాంటి విపరీతాలు, విడ్డూరాలు జరుగుతాయేమో నాకు తెలియదు స్మీ!"

గోరువంక ఒక్క గంతువేసి కింద కొమ్మమీద నిలుచుని తల ఒరగబెట్టి చూసింది. "అన్నట్లు, అబ్బాయికి పరుగు కూడా చేతనవునా?"

"ఊఁ!" అని నెమ్మదిగా సమాధానం ఇచ్చింది అమ్మ. "మీతో బాతాఖానీ వేసుకు కూర్చోగల ఓపిక లేదు. క్షమించండి. నా కెన్నిపనులో. పైగా చాలా నీరసంగా ఉంది."

గోరింక చిన్నబుచ్చుకుంది. "ఓ యమ్మో! మీకొక్కర్తికే కాదు తీరుబడి లేనిది. నాకూ లేదు. కాకపోతే, విడ్డూరంగా అనిపించింది కనక ఓమాటు అనుకున్నాను. ఇదే మా గోరింకలలో అయితే ఇంత త్వరగా లేస్తారా? గుడ్డు పగిలి పిల్ల ఓ పట్టాన పైకి వస్తుందీ? వాటి కెంత సుకుమారం! ఒక్క పని అంటే ఒక్క పని సొంతంగా చేసుకోలేవు కదా?

వాటి వెనకాలే ఉంటూ, ఎంత చాకిరీ చెయ్యాలో? చెబితే అర్థం కాదులే. అబ్బబ్బ! వాటికి ఒకటే తిండి యావ. ఆచిన్ని పొట్టలు నింపేసరికి రెక్కలు పడిపోతాయి. ఈలోపుగా, వాటికి ఏమీ కాకుండా చూసుకోవాలి. అవునంటారా, కాదంటారా? వాటికి కాస్త రెక్కలూ, అవీ వచ్చేదాకా ఎదురు చూసి కళ్ళు చిల్లులు పడిపోతాయనుకోండి! ఏమంటారు?" రెట్టించి సమాధానం కోసం ఎదురు చూసింది గోరింక.

"క్షమించండి. మీరేమంటున్నారో నేను వినలేదు" అని నీరసంగా అమ్మ సమాధానం ఇచ్చింది.

గోరింక మూతి మూడు వంకర్లు తిప్పుకుని ఎగిరి పోయింది.

"ఎక్కడో వెర్రిమాలోకం!"

గోరింక వెళ్ళిపోయిందని అమ్మ గమనించనే లేదు. అప్పుడే పుట్టిన పాపాయికి నీళ్ళుపోసే హడావిడిలో ఉంది ఆవిడ. నాలుకతో ఒళ్ళు అంతా మెత్తగా, శ్రద్ధగా నాకి శుభ్రం చేసింది. అదే స్నానం, అదే దువ్వడం, అదే నిమరడం – అన్నీను.

అబ్బాయి కొద్దిగా తూలాడు. వెచ్చని నాలుకతో అమ్మ చేయించిన స్నానానికి అలసిపోయి నేలమీద చదికిలబడ్డాడు. అతని తడిసిన చర్మంమీద తెల్లని చుక్కలు తళతళలాడాయి. కళ్ళు మూసుకున్న ఆ అబ్బాయి లేత మొగంలో ప్రశాంతమైన చిన్నతనపు అమాయకత్వం దోబూచులాడింది.

మద్ది, జువ్వి, రావి, నేరేడు, మామిడి మొదలైన

చెట్లతో; డొంకలతో; రకరకాల పూల మొక్కలతో; తీగ లతో దట్టంగా ఉంది అడవి.

మాగిపోయిన ఆకులతో చిత చిత లాడుతున్న నేల మీద గడ్డిపూలు పచ్చగా పరిచినట్లున్నాయి. ఆకుల సందు నుంచి బంగారం తీగలు సాగినట్లు ఉదయ సూర్యుని కిర ణాలు అక్కడా, అక్కడా నేలమీదికి పాకుతున్నాయి. పావు రాలు గుర గుర లాడుతున్నాయి. పిచికలు కిచ కిచ లాడు తున్నాయి. వడ్రంగిపిట్టలు టక్కు టక్కు మనిపిస్తున్నాయి. ఉండి ఉండి, నెమళ్ళు కేకలు వేస్తున్నాయి. చిక్కని ఆ ధ్వనులు చీల్చుకుని మధ్య మధ్య గూబలు భయంకరంగా అరుస్తున్నాయి. చిటారి కొమ్మలమీద బొంత కాకులు బొంగురుపోయిన గొంతుకలతో జగడ మాడుకుంటున్నాయి. అప్పుడప్పుడు గద్దలు సగర్వంగా దీర్ఘాలు తీస్తున్నాయి. కోటి కంఠధ్వనులు ఒకదానితో ఒకటి కలిసిపోయి అవ్యక్తంగా, మధురంగా వినిపిస్తున్నాయి.

ఆ అబ్బాయికి ఆ ధ్వనులనూ, ఆ గొంతుకలనూ గుర్తుపట్టడం ఇంకా చేతకాదు. ఆ అడవిలో నిర్విరామంగా వినిపిస్తున్న కోటి మాటలలో ఒక్కటికూడా అర్థం కావడం లేదు. అడవి అంతా రకరకాల వాసనలు గాలివాటున గుప్పు మంటున్నాయి. కానీ అవి ఏమిటో అతనికింకా తెలియదు. అతనికి తెలిసినదల్లా ఒక్కటే. అమ్మ పెట్టుకునే ముద్దులలో, చేయించే స్నానంలో, పట్టులాంటి చర్మాన్ని రాసుకుంటూ పోతున్న మెత్తని, వెచ్చని నాలుక తాకిడి ఒక్కటే. అమ్మకు దగ్గరగా ఇరికి ఇరికి పడుకున్నాడు.

కొడుకు పాలు కుడుచుకుంటూ ఉంటే, తల్లి కళ్ళు అరమోడ్చి, "బేంబి" అని మంద మందంగా గొణుక్కుంది. తల విదిలించుకుంది. చెవులు రిక్కించింది. దీర్ఘనిశ్వాసం విడిచింది. సానందంగా, నిశ్చలంగా కొడుకును ముద్దు పెట్టుకుంది. 'బేంబి! నా చిన్నారి బేంబి!' అనుకుంది.

వసంతంలో ప్రభాతవేళ. గాలి నెమ్మదిగా కదులుతున్నది. చెట్ల కొమ్మలు ఆకాశాన్ని మెల్లిగా తుడుస్తున్నాయి. లేత సూర్యుడు చెట్ల చిగుళ్ళకు రంగులు వేస్తున్నాడు. పొదలమీద, గడ్డిమీద నీటిబొట్లు తెల్లగా, ఎర్ర పచ్చగా నక్షత్రాలలా మెరుస్తున్నాయి. అరణ్యం లోపలి భాగం అంతా రకరకాల రంగులతో వెలిగిపోతున్నది. అరవిచ్చిన పువ్వులమీదనుంచి, లేత చిగుళ్ళ మధ్యనుంచి, తడిసిన నేలలోనుంచి వస్తున్న వాసనలతో అడవి అంతా మత్తుగా గుబాళిస్తున్నది. పక్షుల కలకలారవాలు, తేనెటీగల ఝుంఝుమలు, గాలిపోసుకున్న వెదురుగొట్టాల కీచు ధ్వనులు— అన్నీ కలిసిన చిత్రమైన వాద్య సమ్మేళనం శ్రవణపేయంగా ఉంది. బేంబి శైశవం వీటిమధ్య గడుస్తున్నది.

పొదల మధ్యనుంచి సన్నని దారి. దాని మీదుగా అమ్మ వెనకాల బేంబి. ఎంత అందంగా నడుస్తున్నాడు! నడుస్తుంటే ఎడా, పెడా దట్టంగా ఉన్న ఆకులు ఒ అతన్ని మెత్తగా దువ్వుతున్నాయి. అతని ప్రతి చిన్నదీ పెద్ద ఆటంకంగానే కనిపిస్తున్నది. కానీ, అంతలో, అల్లా ముట్టుకుంటే చాలు, దారి ఇచ్చేస్తున్నాయి. దారి తిన్నగా

లేవు. అన్నీ మెలికలే. పాములలాగా అటువంటి దారులు అడవి అంతా అలుముకుపోయి కనిపిస్తున్నాయి. ఆ దారు లన్నీ అమ్మకు కొట్టిన పిండే. ఆమె వెనకాలే అతడు అడు గులు వేస్తున్నాడు.

కనిపిస్తున్న ప్రతి ఒక్కటీ లక్ష అనుమానాలు కలిగి స్తున్నది. అమ్మను బేంబి ప్రశ్నలతో ముంచెత్తుతున్నాడు. అడుగడుగునా ప్రశ్నలే. అమ్మ యిచ్చే సమాధానాలకోసం ఎదురుచూస్తూ ఉంటాడు. ప్రశ్నలు వెయ్యడం, అమ్మ ఇచ్చే సమాధానాలు వినడం అతడికి మహాసరదా. ఆమె చెప్పేవన్నీ అర్థం కాకపోవచ్చు. అయినా సరే. ప్రశ్నమీద ప్రశ్న. తెగ ఊరిపోయేవి. అప్పుడప్పుడు బేంబి ప్రశ్న వెయ్యకుండా స్వయంగా ఆలోచించడానికి ప్రయత్నించేవాడు. అందులో ఎంత ఆనందం ఉంది! అప్పుడప్పుడు అమ్మ కావాలనే సమా ధానం చెప్పడంలేదని బేంబికి తెలిసిపోయింది. అదీ ఒక విధంగా బాగానే ఉంది. ఏమంటే అందులో ఏదో రహస్యం, జీవితంలో అర్థంకాని మలుపులు, అర్థం కాకపోవడంలో ఉన్న తియ్యదనం, ఆ తియ్యదనంలో కాస్త భయం—అనేక అను భూతులు.

బేంబి అడిగాడు: "ఈ దారి ఎవరిది?"

"మనదే."

"అంటే నీదీ, నాదీనా?"

"అవును."

"మన ఇద్దరిదీనా?"

"ఊఁ,"

"ఒక్క మన ఇద్దరిదే?"

"కాదు. మన లేళ్లు అందరిదీని."

బేంబి ఆశ్చర్యంతో నవ్వాడు. "లేళ్ళ? ఏమిటవి?"

కొడుకు కేసి చూసి తానూ నవ్వింది అమ్మ.

"నువ్వు లేడివి. నేనూ లేడినే. మనది లేడి జాతి. తెలిసిందా?"

పకపకా నవ్వి బేంబి గాలిలోకి అంత ఎత్తు ఒక్క మారు ఎగిరాడు.

"తెలిసింది. తెలిసింది. నేనేమో చిన్న లేడిని. నువ్వేమో పెద్ద లేడివి. అంతేనా?"

అమ్మ తల ఊపింది.

"నువ్వూ, నేనూ కాక ఇంకా లేళ్ళున్నాయా?" అన్నాడు బేంబి, జ్ఞాపకం చేసుకుంటున్నట్లు ముఖంపెట్టి, గంభీరంగా.

"లేకేం? బోలెడంతమంది" అంది అమ్మ.

"మరి ఏరీ వాళ్ళు?"

"ఇక్కడే ఎక్కడెక్కడో ఉంటారు."

"ఛో. నాకు ఒకళ్ళూ కనబడడం లేదు." బుంగమూతి పెట్టాడు బేంబి.

"కనిపిస్తారురా, నాన్నా!" అంది గోముగా చూస్తూ, అమ్మ.

"ఎప్పుడు?" అంటూ బేంబి నిలబడిపోయాడు.

"త్వరగానే" అని అమ్మ శాంతంగా సమాధానం చెప్పి, ముందుకు అడుగు వేసింది.

బేంబి మళ్ళీ ఆమె వెంట పడ్డాడు. మౌనంగా నడుస్తు న్నాడు. ఆ చిన్నారి బుర్రలో ఎన్నో ఆలోచనలు. 'త్వరగా అంటే ఏమిటో?... తెలిసింది. త్వరగా అంటే ఇప్పుడు కాదు; తరవాత అయిఉంటుంది... అయితే తరవాత అంటే? త్వరగా కానేకాదేమో?'

ఉన్నట్లుండి బేంబి ప్రశ్నించాడు. "ఈ దారి ఎవరు వేశారే, అమ్మా?"

"మనమే."

"అంటే నువ్వూ, నేనూనా?"

"మనం అంటే మన లేళ్ళు అన్నమాట."

"ఎవరెవరు?"

"అందరమూను."

ఇద్దరూ ముందుకు సాగిపోయారు.

బేంబికి మహా హుషారుగా ఉంది. ధైర్యంగా దా(



విడిచిపెట్టి, పక్కగా గడ్డిలో పైకి ఎగిరి గంతు వేశాడు. మళ్ళీ వెంటనే తల్లి దగ్గరకు వచ్చేశాడు.

ఉన్నట్టుండి పొదల పక్కన ఏదో జర జర మని చప్పుడయింది. గడ్డి దుబ్బు ఊగిసలాడింది. బాధగా ఏదో సన్నని గొంతు మూలిగింది. అంతే. గడ్డిపోచల గుసగుసలు తప్ప మరే చప్పుడూ లేదు.

అది వెంట్రుక. ఎలుక నొకదాన్ని పట్టుకుని వీళ్ళ పక్కనుంచి చర చరా ఈడ్చుకుపోయింది. దూరంగా కూర్చుని పరకాయించి చూసింది. ఇంక ఎదుట ఉన్న ఆహారాన్ని ఆరగించడం మొదలుపెట్టింది.

బేంబి గాభరాపడి తల్లి పక్కకు చేరాడు. "ఏమిటదీ?" అన్నాడు నెమ్మదిగా.

"ఏమీ లేదులే" అనేసింది అమ్మ.

బేంబికి ఇంకా వణుకు తగ్గలేదు. "అమ్మో కనిపిస్తూంటేనే!"





"భయంలేదులేరా, నాన్నా! వెంట్రుక ఎలకని చంపింది. అంతే. మరేంలేదు. భయ పడకు."

అయినా బేంబికి అదురు తగ్గలేదు. ఏదో తెలియనికొత్త భావం – జాలి లాంటిది కలి గింది. గుండెను ఊపేసింది.

అతని నోటమాట రాలేదు చాలా సేపటిదాకా. ఆఖరికి ఉంపబట్టలేక అడిగాడు: "అదీ .... ఎలకనిఎందుకు చంపిందీ?"

"ఎందుకా?" తల్లి ఊగిసలాడింది. "త్వరగా నడు, వెళ్ళుదాము" అని తొందర చేసింది, ఏదో చటుక్కున గుర్తు వచ్చినట్లు.

ఆమె కొంత దూరం గబగబా అడుగులు వేసింది. వెనుకబడిపోకుండా ఉండడానికి బేంబి కాస్త పరుగెత్తవలసి వచ్చింది.

మళ్ళీ వాళ్ళు మామూలుగా నెమ్మదిగా నడుస్తున్నప్పుడు బేంబి నొక్కినొక్కి అడిగాడు. "అమ్మా! మరి అయితేనూ.... మనంకూడా.... ఎప్పుడైనా... ఎలకలను చంపుతామా?"

"ఉఁహూఁ" అంది అమ్మ.

"ఎప్పుడూ?"

"లేమరా, బుజ్జీ! మనలో ఇల్లాంటిది ఎప్పుడూ జరగదు."

ఇద్దరూ ముందుకు నడిచారు.

ఎదురుగా — అడవికి కన్నం పడ్డట్లు, చెట్ల గోడకు కిటికీ పెట్టినట్లు కళ్లు మిరుమిట్లు గొలిపే వెలుగుతో నిండిన ఖాళీ స్థలం కనపడింది.

అక్కడితో దారి ఆఖరయిపోయింది. ఎదట విశాలమైన మైదానం. సూర్యకాంతి కుమ్మరించేసినట్లు మెరిసిపోతున్నది. బేంబికి ఒక్క ఉరుకులో ఆ మైదానంలోకి వెళ్లి పడిపోవా లనిపించింది. కానీ, అమ్మ అల్లా ఎగరనివ్వకుండా దారికి అడ్డంగా నిలవబడింది.

"ఏమిటిది?" అన్నాడు బేంబి, ఎదురుగా కనబడుతున్న ప్రకృతి వైచిత్ర్యానికి ముగ్ధుడైపోతూ.

"మైదానం" అంది అమ్మ.

"మైదానం అంటే?"

"అంటే ఏమిటో చూద్దువుగాని లే."

ఆమె గంభీరంగా నిలవబడింది. జాగ్రత్తగా ఒళ్లంత కళ్లు చేసుకుని చూసింది. చెవులు రిక్కించి, మోర పైకెత్తి ఓపికతో అతి జాగ్రత్తగా వింది. ముక్కులు పెద్దవిచేసి, గాఢంగా గాలి పీల్చుకుంది. "ఏమీ ఫరవాలేదు" - అంది ఆఖరున.

బేంబి ముందుకు గంతు వేయబోయాడు. కాని అమ్మ దారికి అడ్డం వచ్చింది.

"ఆగు. నేను పిలిచినప్పుడు వద్దువుగాని లే."

బేంబి బుద్ధిమంతుడిలాగా నిలబడిపోయాడు.

అమ్మ వెనుదిరిగి హెచ్చరించింది "అదీ – అల్లా ఉండాలి. ఇక నేను చెప్పేది జాగ్రత్తగా విను."

ఆమె కంఠంలో ఏదో రహస్యం వినిపించింది. భయం దాగివున్నట్లు బేంబి కనిపెట్టేశాడు. అతి జాగ్రత్తగా వినసాగాడు.

అమ్మ చెబుతున్నది: "మైదానంమీదికి వెళ్ళడం అంత సులభమైన పనేమీ కాదుసుమా! అందులో ఎన్నో అపాయాలున్నాయి. ముందు ముందు నీకే తెలుస్తుంది. ఇప్పటికి నేను చెప్పబోయేది జ్ఞాపకం పెట్టుకో. సరేనా?"

"అల్లాగే." – తల ఊపాడు బేంబి.

"ముందు నేనొక్కర్తినీ వెళ్ళుతాను. నువ్వు ఇక్కడే నిలబడు. నాకేసే చూస్తూ ఉండు. నేను కనక కాస్త వెనక్కు తిరిగి, పరుగెత్తి వస్తున్నట్లు కనిపిస్తే ఇంక నువ్వు ఒక్క క్షణం ఆగకు. వచ్చిన దారినే పడి అడవిలోకి పరుగెత్తిపో. బలంకొద్దీ పరుగెత్తాలి సుమీ! గబగబా వచ్చి నేను నిన్ను కలుసుకుంటానులే."

బేంబి ఆలోచిస్తున్నట్లు నిలబడ్డాడు.

అమ్మకూడా కాస్సేపు మాట్లాడకుండా నిలబడింది మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చింది.

"ఏమయినా సరే, బలంకొద్దీ పరుగెత్తిపోవాలి. ఒక వేళ...నా కేమైనా అవుతుందనుకో... నేను కింద పడిపోయినట్లనిపిస్తుందనుకో... ఏమీ ఆలోచించవద్దు. అసలు ఏమీ

చూడనట్లు, వినవట్లు అడవిలోకి పారిపోవాలి. ఒక్క క్షణం కూడా తటపటాయించవద్దు. అల్లా చేస్తానని ఒట్టు య్యి."

"అల్లాగే" అన్నాడు బేంబి మృదిగా.

"ఇంక మనం మైదానంలోకి వెళ్ళుదాము. నేను ముందుంటాను. నకాలే నువ్వు నీకు చాలా అనిపిస్తుందిలే అక్కడ. చక్కగా ఆడుకోవచ్చు. పరుగెత్త వచ్చు. కానీ — ఒక్క షరతు. నేను పిలిచీ పిలవగానే నువ్వు నాదగ్గరకు పరుగెత్తుకు వచ్చెయ్యాలి సుమీ! తెలిసిందా!"

"సరే" అని తల ఊపాడు బేంబి. అమ్మ అంత గట్టిగా చెప్పింది మరి. ఆవిడ ఇంకా చెబుతూనే ఉంది.

"నేను పిలవగానే అటూ, ఇటూ దిక్కులుచూడకుండా ఏమీఅనకుండా వెంటనే బాణంలాగా నా దగ్గరకు పరుగెత్తుకు వచ్చేసెయ్యాలి. ఒక్క పిసరు అటూ, ఇటూ చెయ్యకూడదు. ఆలస్యం వద్దు సుమీ! బాగా జ్ఞాపకం ఉంచుకో. నేను పరుగెత్తుతూ వుంటే — నా వెనకాల నువ్వూ పరుగెత్తాలి. మళ్ళీ పొదల వెనకాలకి వెళ్ళిపోయేదాకా ఆగకూడదు. మరిచి పోవు కదూ?"

"ఊఁహూఁ" అన్నాడు బేంబి. అమ్మ మాటలలో ఏదో కొత్తదనం వినిపించింది. భయమూ కనిపించింది.

"ఇంక నేను నడుస్తాను."

ఆమె మెల్లిగా ముందుకు కదిలింది. కాళ్ళు ఎత్తెత్తి వేస్తూ మెల్లిగా ముందుకు నడిచింది. బేంబి ఆమె కేసే కన్నార్పకుండా చూస్తున్నాడు. ఏమిటా? అని ఆలోచన; ఎందుకా? అని భయం, ఆత్రం — ఏవేవో అనుభూతులతో

ఆతని మనస్సు ఊగిపోతున్నది. అమ్మ ఎంత జాగ్రత్తగా అడుగులు వేస్తున్నదో, చెవులు రిక్కించి వింటున్నదో చూశాడు. ఆమె శరీరం అంతా బిగబట్టి నడుస్తున్నది. ఆమెలాగ తానూ నరాలు ఉగ్గబట్టాడు. ఏ క్షణంలో అయినాసరే ఇషారా వినిపించేసరికి పారిపోడాని సిద్ధంగా ఉన్నా కానీ, అమ్మ మెడ వెనక్కు తిప్పి, ఫరవాలే దన్నట్లు చూచి, మెల్లిగా పిలిచింది. "ఇల్లారా!"

బేంబి ముందుకు గంతు వేశాడు. మైదానం అంటే కలిగిన సంతోషం ఆతనిలోని భయాన్ని తోసి పారేసింది. అడవిలో ఎప్పుడూ పచ్చగా, దట్టంగా ఆకులే కనిపించేవి. నీలాకాశం ఆకుల సందులోనుంచి తూట్లు తూట్లుగా కనిపించేది. మరి ఇక్కడ, ఎటు చూసినా విశాలంగా ఆకాశం. కింద ఎటు చూసినా పట్టులాంటి గడ్డి. ఎంత అందంగా ఉందో! బేంబి ఆ అందానికి ముగ్ధుడైపోయాడు. ఆతని హృదయంలో సంతోషం కట్టలు తెంచుకుని ప్రవహించింది.

అడవిలో ఎప్పుడూ సూర్యుడి దర్శనమే కాలేదు బేంబికి. ఆకులమధ్యనుంచి కిందికి జాలువారే వెలుగుచారలే సూర్యుడు కాబోలు ననుకునేవాడు. ఇప్పుడు తెలిసింది, సూర్యుడంటే ఏమిటో. కళ్ళు జిగేలుమనే కాంతి. ఏదో చెప్పలేని శక్తి కళ్ళను మూసేసింది. హృదయం తెరుచుకున్న ట్లయింది. నులివెచ్చని వెలుగులో బేంబి నిలుచున్నాడు. ఆనందంతో వివశుడై పోయాడు. మత్తెక్కినట్లయింది. ఇంక ఆలోచనలే కలగటంలేదు. నిలుచున్నవాడు నిలుచు న్నట్లు గాలిలోకి ఎగిరాడు—రెండుమాట్లు... మూడు ...

నాలుగు...ఐదు...పది మార్లు. అతడు బుద్ధిపూర్వకంగా అల్లా చెయ్యడంలేదు. ఎగరాలని ఎగరడంలేదు. గాలే అతణ్ణి పైకి ఎగరేస్తున్నది. ఆ మైదానంలో గడ్డి వాసనలతో గుబాళిస్తున్న చల్లని గాలి రివ్వున వీస్తున్నది. నిండుగా పీల్చుకున్నాడు.

బేంబి కుర్రతనపు గంతులను, నవ్వువచ్చే చిత్రమైన చేతకాని పనులను చూచి మాతృహృదయం పొంగిపోయింది. చిన్నబిడ్డ ఆనందం అర్థమైంది. పుట్టినప్పటినుంచీ చీకటి గుయ్యారంలా ఉండే అడవిలో ఉండడమే సరిపడింది. ఎప్పుడైనా ఇటువంటి మైదానాన్ని చూచాడా, ఏమన్నానా ?

అమ్మ తలవంచి, ముందుకు ఉరికింది.

బేంబి చిరునవ్వు నవ్వాడు. మరుక్షణంలో తల్లి ననుకరిస్తూ ఒక గంతు వేశాడు. ఎత్తైన గరికగడ్డి గరగర లాడింది. ఆ ధ్వని వినేసరికి బేంబికి భయం వేసింది. ఏం చెయ్యాలో తెలియక నిలబడిపోయాడు. మళ్ళీ అలాంటిదే చప్పుడు. ఈమారు అమ్మ నవ్వుతూ ఎదటికి వచ్చింది.

"ఏదీ, నన్ను కనుక్కో చూద్దాం" అని అంతలో గడ్డిలో మాయమైపోయింది.

బేంబి నిశ్చేష్టుడయ్యాడు. చూస్తుండగానే అమ్మ మాయమైంది. ఎక్కడ దాక్కుందో?

అంతలో అమ్మ తలఎత్తి కనిపించింది. గబగబా పరుగెత్తుకువచ్చింది. మట్టెతో బేంబికి కితకితలు పెట్టింది.

"ఈసారైనా అందుకో చూద్దాం!"

బేంబి ఎగిరి తల్లివెంట ఉరికాడు. అవి అడుగులు

కావు. గాలిలో ఎగరడమే. పైకి ఎగిరి కిందికి దిగేటప్పుడు కలిగిన చిత్రమైన అనుభవంతో ఊగిపోయాడు. ఒక్కటంటే ఒక్క క్షణం నేలను అంటుకోవడం, అంతలో మళ్ళీ హేలగా గాలిలోకి ఎగరడం. ఏపుగా పెరిగిన గడ్డిపోచలు చెవులవెనక, పక్కల కితకితలు పెడుతుంటే అటూ ఇటూ పరుగులెత్తాడు.

ఓ వైపునుంచి మరోవైపు గంతులు వేశాడు. గిరికీలు కొట్టాడు.

బిడ్డను చూచుకుని ఆ తల్లి మురిసిపోయింది.

బేంబి ఆటలో తన్ను తానే మరిచిపోయాడు. కొంత సేపు గంతులువేసి మళ్ళీ తల్లిదగ్గరకు వచ్చాడు ఆనందంతో. ఆర్ద్రమైన పెద్ద పెద్ద నల్లని కళ్ళతో తల్లిని చూశాడు. ఒకళ్ళ నొకళ్ళు ఒరుసుకుంటూ మందమందంగా అడుగులు వేశారు.

బేంబికి వీపు వెచ్చనైంది. స్వేచ్ఛగా, తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు. యథేచ్ఛగా, నిరవరోధంగా కదలడంలో ఉన్న మహత్తరానందాన్ని చవిచూచాడు. తల పైకెత్తితే ప్రశాంత నీలాకాశం. ఎటు చూచినా కనుచూపుమేరవరకూ పచ్చిక. మొట్టమొదటిసారే చూడడమేమో కన్నులపండువుగా ఉంది. అడుగడుగుకూ ఏవేవో కొత్త కొత్త వింతలే. అడివిలోలాగా ఇక్కడ రహస్యాలు లేవు. కనపడని చోట్లంటూ లేవు. దిగంతందాకా ప్రతి మొక్కా, ప్రతి పువ్వూ, ప్రతి గడ్డిపరకా కనిపిస్తుంది. ఆ ఆకుపచ్చని మైదానంలో అడుగడుగునా పచ్చనివీ, ఎర్రనివీ, తెల్లనివీ గడ్డిపూలు గుచ్చినట్లు కనిపిస్తున్నాయి.

"అమ్మా! అమ్మా! చూడు చూడు. పువ్వు ఎగిరి



పోతోంది" అని ఆశ్చర్యంగా అరిచాడు బేంబి.

"అది పువ్వు కాదురా, నాన్నా! దానిని సీతాకోక చిలక అంటారు."

బేంబి ఆశ్చర్యంగా చూచాడు.

సీతాకోక చిలక ఎగురుతూ ఎగురుతూ, చటుక్కున పక్కకు తిరిగింది. అక్కడున్న ఒక పువ్వుమీద వాలింది. మళ్ళీ అంతలో పైకి ఎగిరిపోయింది.

ఇల్లాంటి ఎగిరే పువ్వులు మైదానంలో బేంబికి బోలెడు కనిపించాయి. ఎగిరి ఎగిరి, గిరికీలు కొట్టి ఆనందం పట్టలేక పువ్వులమీద చటుక్కున వాలి ముద్దులు పెట్టు కుంటున్నాయి. అవికూడా అచ్చు పువ్వులలాగే ఉన్నాయి. ఎగిరే పువ్వులు. హుషారైన పువ్వులు. ఎప్పుడూ ఉన్న చోటే కొమ్మలమీద కదలకుండా కూర్చుంటే విసుగేసిం

దేమో - రెక్కల గుడులు తీరేలా రవ్వంతసేపు తిరిగి ఆడు కుని వద్దాములే అని లేచి ఎగిరిపోతున్నాయేమో ఇవి. మంచి మంచి చోట్లు చూచుకుని కూర్చుంటున్నట్లు ఓమారు ఆగు తాయి. నచ్చనట్లు మళ్ళీ లేస్తాయి. అల్లా అల్లా వెతు క్కుంటూ సాగిపోతూనే ఉన్నాయి.

సీతాకోక చిలకలను దగ్గరకు వెళ్ళి చూడాలనిపిం చింది బేంబికి. పోనీ దగ్గరకు కాకపోయినా కొంచెం దూరం నుంచి అయినా చూద్దామనుకున్నాడు. కానీ, అవి అల్లా కనిపిస్తేనా? క్షణంకూడా నిలబడకుండా తళుక్ తళుక్‌మని ఎగిరిపోతుంటే బేంబికి కళ్లు తిరిగాయి.

నేలకేసి చూడగా అంతలో ఓ చిత్రం కనిపించింది. తాను అడుగేసేసరికి ఎన్నో చిన్న చిన్న పురుగులు రివ్వున లేస్తున్నాయి. ఒక్క క్షణం నాలుగు మూలలకూ ఎగురు తున్నాయి. ఆకుపచ్చని వానజల్లులాగా మళ్లీ నేలమీద పడుతున్నాయి. అంతలోనే గడ్డిలో కలిసిపోతున్నాయి.

"ఇవేమిటే, అమ్మా!" అడిగాడు బేంబి.

"ఏవో నలుసులు పోనిద్దూ" అంది అమ్మ.

"చూడు. సరిగ్గా చూడమ్మా! గడ్డిపరకలు ఎంత ఎత్తు ఎగురుతున్నాయో చూడు."

"నీ మొహం. అవి గడ్డిపరకలు కావు. గొల్లభామలు."

"అవి ఎందుకు అలా ఎగురుతాయి?"

"మనల్ని చూసి భయపడ్డాయి."

'అయ్యో, పాపం!' అను కున్నాడు బేంబి.

దగ్గరలోనే రెల్లు ఆకుమీద పెద్ద గొల్లభామ కనిపిం

చింది. అతి మర్యాదగా పలకరించాడు.

"అయ్యా, గొల్లభామగారూ! మీరు మమ్మల్ని చూసి అనవసరంగా భయపడ్డారు. మేము మీకు అపకారం ఏమీ చెయ్యం."

"అబ్బే! నేనంత పిరికివాడిని కానండోయ్. అయితే, హఠాత్తుగా మీరు కనిపించారు. మా ఆవిడతో మాట్లాడుతూ పరాకుగా ఉన్నానేమో - కాస్త ఉలిక్కిపడ్డాను అంతే" అంది గొల్లభామ.

"క్షమించండి. మీ కిబ్బంది కలిగించాను" అన్నాడు పశ్చాత్తప్త కంఠంతో బేంబి.

"ఫరవాలేదు. మీరు గనక సరిపడింది. ఏమో, ఏ వేళ ఎవరు వస్తారో ఏం తెలుస్తుంది, చెప్పండి? ఎప్పటికైనా మన జాగ్రత్తలో మనం ఉండడం మంచిది. ఏమంటారు?"

"చూశారూ, ఈ మైదానంలోకి రావడం ఇదే మొదటిసారి."

స్నేహితు డొకడు దొరికాడన్న సంతోషంతో బేంబి ఏదో చెప్పబోయాడు.

గొల్లభామ పొగరుగా మీసాలు దువ్వి, కనుబొమలు ముడేసింది.

"మీ మాటలు వినడానికి నాకు తీరుబడి లేదు సుమండీ. మా ఆవిడ ఎదురుచూస్తూ ఉంటుంది." హూప్ అ ఎగిరిపోయింది గొల్లభామ.

గొల్లభామ వేసిన గంతుకు బేంబి ఆశ్చర్యపోయాడు తానుకూడా హూప్ అని ఒక గంతువేసి అమ్మ దగ్గరకు పరి

గెత్తాడు.

"అమ్మోయ్! అమ్మా! నేను ఆయనతో మాట్లా డానే."

"ఎవరితోటిరా?"

"అదే – ఆ గొల్లభామగారితో. ఆయన ఎంత మంచి వారనుకున్నావ్! నా కాయన బాగా నచ్చారు సుమీ. ఎం చక్కగా ఆకుపచ్చగా ఉన్నారు. అంతలో పలచని ఆకులా అయిపోయి అవతలివన్నీ కనిపించేశాయికూడా."

"అవి రెక్కలు. బయటికి విప్పాడు."

"ఆహా! మరేమోనే ఆయన ముఖం చిన్నగా, ఎంత గంభీరంగా ఉందనుకున్నావు! ఆయన ఎంత లోతుగా ఆలో చిస్తాడో! ఎంత ఎత్తు ఎగురుతా డనుకున్నావేమిటి? అబ్బ! చాలా కష్టం అలా దూకడం. హూప్ అంటాడు. దూకే స్తాడు."

వారింకా ముందుకు నడిచారు. గొల్లభామతో మాట్లాడడం బేంబికి మహా సంతోషంగా ఉంది. అతనికి ఇతరులతో మాట్లాడడం అదే మొట్టమొదటిసారి. తను కూడా మంచి బలం సంపాదించాలి – అని మనస్సులో అను కున్నాడు.

పాలు కుడుచుకుంటూ మత్తుగా, అరమోడ్పు కన్ను లతో ఉన్న బేంబికి గడ్డిలో ఏదో తెల్లని పువ్వు అల్లల్లా డుతూ కనిపించింది. అబ్బే, అది పువ్వుకాదు. అదో సీతా కోక చిలక. మెల్లిగా దగ్గరకు చేరాడు.

సీతాకోకచిలక ఆకుమీద బద్ధకంగా కూర్చుని,

చిన్నారి రెక్కలను మెల్లి మెల్లిగా ఆడిస్తున్నది.

"అయ్యో! అల్లాగే మరి కాస్సేపు కూర్చుంటురూ!" అని ప్రార్థిస్తున్నట్లు అడిగాడు బేంబి.

"ఎందుకుటా? సీతాకోక చిలకలు ఎక్కడైనా తీరుబడిగా కూర్చుంటాయా?" అని ఆశ్చర్యపడి అడిగింది, సీతాకోక చిలుక.

"నిజమే అనుకోండి. కానీ, ఒక్క నిమిషం ఆగండి. మిమ్మల్ని దగ్గరనుంచి చూడాలని నాకు ఏక సరదాగా ఉంది" అని బతిమాలాడు బేంబి.

"సరే మీరంత బతిమాలుతున్నారు కనక... ఒక్క నిమిషమంటే నిమిషమే సుమోయ్" అంది దర్పంగా సీతాకోక చిలక.

"అబ్బ! ఎంత అందంగా ఉన్నారు! పువ్వులా ఉన్నారు" అన్నాడు బేంబి, మురిసిపోతూ.

"ఏమిటీ, పువ్వులాగా? పువ్వులకన్నా మేమే అందమైన వాళ్లమని మాలో వాడుక. ఇంకా నయం" అని రెక్కలల్లల్లాడించింది సీతాకోక చిలక.

బేంబి సిగ్గుపడ్డాడు. "అవునవును కాదుమరీ?" అని గొణిగాడు. మళ్ళీ, "క్షమించండి. అసలు నేను అనుకున్నదేమిటంటే..."

"మీరేమనుకుంటే నాకేం?" అని అర్ధోక్తిలోనే అందుకుని, సవిలాసంగా సన్నని శరీరాన్ని ఊగిసలాడించుకుంటూ, మీసాలు, రెక్కలు అల్లల్లాడిస్తూ పోకిళ్ళుపోయింది సీతాకోక చిలక.

"అబ్బ! ఇంత అందం ఎక్కడా చూడలేదండీ, నేను తెల్లని రెక్కలు. ఓహ్!"

సీతాకోక చిలక హేలగా రెక్కలు విప్పింది. తెర చాపలలాగా పక్కలకు పరిచింది.

బేంబి తల ఊపి మెచ్చుకున్నాడు. "నిజమే మరి. చూస్తుంటే తెలుస్తుంది. మీ అందం ఆ పిచ్చి పువ్వు కెక్కడిది? పైగా మీకు ఎగరడంకూడా చేతవును. పువ్వు లేం ఎగురుతాయి? పుట్టిన చోటికీ, వాటికీ పుస్తి!"

సీతాకోక చిలక గర్వంగా రెక్క లాడించింది. సునాయాసంగా, తేలికగా పైకి లేచింది. అసలు అది పైకి లేచి పోతూందని బేంబి కనిపెట్టనేలేకపోయాడు. అది తెల్లని చిన్నారి రెక్క లాడించుకుంటూ గాలిలో తేలిపోతూ బేంబి చుట్టూ గిరికీలు తిరిగింది.

"మీ రంతగా అడిగారు కనక ఇంతసేపు ఒక్కచోట కూర్చున్నాను కానీ, అసలు నాకు తీరుబడి ఏదీ వస్తా? వస్తా!" అంటూ, అల్లా అల్లా ఎగిరి ఆకాశంలో కలిసిపోయింది.

* * *

అడవిలో లోపలగా ఎక్కడో మారుమూల ఉంది, బేంబి అమ్మగారి ఇల్లు. చిన్నదిగా, ఇరుకుగా అమ్మకూ, బేంబికీ సరిపడీ సరిపడకుండా ఉంటుంది. పైకప్పు మరీ కిందుగా ఉంది. అమ్మ నిలబడితే కొమ్మలు నెత్తికి రాసుకుంటాయి. దానికి పది అడుగులలో లేళ్ళు నడిచివెళ్ళే కాలిదారి ఒకటి ఉంది. దారికి అంత దగ్గరగా ఉందా, అయినాసరే, అక్కడో ఇల్లు ఉందని కనిపెట్టడం ఎవరి తరమూ కాదు. పొదలలోకి

కళ్లు పొడుచుకు చూస్తే ఏమన్నా కనిపిస్తుందేమో! అడవిలో కొమ్మలు, ఆకులమధ్యనుంచి ఎల్లాగో సందు చేసుకుని, సూర్యుడి వెలుతురు రేక నేలమీద పడుతుందేమో కానీ, అడవి తీగలతో అల్లిబిల్లిగా అల్లుకుపోయిన ఆ ఇంట్లో సూర్యుడు పిసరంత కూడా కనపడడు. సరిగ్గా అక్కడ పుట్టాడు బేంబి.

అమ్మ అలిసిపోయి గాఢంగా నిద్రపోతున్నది. బేంబికి కూడా నిద్ర పట్టింది. కానీ, అంతలో చటుక్కున మెలుకువ వచ్చేసింది. కాళ్లమీద చెంగున లేచి నిలుచున్నాడు. అటూ ఇటూ చూశాడు. ఇల్లంతా నీడలో చీకటి చీకటిగా—సాయంకాలం అయిపోయినట్లే అనిపిస్తున్నది. అడవిలోనుంచి సన్నగా ధ్వనులు వినవస్తున్నాయి. ఎప్పటిలాగే పిచికల కిచ కిచలు, వడ్రంగి పిట్టల ముక్కుపోట్లు, కాకుల బొంగురు గొంతులు — రకరకాల ధ్వనులన్నీ అడవిలో అలుముకొని ఉన్న గాఢ నిశ్శబ్దంలో అణిగి, కలిసిపోతున్నాయి. అది జాగ్రత్తగా వింటే ప్రత్యణువూ శబ్దమయంగా వినబడుతుంది. గుయ్యారంలాంటి ఆ ఇంట్లో ఉక్కగా, తిక్కగా ఉంది.

బేంబి ముందుకు వంగి అమ్మ చెవిలో పలకరించాడు. "నిద్దరపోతున్నావా?"

లేదు. అమ్మ అప్పుడే నిద్దర లేచేసింది. బేంబి లేచి నిలబడ్డప్పుడే ఆమెకూ మెలుకువ వచ్చేసింది.

"మనం ఇప్పుడేం చేద్దామే, అమ్మా?"

"ఏమీలేదు. మనకి చెయ్యవలసిన పను లేమీ లేవు. చక్కగా పడుకో నిద్రపో.".

కానీ, బేంబికి నిద్రపోవాలని లేనే లేదు.

"వెళదామే, అమ్మా! అల్లా అల్లా మైదానంలోకి వెళదాం, రా!" అని గారాలు కుడిచాడు.

అమ్మ తల ఎత్తింది. ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసింది.

"మైదానంలోకా? ఇప్పుడు?" అమ్మ గొంతుకలో భయం వినపడింది.

"ఇప్పుడు— అసలు— మైదానంలోకి వెళ్లనేకూడదూ?"

అమ్మ దృఢంగా ఒత్తి ఒత్తి చెప్పింది. "వీల్లేదు. ఇప్పుడు వెళ్లకూడదు."

ఎందుకనో? ఇందులో ఏదో రహస్యం ఉంది. ప్రమాదం ఏదో ఉన్నట్లు బేంబి పసికట్టేశాడు. ప్రమాదంలో ఆతనికి భయం తెలియదు. భయానికి బదులు అదంతా ఏమిటో ఆమూలాగ్రం తెలుసుకోవాలనే కోరిక బేంబిలో కొనలు సాగింది.

"ఇప్పుడు ఎందుకు వెళ్ళకూడదో చెప్పు? అమ్మా!"

"పెద్దవాడివయాక అన్నీ నీకే తెలుస్తాయి."

"కాదు. ఇప్పుడే చెప్పాలి." మారాం చేశాడు బేంబి. కానీ, అమ్మ ఒప్పుకోలేదు.

"తరువాత నీకే అర్థం అవుతుందిలే. ఇంకా పసివాడివి. పసిపిల్లలకు ఇలాంటివి చెప్పకూడదు. చెప్పినా తెలియనూ తెలియవు. ఇల్లాంటి వేళప్పుడు — పట్టపగలు — మైదానంలోకి! ఇంకేమైనా ఉందా?"

"మనం ఓసారి ఇదివరకే మైదానంలోకి వెళ్ళాం.

కదమ్మా ?"

"అది వేరు. మనం వెళ్లింది తెల్లారకట్ట."

"అయితే, తెల్లారకట్టగాని వెళ్లకూడదా ?"

బేంబికి అన్నీ తెలుసుకోవాలనే కోరిక ఎక్కువ అమ్మకు అడిగినవన్నీ చెప్పే ఓపిక ఎక్కువ.

"అవును. తెల్లారకట్ట వెళ్లవచ్చు. చీకటి పడ్డాకా వెళ్ళవచ్చు."

"అయితే, పగలు ఎప్పుడూ వెళ్ళకూడదూ ? ఎప్పుడూ ?"

అమ్మ క్షణం ఆలోచించింది. "మనవాళ్లు కొంతమంది అప్పుడప్పుడు పట్టపగలు కూడా అక్కడికి వెళ్లుతూ ఉండడం కద్దు" అంది ఆఖరిని.

మళ్ళీ ఓ నిమిషం ఆలోచించి అంది: "కానీ అవి అన్నీ నీకు చెప్పడం సాధ్యంకాదు. బొత్తిగా పసివాడివి. అక్కడికి పగలు వెళ్ళినవాళ్ళకి చాలా అపాయం !"

"అపాయం అంటే ?"

"చూశావా ? చెబితే నీకు అర్థం కాదు మరి."

'అమ్మ నాకు సరిగ్గా విడమరిచి చెబితే బాగానే అర్థం అవుతాయి నాకు !' మనస్సులోనే అనుకున్నాడు. కానీ పైకి ఏమీ అనలేదు.

మళ్ళీ అమ్మే మొదలుపెట్టింది. "మేమందరంకూడా పగలు అంటే మురిసిపోయేవాళ్ళం. చిన్నతనంలో మరీను. అయితే మనం పగలంతా దాక్కోక తప్పదు. చీకటి పడ్డప్పటి నుంచీ మళ్లీ తెల్లవారేదాకా నీ ఇష్టం. తిరగవచ్చు. తెలి

సిందా ?"

"ఊఁ."

"అందుకని, మనం పగలు ఇంట్లోనే ఉండాలి. ఉంటే భయం ఉండదు. ఇంక మరి బబ్బో."

ఊహూ. బేంబి అనుమానాలు ఇంకా తీరలేదు.

"ఇక్కడ భయం ఎందుకు లేదు ?"

"ఎందుకంటే — ఈ పొదలు, ఆకులు, తీగలు దట్టంగా ఉన్నాయి కదూ! మనం ఎవ్వరికీ కనిపించం. పైగా కాకిబావ అల్లంత ఎత్తున ఎగురుతూ పహారా ఇస్తూ ఉంటాడు. వీళ్ళందరూ మనకి స్నేహితులే. అన్నిటికన్నా ముఖ్యంగా — నేల మీద పడ్డ ఎండుటాకు లున్నాయి చూశావూ! అవి మనకి మరీ మరీ దగ్గర స్నేహితులు. పరాయివా డెవడైనా ఈ ప్రాంతాలలో ఎక్కడైనా దాక్కోవచ్చు. తీగలు, డొంకలు కదల్చకుండా జాగ్రత్తగా నడిచి రావచ్చు. పహారా ఇస్తున్న కాకిబావని మోసంచేసి నక్కి నక్కి రావచ్చు. కానీ, అలా చూడు — నేలంతా కప్పేసినట్లున్నాయి — అవి అన్నీ కిందటి ఏడాది ఎండి రాలి పడిపోయినవే. ఈ ఆకులను మోసం చెయ్యడం ఎవ్వరి తరం కాదు. అడుగేసేసరికి గలగల లాడతాయి. ఎవడో వస్తున్నాడని మనకి తెలిసిపోతుంది."

కిందటి ఏడాది అంటే ఏమిటో; ఆకులు రాలడం, పడడం అంటే ఏమిటో బేంబికి అర్థం కాలేదు.

"ఇల్లా నా పక్కని కూర్చో. అన్నీ చెబుతాను" అంది అమ్మ.

బేంబి బుద్ధిమంతుడిలాగ, అమ్మను ఆనుకుని కూర్చుని

జాగ్రత్తగా వింటున్నాడు. అమ్మ తన కథ మొదలుపెట్టింది.

"ఇది వేసవికాలం. సూర్యుడు నిండుగా వెలుగుతూ వెచ్చదనాన్ని కుమ్మరించేస్తున్నాడు. అడవిలో చెట్లన్నీ ఆకు పచ్చగా కలకలలాడు తున్నాయి. కాని ఎప్పుడూ ఇలాగే ఉండదు. కొన్నాళ్ళుపోయాక సూర్యుడికి ఓపిక తగ్గిపోతుంది. ఆ కాంతిలో వెచ్చదనం ఉండదు. అప్పుడు చెట్లమీద ఉన్న ఆకుల రంగుకూడా తగ్గిపోతుంది. పచ్చబడతాయి. ఎర్రబడ తాయి. ఎండిపోతాయి. మెల్లిమెల్లిగా పట్టుజారి నేల మీద పడిపోతాయి. అప్పుడు ఈ చెట్లన్నీ బోడిగా మోడులైపోతాయి. నల్లబడిపోయిన బోసికొమ్మలను ఊగించుకుంటూ జాలిగా ఆకాశంకేసి చూస్తూఉంటాయి. కింద పడిపోయిన ఆకులన్నీ నేలని కప్పేస్తాయి. ముట్టుకుంటే చాలు. గరగరలాడుతూ పెద్ద గోలచేస్తాయి. ఏదీ, నక్కుతూ, చప్పుడు కాకుండా అటూ ఇటూ నడు, చూద్దాం! ఈ ఎండు టాకులు ఎంత మంచివి! ఎంత నమ్మకంగా, అలిసిపోకుండా, మరిచిపోకుండా తమ పని చేస్తాయి! ఆఖరికి ఈ నడివేసంగుల్లో కూడా, ఎత్తుగా పెరిగిన గడ్డిలో దాక్కుని 'పహారా హుషార్' అంటూనే ఉంటాయి."

అమ్మ దగ్గరగా జరిగాడు బేంబి. మైదానం సంగతే మరిచిపోయాడు. ఆమె కథ విని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. ఎండుటాకులంటే ఏదో చెప్పలేని అభిమానం అతనిలో మొల కెత్తింది. ఏనాడో ఎండి, రాలిన ప్రాణంలేని ఆకులు ఇప్పటికీ పరోపకారం చేస్తూనేఉన్నాయి. ఎంత మంచివో! అమ్మ మాటి మాటికీ అపాయం, అపాయం అంటూ ఉంటుంది.

ఏమిటో అది? ఆలోచించాడు, ఆలోచించాడు. అలిసి పోయాడు. అంతటా నిశ్శబ్దం. పొదరింటికి పైన ఆకాశంలో గాలి సూర్యుడి వేడికి కుతకుతలాడుతున్నది. బేంబి కళ్ళు మూసుకుని నిద్రపోయాడు.

♦ ♦ ♦

ఒక రోజు సాయంకాలం బేంబి అమ్మతో కలిసి మైదానంలోకి వెళ్ళాడు. అక్కడివన్నీ తనకు కొట్టిన పిండి అని అతని గర్వం. చూడదగ్గవన్నీ చూసేశాననీ, వినదగ్గవన్నీ వినేశాననీ అనుకుంటున్నాడు. కానీ, తీరా చూస్తే తాను అనుకున్న వాటికంటే ఇంకా ఎన్నో తెలుసుకోదగినవి మిగిలి పోయే ఉన్నాయి.

మొట్టమొదట అన్నీ వెనకటిలాగే కనిపించాయి. చాలాసేపు అమ్మతో తూతుమ్మొండ ఆడాడు. మైదానంలో బొంగరంలా తిరిగేశాడు. విశాల నీలాకాశం కింద స్వచ్ఛంద మైన గాలిలో తిరుగుతుంటే అతను ప్రపంచాన్నే మరిచి పోయాడు.

అంతలో అమ్మ చటుక్కున నిలబడిపోయింది. అది చూసి తానూ ఆగాడు. చటుక్కున ఆగిపోవడంలో కాళ్ళు నాలుగూ నాలుగు దిక్కులకూ తన్నిపెట్టవలసి వచ్చింది. మళ్ళీ వాటిని దగ్గరగా తీసుకోవడానికి అంత ఎత్తు ఎగరవలసి వచ్చింది.

చూస్తుంటే. అమ్మ ఎవరితోనో మాట్లాడుతున్నట్లు కనిపించింది. కాని, పొడుగుపాటి గడ్డిలో అవతలివా రెవరో తెలియరావడంలేదు. బేంబి దగ్గరగా వచ్చాడు. అమ్మ

పక్కన అవిరిగడ్డి కదులాడింది. మధ్యన రెండు చెవులు - పెద్ద పెద్ద చెవులు - బూడిదరంగు చెవులు - అక్కడక్కడ నల్లని చారలువేసిన చెవులు - కనిపించాయి. బేంబి ఇదివర కెప్పుడూ అంతంత పెద్ద చెవులు చూడలేదు. కాస్త భయ పడి దూరదూరంగా జరిగాడు. అమ్మ పిలిచింది.

"ఇల్లా రారా, కన్నా! ఈయన మన స్నేహితుడే. కుందేలు మామయ్య. దగ్గరగా రా. భయంలేదు. నిన్ను చూస్తానంటున్నాడు."

బేంబి మరోసారి పిలిచేదాకా ఆగలేదు. ముందుకు వచ్చాడు. ఎదురుగా కుందేలు మామయ్య కూర్చున్నాడు. ఆయన పెద్ద పెద్ద చెవులు గరిటెలలాగా ఒక్కొక్కసారి నిటారుగా పైకి నిలుచుంటాయి. మరునిమిషంలో నీరసం వచ్చినట్లు ందికి వాల్చేస్తూ ఉంటాడు. ఆయన చిన్నారి



మూతిమీద పొడుగుపాటి మీసాలు అస్తమానం అటూ ఇటూ కదులుతున్నాయి. కుందేలు మామను చూసి బేంబి వింత పడ్డాడు. అంతంత మీసాలున్నా అతడు పొగరుబోతు అనిపించడమే లేదు. ముఖం తీర్చి దిద్దినట్లు ముద్దుగా ఉంది. చక్కని కళ్ళు గుండ్రంగా, మెరుస్తూ, తళుక్ తళుక్ అని అటూ ఇటూ కదులుతూనే ఉన్నాయి.

కుందేలు మామ బహు మంచివాడు. స్నేహపాత్రుడు అనుకోనడానికి సందేహపడే అవసరం లేకపోయింది.

"ఏం, బుజ్జోడా! బాగున్నావా?" అని పలకరించాడు, కుందేలు మామయ్య.

బేంబి తల మాత్రం ఊపి ఊరుకున్నాడు. ఆయన అల్లా ఆప్యాయంగా పలకరిస్తూంటే తాను తల మాత్రమే ఊపి ఎందుకు ఊరుకున్నాడో తనకే తెలియదు. ఆ శిరః కంపనం వినయాన్ని, మర్యాదను తెలియజేస్తుంది. నిజమే. కానీ, కొంతవరకూ తాను తక్కువ వాడినన్న భావాన్ని కూడా వ్యక్తం చేస్తుందేమో? ఏమో! అది తనకు పుట్టుతో వచ్చిన లక్షణమేమో?

"మీ అబ్బాయి యువరాజా వారిలా ఉన్నాడమ్మా! ఏమి సొగసు!" అని మెచ్చుకున్నాడు కుందేలు మామ. చెవులు ఓసారి నిటారుగా నిలుచోపెడుతూ, మరోసారి హఠాత్తుగా కిందికి దించేస్తూనే సదే పదే బేంబి కేసి చూస్తు న్నాడు. ఈ చెవులు ఆడించే అలవాటు బేంబికి అంతగా నచ్చలేదు. చెయ్యాలని చేస్తున్నట్లు అనిపించింది.

కుందేలు మామ తన గుండ్రని కళ్ళతో బేంబి కేసి

తదేకంగా చూస్తూనే ఉన్నాడు. అతని ముక్కు, నోరు, అంతలేసి మీసాలు అప్రయత్నంగా కదలసాగాయి. ఏమన్నా రాబోతూంటే ఆపుకుంటున్నాడేమో అన్నట్లున్నాయి, ఆ కదలికలు.

బేంబి పకపకా నవ్వేశాడు. అతడి నవ్వుకు కుందేలు మామా నవ్వాడు? కాని, ఆయన కళ్ళు మాత్రం దేనినో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లే ఉన్నాయి.

"పిల్లాడు రత్నంలా ఉన్నాడమ్మా! ఓహోహో! చాలా అదృష్టవంతురాలివి. యువరాజు! యువరాజుని కన్నావు."

కుందేలు మామ ఒళ్ళు విరుచుకుని, వెనకకాళ్ళు రెండింటిమీదా కూర్చోవడం చూసి, బేంబి ఆశ్చర్యపోయాడు. ఎందుకో చెవులు రిక్కించి అతి జాగ్రత్తగా విన్నాడు. ముక్కు నిండుగా గాలిపీల్చి ఏమిటో వాసన చూశాడు. అంతలో స్థిమితపడి, మళ్ళీ నాలుగు కాళ్ళమీదా నిలుచున్నాడు.

"యువరాజాని చూడడం పడింది ఈవాళ. చాలా సంతోషం. ఇవాళ ఇంటిదగ్గర బోలెడంత పని ఉంది. మరి వెళ్ళివస్తాను" అని వినయంగా కుందేలు మామ తల వంచాడు. వెనక్కు తిరిగి, చెవులు వీపుమీదికి బల్లాలలాగా వంచి రివ్వున బాణంలా దూసుకుపోయాడు.

"సెలవు!" అన్నాడు బేంబి. అమ్మ నవ్వుకుంది.

"కుందేలు మామయ్య చాలా అమాయకుడు. ఎంతో వినయం, ఎంతో మంచితనం. అయితేనేం, పాపం. అతనికీ రోజులు అతి కష్టంగానే నడుస్తున్నాయి." ఆమె హృద

యంలో జాలి, దయ నిండి వచ్చాయి.

అమ్మ భోజనం చేస్తూంటే, అలా అలా తిరిగి వద్దామని బయలుదేరాడు బేంబి. పాత స్నేహితులెవరైనా కనపడతారేమోననీ, కొత్త జతగాళ్ళు దొరుకుతారనీ వూహించుకుంటున్నాడు. ఎదురు చూడడంలో ఉన్న మజా అతడికి చాలా ఇష్టం. అంతలో ఏదో చప్పుడు చెవులను దూసుకుపోయింది. ఎవరివో అడుగుల చప్పుడు. బేంబి మెడ రిక్కించి చూశాడు. దూరంగా మైదానం చివర గడ్డిలో ఏదో మెరిసినట్లుఉంది. ఏదో జీవం. దాని వెనకాల ఇంకోటి. బేంబి గిరుక్కున తిరిగి, అమ్మకేసి చూశాడు. అతడికి ఏం చెయ్యాలో తెలియదు. అయితే, అమ్మ ఏమీ భయపడ్డట్లు కనిపించలేదు. వంచిన తల ఎత్తకుండా భోజనం చేస్తున్నది. ఆ కొత్త జీవాలు అచ్చు తనలాగే ఎగురుతూ, గిరికీలు కొడుతున్నాయి. బేంబికి జంకు పుట్టింది. అప్రయత్నంగా వెనక్కు వెనక్కు జరిగాడు. పారిపోవడానికి సిద్ధంగా నిలుచున్నాడు. ఆ కంగారు చూచి అమ్మ తల ఎత్తింది.

"ఏం జరిగిందిరా?"

బేంబికి నోట మాట రావడం లేదు. కొత్త జీవాలున్న వైపు చూపిస్తూ "అక్కడ! అక్కడ!" అని గొణిగాడు. అమ్మ అతడు చూపిన దిశగా చూసింది.

"ఓహో! ఆవిడా? మన బంధువే. ఏణిపిన్ని! దానికూడా ఓ నలుసు ఉండి ఉండాలి. అరే! ఇద్దరు!"

బేంబి కళ్ళు ఇంత చేసుకు చూశాడు. దూరంగా మైదానం అడివిని కలుసుకునేచోట తన తల్లిలాంటిదే ఒక

జీవం కనిపించింది. ఆశ్చర్యం! ఇంతవరకూ ఆమెను తాను చూడనే లేదు. ఆవిడ పక్కనే ఇందాకటిలాగే ఎవరో గిరి కీలు కొడుతున్నారు. ఎక్కడా ఆ గడిలో పోలికలు తెలియడం లేదు. ఎర్రని వీపులు. వాటిమీద ఏవో చుక్కలు, మధ్య మధ్య కనిపిస్తున్నాయి.

"నడు, వెళదాం! నీతో ఆడుకోనడానికి ఆఖరికి పిల్లలు దొరికారు" అని అమ్మ అటు దారితీసింది.

'ఆడుకోనః పిల్లలు' అనే మాట వినేసరికి బేంబి బాణంలా దూసుకుపోయేవాడే. కానీ, అమ్మ నెమ్మదిగా అడుగులు వేస్తూ నడుస్తున్నది. అడుగడుగుకూ అటూ ఇటూ జాగ్రత్తగా చూసుకుంటున్నది. అందుచేత తాను కూడా మెల్లిగా నడవవలసివచ్చింది. అంత మెల్లిగా నడవడం బేంబి కేమీ నచ్చలేదు. చిరాకు పుట్టింది.

అమ్మ తనలో తానే ఏదో మాట్లాడుకుంటున్నది. బేంబి ఆశ్చర్యంగా వింటున్నాడు.

"ఏమిటో! ఏణి కనబడడమే లేదేం చెప్మా, అను కునే దాన్ని. ఇప్పుడు తెలిసింది. దానికి కూడా ఓ పిల్లో, పిల్లాడో ఉండి ఉండాలని అనుకున్నాను. కానీ, కవలలు!"

ఏణి తన బంధువునూ, ఆమె పిల్లాడినీ చూచింది. తన పిల్లలను పిలిచి, వాళ్ళకు ఎదురు నడిచింది. తన జత గాళ్ళ కేసి తప్ప బేంబి మనోవైపు చూడడమే లేదు. ఏణి బేంబిని ముద్దుగా పిలిచింది.

"ఇదిగో చూడు! వీడు గోబో! ఇది ఫలీనా! వీళ్ళతో ఆడుకో!"

పిల్లలు ముగ్గురూ ఒకళ్ళకేసి ఒకళ్ళు కళ్లార్పకుండా చూస్తూ ప్రతిమల్లా నిలుచున్నారు. ఫలీనా పక్కన గోబో, వారి కెదురుగా బేంబి.

"ఎవరెవరో వాళ్ళే తెలుసుకుంటారు, పోనీ" అంది అమ్మ.

"మీ అబ్బాయి ఎంచక్కా ఉన్నాడు — ముద్దొస్తూ బలంగా, హుషారుగా !" అంది ఏణి.

అమ్మ ఉబ్బిపోయింది. అయినా సాచేసింది. "ఏదో ఫరవాలేదు. కాని, నీకు ఇద్దరు కలిగారు !"

"ఏదో, మన చేతిలో ఏముందీ ? నీకు తెలుసుగా— నాకు పిల్లల విషయంలో ఎప్పుడూ లోటు జరగలేదు."

"నాకు వీడే తొలి చూలు" అంది అమ్మ.

"చూశావో లేదో. మళ్ళీ మళ్ళీ కనడం ఉంటుంది, ఉండకపోతుందీ ! ఎప్పుడు ఏం జరగబోతుందో ఎవరికి తెలుసు !"

పెద్దవాళ్లు ఇద్దరూ ఊసులాడుకుంటూంటే కళ్ళు చికిలిస్తూ పిల్లలు అల్లాగే కదలకుండా నిలుచున్నారు. ఒక్కరూ ఒక్కమాట మాట్లాడలేదు. ఉన్నట్లుండి ఫలీనా బంతిలా పై కెగిరి పక్కకు గంతు వేసింది. అర్థంలేని ఈ కాలయాపన ఆమెకు నచ్చలేదు.

బేంబి ఆమెవెంట పడ్డాడు. అతని వెనక గోబో. ఒకళ్ళనొకళ్లు తరుముకున్నారు. ముందు వెనుకలకు పరుగెత్తారు. వాళ్ళ కది బహు సరదాగా ఉంది. ఆయాసం వచ్చాక వగరుస్తూ నిలబడ్డారు. ఇక్కడికి పరిచయం స్థిర

పడ్డట్టే. ఒక దగ్గరకు చేరాకు. కబుర్లు చెప్పుకున్నారు. గొల్ల భామతోనూ, సీతాకోక చిలకతోనూ తాను మాట్లాడిన వైనం స్నేహితులకు చెప్పేశాడు బేంబి.

"నువ్వు ఆరుద్ర పురుగుతో మాట్లాడావా :" అని అడిగింది ఫలీనా.

లేదు. ఆరుద్ర పురుగుతో బేంబి మాట్లాడలేదు. పరిచయమే కాలేదు. నిజం చెప్పాలంటే ఆ పురుగును అసలు కళ్ళతో చూడనేలేదు.

"నేను తరుచు ఆరుద్ర పురుగుతో మాట్లాడుతూ ఉంటాను" అంది ఫలీనా, కాస్త గర్వంగా మెడ తిప్పి.

"నన్ను గద్ద తిట్టింది" అన్నాడు బేంబి.

"నిజంగా !" చాలా ఆశ్చర్యపడ్డాడు గోబో. నిజంగా తిట్టిందా :"

"నన్ను ముళ్ళపంది ముక్కుమీద పొడిచింది"అన్నాడు గోబో.

నిజం చెప్పాలంటే గోబో వట్టి అమాయకుడు.

"ఇంత ఆ ముళ్ళపంది ఎవరేమిటి ?" అని బేంబి అడిగాడు.

"యాక్ రారీ! ముళ్ళపంది అంటే నాకు అసహ్యం. ఒంటినిండా ముళ్ళు. ఏమీ బాగుండదు. వట్టి పొగరుబోతు" అంది ఫలీనా.

"పాపం ! అంత పొగరుబోతు ఏమీ కాదే. ఎవళ్ళకీ అపకారం చెయ్యదు" అన్నాడు గోబో.

"ఓహో చెప్పాడయ్యా ! నిన్ను పొడవలేదా ?" అంది

వెంటనే ఫలీనా.

గోబో ఒప్పుకున్నాడు. "అవుననుకో. నేను మాట్లాడమని వెంటపడి విసిగిస్తే కుట్టాడు. అయితే నాకు నెప్పేమీ కలగలేదు."

బేంబి గోబోకేసి తిరిగాడు. "నీతో మాట్లాడడానికి ఆయనకి ఎందుకు ఇష్టంలేదు?"

"ఆయనకి అసలు ఎవ్వళ్ళతోనూ మాట్లాడాలని ఉండదు" అని ఫలీనా కలిగించుకుని చెప్పింది. "ఎవళ్ళయినా దగ్గరగా వెళ్ళితే ముళ్ళు బయటికి తీసి కుట్టేస్తాడు. మా అమ్మ చెప్పింది — అసలు ఆయనకి ఎవ్వళ్ళతోనూ జత లేదుట."

"భయమేమో:" అన్నాడు గోబో.

కానీ, ఫలీనా అంగీకరించలేదు. "అసలు ఆయనకి దూరంగా ఉండడమే మంచిదని అమ్మ చెప్పింది."

బేంబి రహస్యంగా గోబోను అడిగాడు: "నీకు అపాయం అంటే ఏమిటో తెలుసా:"

ముగ్గురూ మాటలు దక్కి ఒకళ్ళ నొకళ్ళు చూసుకుంటూ నిలుచుండిపోయారు.

గోబో ఆలోచనలో పడ్డాడు. అతనికీ అపాయం అంటే ఏమిటో తెలుసుకోవాలనే ఉంది. కానీ, తెలియదు.

సమాధానంకోసం ఎదురుచూస్తూనే ఉన్నాడు బేంబి.

"అపాయం అంటే...చాలా చెడ్డది అన్న మాట!" అన్నాడు గోబో రహస్యంగా.

"చెడ్డది — అని నాకూ తెలుసోయ్. అసలు ఏమిటి



అది ?"

ముగ్గురూ భయంతో వణికిపోయారు.

అంతలో ఫలీనా హుషారుగా అరిచింది. "అపాయం అంటే నాకు తెలిసింది. దాని అర్థం పారిపోవాలని !"అంటూ ఒక్క గంతు వేసి పక్కకు దుమికింది.

ఏమీ లేనిదానికి భయపడుతూ నిలుచోడం ఆమెకు చిరాకు. గోబో, బేంబి ఆమె వెనకనే పరుగులు తీశారు.

మళ్ళీ ఆట మొదలైంది.

పట్టు కుచ్చులాంటి గడ్డిలో దాగుడుమూతలు ఆడారు. పిల్లి మొగ్గలు వేశారు. కొద్ది క్షణాల క్రితం వాళ్ళను భయ పెట్టిన అపాయం సంగతి మరిచిపోయారు. అలిసిపోయేదాకా ఆడుకుని మళ్ళీ కబుర్లు పెదలుపెట్టారు.

వాళ్ళ అమ్మలు కూడా వృథాగా పొద్దుపుచ్చలేదు. గడ్డి పరకలు మునిపంటితో కొరుకుతూ లోకాభిరామాయణం

విడేశారు.

ఉన్నట్టుండి ఏణితలఎత్తి బిగ్గరగా అరిచింది: "గోబో! ఫలీనా! నడవండి, ఇంటికి పోదాం!"

బేంబి అమ్మకూడా కొడుకును పిలిచింది. "మనకీ వేళైంది. నడు, బాబూ!"

"అమ్మా! ఇంకొంచెంసేపే. ఒక్క నిమిషం అంటే ఒక్క నిమిషమేనే" అని బతిమాలింది ఫలీనా.

"ఇక్కడ ఎంచక్కా ఉంది. ఇంకాస్సేపు ఉందామే" అని గారాలు కుడిచాడు బేంబి.

"ఇంకొంచెంసేపు" అని సిగ్గుపడుతూ నసిగాడు గోబో.

అంతలో ఒక చిత్రం జరిగింది. ఆ సంగతి బేంబికి ఎన్నడూ మరుపురాదు.

అడవిలోనుంచి మేఘాలు ఉరిమినట్లు అనిపించింది. భూమి దద్దరిల్లినట్లు ఉలిక్కిపడ్డారు పిల్లలు. కొమ్మలు జరజర లాడాయి. ఆకులు గలగల లాడాయి. చరచరలు, గరగరలు వినిపించాయి.

తుఫానులాగా దౌడుతీస్తూ ఇద్దరు మైదానంలోకి దూసుకువచ్చారు. పొదలమాటున అదృశ్యమయ్యారు అంతలో. ఓ నిమిషం గడిచాక మళ్ళీ అక్కడే కనిపించారు. అంత దూరంలో ఒకళ్ళకొకళ్లు ఎదురుగా శిలా ప్రతిమల్లా నిలబడ్డారు.

బేంబి మంత్రముగ్ధుడిలాగా వాళ్ళకేసి చూస్తూ నిల బడ్డాడు. వాళ్లు కూడా తన అమ్మ, ఏణి పిన్ని పోలికలోనే ఉన్నారు. అయితే ఇద్దరి నెత్తిమీదా ఏవో కిరీటాలు

వున్నాయి. ఆ కిరీటాలు చెట్ల కొమ్మలలా ఉన్నాయి. బూడిదరంగు పూసలు గుచ్చినట్లు తెల్లని చివరలు.

బేంబి నిశ్శబ్దంగా ఒకళ్ళనువిడిచి ఒకళ్ళను చూస్తున్నాడు. వారిలో ఒకడు కాస్త పొట్టిగాఉన్నాడు. ఆయన కిరీటంకూడా పొట్టిగానే ఉంది. రెండవ ఆయన కొండలా అంత ఎత్తైన మహాగంభీరంగా ఉన్నాడు. గర్వంగా తలఎత్తి చూస్తున్నాడు. ఆ తలమీద అంత ఎత్తైన కిరీటం. కిరీటం శాఖోపశాఖలతో, తెల్లని చిగుళ్ళతో ధగధగా మెరిసిపోతున్నది.

"ఓహో!" అంది ఫలీనా ఆశ్చర్యంగా.

"ఓహో!" అని గోబో ఫలీనాను అనుకరించాడు.

బేంబి నిశ్శబ్దంగా ఉన్నాడు.

ఆ పెద్ద లేళ్లు రెండూ కదిలాయి. తిరిగి అడవిలోకి వేరు వేరు దిక్కులకు వెళ్లిపోయాయి. ఆ పెద్ద లేడిమాత్రం పిల్లలకు దగ్గరలోనుంచే నడిచి వెళ్ళింది. అందంగా, ఠీవిగా, దర్జాగా అడుగులేస్తూ, కిరీటాన్ని పైకి ఎత్తిపట్టి, ఎవళ్ళకేసీ చూడకుండా వెళ్లిపోయింది. అది అడవిలో మాయం అయిపోయేవరకూ ఆ పిల్లలు గాలి పీల్చుకోవడానికికూడా భయపడ్డారు. కనుమరుగై పోయాకనే ఒకళ్ళకేసి ఒకళ్లు చూచుకోగలిగారు.

ఫలీనా మొట్టమొదట మాట్లాడింది. "ఎవరీయన?" ఆమె గొంతుక భయంతో జీరపోయింది.

"ఎవరీయన?" అని గోబో ఆమె ననుసరించాడు.

బేంబి నిశ్శబ్దంగా ఊరుకున్నాడు.

ఏణి పిన్ని సమాధానం చెప్పింది. "వాళ్లు నాన్నలు."

అంతకన్నా మరేమీ చెప్పలేదు. తరువాత అందరూ విడిపోయారు. ఏణి పిన్ని పిల్లలను తీసుకుని దగ్గరలో ఉన్న పొదలలోకి వెళ్ళిపోయింది. వాళ్ళ ఇల్లు అటే ఉంది. బేంబి, వాళ్ళ అమ్మ మైదానానికి అడ్డంగా నడిచివెళ్ళి, ముసలి జువ్వి పక్కనుంచే కాలిదారి పట్టారు.

ఇద్దరూ చాలాసేపు మౌనంగా నడిచారు. ఆఖరికి బేంబే అడిగాడు. "వాళ్ళు మనని చూశారంటావా ?"

"ఆ. వాళ్ళు అన్నీ చూస్తారు" అంది అమ్మ.

బేంబికి ఏదో ఆలోచన కలిగింది. అడగడానికి అనుమానించాడు. అడగకుండా ఉండనూ లేకపోయాడు.

"అయితే మరి ... వాళ్లు ... ఎందుకని ..." అని నసిగాడు.

"ఏమిటిరా, నాన్నా !" అని ప్రోత్సాహ మిచ్చింది తల్లి.

"మరి వాళ్ళు మన దగ్గరికి రాలేదేం ?"

"రాలేదు.. కాని, ఆ సమయమూ వస్తుంది..."

"మనతో మాట్లాడలేదేం, వాళ్ళు ?" అన్నాడు అర్థోక్తిలోనే బేంబి.

"ఇప్పుడు వాళ్ళు మనతో మాట్లాడరు. మాట్లాడే సమయం వస్తుంది. ఓపిక పట్టాలి వాళ్లు వచ్చేదాకా. ఎదురుచూడాలి వాళ్లు మాట్లాడేదాకా. అన్నీ వాళ్ళ ఇష్ట ప్రకారమే జరుగుతాయి."

"మరి, నాన్న నాతో మాట్లాడతాడా ?"

"తప్పకుండాను. పెద్దవాడి వయ్యాక, ఆయన దగ్గరకు

వెళ్ళే అధికారం వస్తుంది. అప్పుడు నీతో మాట్లాడతారు.

బేంబి నిశ్శబ్దంగా అమ్మ పక్కగా నడుస్తున్నాడు. ముందెప్పుడో నాన్నగారిని కలుసుకోవాలనే ఆశ అతనిలో ఎంతో సంచలనాన్ని కలిగించింది.

"ఆయన ఎంతఅందంగా ఉన్నాడో! ఎంతగాంభీర్యం!" అన్నాడు ఆ పెద్ద లేడిని తలుచుకుంటూ.

"నాయనా! గండాలుగడిస్తే, ప్రమాదాలన్నీ దాటితే కొన్నాళ్ళకి నువ్వూ మీ నాన్నగారిలాగే మంచి బలంగా తయారవుతావు. నీకూ నెత్తిమీద చక్కని కిరీటం అమరు తుంది."

బేంబి దీర్ఘంగా నిశ్వసించాడు. ఆనందం, ఆందోళన, ఆశలతో అతని మనస్సు నిండిపోయింది.

కాలం గడుస్తున్నది. ప్రతి రోజూ ఏవో కొత్త కొత్త వింతలు, విశేషాలు తెలుసుకుంటున్నాడు బేంబి. ఇంకా ఎన్ని తెలుసుకోవాలో, ఎన్ని నేర్చుకోవాలో.

అతి జాగ్రత్తగా వినడం నేర్చుకున్నాడు. పక్కనే జరిగే శబ్దాలు వినడంలో గొప్పా లేదు; తెలివీ లేదు. బహు దూరానివి, వినపడీ వినపడనట్లు గాలిలో తేలివచ్చినవి ఇప్పుడు వినగలుగుతున్నాడు. అడవిలోని ప్రతి గల గల ధ్వనీ అర్థం అయిపోతున్నది. ఎక్కడో దూరాన ఓ పొద పక్కనుంచి ఓ అడవి కోడి పరిగెత్తితే ధ్వనినిబట్టి ఆ సంగతి తెలుసుకుం టున్నాడు. రాత్రి వేళ తలకింద పక్షులు ఎగిరిపోతూంటే ధ్వనినిబట్టి తెలుసుకోగలడు. అడవి ఎలకలు పొదలలో పరి గెడుతున్నప్పుడు వాటి మెత్తటి అడుగుల చప్పుడు గుర్తు

పట్టగలడు. కాకి, గోరువంకల బహుపరాక్కులు అర్థం అయ్యాయి. ఏ గద్దో, డేగో కనిపిస్తే అవి కోపంతో అరిచే అరుపుల ప్రత్యేకత తెలిసింది. అడవి పావురాల కువ కువలు, అడవి బాతుల క్వాక్వాలు, ఇంకా ఎన్నో ఎన్నో తెలుసుకున్నాడు.

క్రమ క్రమంగా వాసన పసికట్టడం నేర్చుకున్నాడు. ముక్కు రంధ్రాలు పెద్దవిచేసి, గాలి నిండుగా పీల్చుకుని, వాసనలు తెలుసుకోవడం అలవాటు చేసుకున్నాడు. పచ్చిక మీద నుంచి గాలి తెర వచ్చినప్పుడు – 'ఇది నిమ్మగడ్డి' 'అదిగో గడ్డి చేమంతి', 'ఇక్కడే దగ్గరలో ఎక్కడో స్నేహితుడు కుందేలు ఉన్నాడు' – ఇల్లా తనలో తనే అనుకుంటూ ఉంటాడు. మట్టివాసన, ఆకుల వాసన, చెట్లవాసన వేరు వేరుగా గమనించగలుగుతున్నాడు. వాసననుబట్టి మానుపిల్లి వస్తున్నట్లు, నక్క వేటకు బయలుదేరినట్లు తెలుస్తున్నది. ఏణి పిన్ని, పిల్లలు కంటికి కనపడకపూర్వమే వాళ్ళ అజ తెలుసుకుంటున్నాడు.

జేంబికీ రాత్రిళ్ళు అంటే ఇష్టం పుట్టింది. పట్టపగలు షికారు వెళ్ళాలనే కోరిక పూర్తిగా పోయింది. పగలంతా పొదరింట్లో, ఆ మసక చీకట్లో అమ్మ పొట్ట నానుకుని వెచ్చగా నిద్రపోతాడు. అప్పుడప్పుడు మేలుకుని జాగ్రత్తగా వింటాడు. జాగ్రత్తగా వాసన చూస్తాడు – చుట్టుపక్కల ఏం జరుగుతున్నదో తెలుసుకోవడానికి. అంతా మామూలుగానే ఉంటుంది. పిచికలు ఊరికే కిచకిచలాడుతూ ఉంటాయి. నోరు మూసుకుని కూర్చోవడం చేతకాని దోమలు గుయ్యిమంటూ

ఉంటాయి. పావురాలు మెత్తగా ధ్వనిస్తూ ఉంటాయి. వాటితో తనకేం పని? మళ్ళీ కళ్ళు మూసుకు పడుకుంటాడు.

అన్నిటికన్నా బేంబికి బాగా నచ్చినది రాత్రిపూట. ధైర్యంగా, హాయిగా తిరగవచ్చు. అల్లాగని తన జాగ్రత్తలు తాను మరిచిపోవడానికి వీలా? అయితే, రాత్రి జాగ్రత్తలకూ పగటివాటికీ పోలికేముంది? రాత్రి అయితే స్వేచ్ఛగా తిరగవచ్చు. స్నేహితులను కలుసుకోవచ్చు. నిశ్శబ్దంగా ఉంటుంది.

రాత్రిపూటకూడా కొన్ని గొంతుకలు వినిపిస్తూనే ఉంటాయి. అయితే, వాటి సంగతే వేరు.

బేంబికి తెల్లగూబ అంటే చాలా గౌరవం. అది చప్పుడు చెయ్యకుండా తేలికగా ఎగిరిపోతుంది. దాని ముఖంలో ఎన్నో భావాలు కనిపిస్తూ ఉంటాయి. పెద్ద పెద్ద కళ్ళు ధైర్యంగా తీక్షణంగా చూస్తూఉంటే అతను ఆశ్చర్యపోతూ ఉంటాడు. అమ్మతో కానీ, పక్కవాళ్ళతో కానీ మాట్లాడుతూఉంటే వినడం బేంబికి చాలా ఇష్టం. కాని తీక్షణమైన చూపులకు సిగ్గుపడ్డట్లు తల వంచుకుని, ఓ పక్కగా నిలబడుతూ ఉంటాడు. ఆ పెద్ద పెద్ద మాటలు ఏమిటో పూర్తిగా బోధపడవు. పోనీ అని వినకుండా ఉండలేడు.

"ఘూ...ఆ...ఆ! ఘూ...ఆ...ఆ!" అంటూ తెల్లగూబ పాట అందుకుంటూ ఉంటుంది. గిజిగాడు, కోడిపుంజు వగైరా స్నేహితుల పాటలలా ఉండదది. అయినా అది బేంబికి ఇష్టమే. అందులో ఏదో రహస్యమైన భావం, ఏదో తత్వచింతన, ఏదో విచారం నిగూఢమై ఉన్నట్లు వినిపిస్తుంది.

అదికాక చిన్న గూబ ఇంకొకటి ఉంది. అమ్మో,



బలే మోసకారి! అన్ని సంగతులూ దానికే కావాలి. సొంత డబ్బా తెగ వాయించుకుంటుంది. వట్టి గర్విష్ఠి.

“ఊ ఇక్! ఊ ఇక్!” అంటూ చెవులు చిల్లులు పడే లాగా భయంకరంగా అరుస్తుంది. అది వింటే ఏదో పెద్ద అపాయం వచ్చి పడిందేమో ననిపిస్తుంది. కానీ వట్టిదే. తన కూతకు ఎవరైనా భయపడితే దానికి మహా సంతోషం. అది “ఊ ఇక్!” అన్నదంటే ఓ నిమిషంసేపు అడివి అంతా ప్రతి ధ్వనిస్తుంది.

చుట్టుపక్కలవాళ్లు భయపడ్డా, ఏదో కీడు మూడిందని గాభరా పడ్డా – ఆ గూబకు చాలా సంతోషమని బెంబికి త్వరలోనే తెలిసిపోయింది. అప్పటినుంచీ అతడు తెచ్చిపెట్టుకున్న గాభరాతో గూబ కూత విన్నప్పుడల్లా దాని క్షేమం తెలుసుకుంటూ ఉంటాడు.

"అయ్యో! మీకేమీ అపాయం కలగలేదు కదా!"

ఒక్కొక్కప్పుడు భయం నటిస్తాడు. "అబ్బ! మీరెంత భయపెట్టేశారండీ నన్ను!" అంటాడు.

అప్పుడు గూబ సంతోషానికి అవధులు ఉండవు.

"నా రూపు అంత భయంకరంగా ఉంటుందా?" అని చంకలు కుదుపుకుంటూ అడుగుతుంది. రెక్కలు విడదీసి, ఒళ్ళు పూరించి, గుండ్రంగా బంతిలా తయారవుతుంది.

ఒకప్పుడు ఉరుములతో, మెరుపులతో పెద్ద వర్షం వచ్చింది. పట్టపగలు వచ్చిందేమో - బేంబి, వాళ్ళ చిన్న పొదరింట్లోనే ఉన్నాడు. ఆ ఇల్లు చిమ్మచీకటి అయిపోయింది. బేంబికి భయం వేసింది. ఆ నలుపు అంతా ఆకాశంమీద నుంచి దిగి వచ్చిందా! అనిపించింది. గాలి తీవ్రంగా వీస్తూ అడవిని ఊపేస్తూంది. మెరుపులు కళ్ళను మిరుమిట్లు గొలుపు



తున్నాయి. ఉరుములకు చెవులు దిబ్బెళ్ళు వేసిపోతున్నాయి. బేంబి నిర్విణ్ణుడై, చేష్టలు దక్కి కూర్చున్నాడు. ఇప్పుడో, మరి కాస్త సేపటిలోనో ప్రపంచం అంతా ముక్కలు ముక్కలై పోతుందేమో అనిపించింది అతనికి.

ఇంకోమాటు వాళ్ళు మధ్య దారిలో ఉండగా పిడుగులతో వర్షం పట్టుకుంది. బేంబి హడలిపోయాడు. ఒక్కొక్కసారి ఉరిమినప్పుడు దారి విడిచి పొదలలోకి పోయేవాడు. మెరుపు వచ్చినప్పుడు మళ్ళీ దారిలోకి వచ్చి, అమ్మ వెనకాలే పరిగెత్తేవాడు. అడవి అంతా నిర్జీవంగా కనిపించింది. జీవాలన్నీ ఎక్కడి వక్కడ దాక్కున్నాయి. అవును మరి! దాక్కోక ఏం చేస్తాయి? చెట్లు, పుట్టలు, పొదలు, దారులు అన్నీ నీటిమయం. మెరుపు మెరిసినప్పుడల్లా కోట్లాది నీటి బిందువులు జిగేల్‌మని, క్షణమాత్రం అడవి అంతా కోటి దీపాలు పెట్టినట్లు ఉంటున్నది.

అల్లాంటి వర్షాలు మాత్రం ఎంతకాలం ఉంటాయీ? వాటికీ ఒక అంతం ఉంది. మెరుపు లారిపోతాయి. ఉరుములు చల్లబడిపోతాయి. కొంతకాలందాకా సన్నగా గొణుగుతున్నట్లు వినిపించేవి. తరువాత అవీ ఆగిపోయాయి! వానలు వెనకబట్టాయి. సూర్యుడు తడిసిన ఆకుల సందుల నుంచి చుర్రుమంటున్నాడు. వానలు వెలిశాక అడవి అంతా ఏదో కొత్త గాలి పీల్చుకుంటున్నట్టుగా ఉంది. ఏదో కొత్తదనం, నైర్మల్యం. ఇంక ఇప్పు డెవ్వరూ దాక్కోవడం లేదు. భయం ఆ సూర్యకాంతిలో కడిగేసినట్లు పోయింది.

ఆ రోజున అంత పొద్దు ఉండగానే వాళ్ళు మైదానం

లోకి వచ్చారు. ఉరుముల వాన తరువాత ఇల్లా రావడం ఇదే మొదలు. ఆకాశంలో సూర్యుడు అంత ఎత్తునఉన్నాడు. గాలి స్వచ్ఛంగా దుమ్మూ ధూళీ లేకుండా ప్రాణాలు లేచి వచ్చేలా ఉంది. తమ తమ నెలవులు వదిలిపెట్టి బయటికి వచ్చిన జీవాల అరుపులతో అడవి అంతా ఝుమ్మ మంటున్నది.

మైదానంలోకి వెళ్ళాలంటే బేంబి, అమ్మ దారిలో ఉన్న బ్రహ్మాండమైన జువ్వి చెట్టును చుట్టి వెళ్లాలి. దాని వేళ్ళు లుంగలు చుట్టుకుని దారిలోకికూడా వ్యాపించి ఉన్నాయి. ఒక వేరుమీద ఉడత కూర్చుని ఉంది. ఈ తల్లి, కొడుకు ఆమెకు పాత స్నేహితులే. పలకరించింది. బేంబికి ఉడత అంటే చాలా ఇష్టం. అది చాలా సరదా అయినదీ, తియ్యగా మాట్లాడేదీ. చిత్రంగా కదులుతూ, చెంగు చెంగున దూకేస్తూ ఉంటుంది. పరిగెత్తుతుంది. జువ్విచెట్టు కొమ్మల మీద మొగ్గలు వేస్తూ ఉంటుంది. మాట్లాడుతూ, మాట్లాడుతూ, ఆ నున్నని మానుమీద పైకీ కిందికీ సునాయాసంగా పరుగులు పెడుతూ ఉంటుంది. అంతలో ఊగులాడిపోతున్న చిన్ని కొమ్మమీద కూర్చుంటుంది. కుచ్చు తోక ఆడిస్తుంది. తెల్లని ఎదురు రొమ్ము కనిపించేలాగ కూర్చుంటుంది. చేతు లాడిస్తుంది. తల అటూ ఇటూ తిప్పుతుంది. మళ్లీ సరదాగా లోకాభిరామాయణం ఆరంభిస్తుంది.

వాళ్ళను చూస్తూనే ఉడత, మెరుపులా ఒక్క మొగ్గలో కిందికి దూకింది. ఎల్లా దూకిందో బేంబికి అర్థమే కాలేదు. కుచ్చుతోక ఆడించుకుంటూ కీచు గొంతుకతో

పలకరించింది.

"ఎన్నాళ్ళ కెన్నాళ్లకీ! కులాసా?"

బేంబి, అమ్మ నిలవబడ్డారు. ఉడత ఇంకా కిందికి దిగింది. ప్రవాహంలాగా మాటలు దొర్లించేస్తున్నది.

"ఉఁహూఁ! అయితే తుఫానులో ఎల్లా గడిపారూ? కనిపిస్తోందిగా! కులాసాగానే ఉన్నారు — అంతే మనకి కావలసింది." ఆ మాట అంటూనే మళ్ళీ పైకి ఎక్కేసింది.

"అబ్బ, కింద మరీ చెమ్మగా ఉంది. ఒక్క క్షణం ఆగండి. మంచి చోటు చూసుకుంటా, కూర్చునేందుకు. ఏం? తొందర పనేమీ లేదు కదా? అయితే ఫరవాలేదు."

కొమ్మమీద పైకీ కిందికీ పరుగులు పెడుతూ ఉడత సంభాషణ సాగించింది. "అబ్బబ్బ! ఏమి హోరూ; ఏమి గాలీ! నా కెంత భయం వేసిందో! చెబితే మీ కర్థం కాదు. తొర్రలో — అదే మా ఇంట్లో — ముడిచిపెట్టుకు కూర్చున్నాను, కదలడానికి భయం. ఇంకా నయం కదూ? మా చెట్టుఉందే — ఇది ప్రపంచంలో అన్ని చెట్లలోకీ మంచిది. సందేహంలేదు. నేను చెబుతున్నాగా! ఈ చుట్టుపక్కల అంతా వాడి వడబోశాను. ఎంత మంచి చెట్టయితే మాత్రం భయం తప్పుతుందా?"

ఉడత తన అందమైన కుచ్చుతోకమీద కూర్చుంది. దాని తెల్లని పొట్ట అందంగా కనిపిస్తున్నది. చేతులు రెండూ గుండెల కదుముకుని భయపడిపోయిందో ప్రకటించింది.

"మేము మైదానంలోకి వెడుతున్నాం — కాస్త కాళ్ళు

సాగుతాయని" అంది అమ్మ.

"బాగుంది. అవును మరి. ఆ మాట వేరే చెప్పాలీ? నాకు ముందరనుంచీ తెలుసును మీకు అన్నీ తెలిసినన్సారని."

ఒక్క గంతులో చిటారు కొమ్మ ఎక్కింది ఉడత. అక్కడినుంచే మాటలు వినిపిస్తున్నాయి. "నేను కూడా కాస్త చలి కాగుతా. పై కొమ్మన ఎండ బాగా కాస్తూంది. అబ్బ! వణికించేస్తోంది. హుష్హుష్హా!"

వింటున్నారో, లేదో గమనించకుండా ఒకటే కబుర్లు చెప్పేస్తున్నది ఉడత.

మైదానంలో మహా కోలాహలంగా ఉంది. కుందేలు మామయ్య, ఆయన కుటుంబం అంతా అక్కడే ఉన్నారు. ఏణి పిన్ని, పిల్లలు అప్పటికే అక్కడికి వచ్చేశారు.

ఈవేళ నాన్నలు మళ్ళీ కనిపించారు. ఇద్దరూ మెల్లిగా అడవిలోనుంచి బయటికి వచ్చారు. తరువాత మూడవ ఆయన ఒకరు కనిపించారు. వాళ్ళు అలా గంభీరంగా, రాచ ఠీవితో అడుగులువేస్తూ తమకేసే వస్తున్నారు. వాళ్ళలో వాళ్ళుకూడా మాట్లాడుకోరు. అసలు బేంబిలాంటి పిల్లలు అక్కడ ఉన్నారనైనా వాళ్ళు చూశారో లేదో? రెప్పలార్ప కుండా బేంబి కనుమరుగయేవరకూ వాళ్ళకేసే చూస్తూ నిలుచున్నాడు. వాళ్ళు వెళ్ళిపోయాక తన తోటిపిల్లలతో ఆటలకు తలపడ్డాడు. గోబో, ఫలీనా కాక మరో ఇద్దరు వచ్చారు. అందరూ ఆటలకు సిద్ధమే. మైదానం అంతా పరుగులెత్తారు.

అందరిలోకీ చురుకైనది ఫలీనా. తెలివీ, ధైర్యం

ఉన్నాయి. ఆట అన్నా, మాటలన్నా చెప్పలేనంత ఉత్సాహం.

గోబో త్వరగా అలిసిపోతాడు. మొన్నటి తుఫానుకు అతడు జడుసుకున్నాడు. ఆ భయం ఇంకా వదలలేదు. నిజం చెప్పాలంటే అతడు మొదటినుంచీ భయస్తుడే. బలహీనుడు, పిరికివాడు కూడాను. కాని మంచి ఆలోచన ఉంది. సహనమూ ఉంది. అందుకే గోబో అంటే బేంబికి చాలా ఇష్టం. ఎందుకో గోబో అదోలా ఉంటూ ఉంటాడు. కళ్ళలో విచారం కనబడుతూ ఉంటుంది. అది దాచుకోవాలని ప్రయత్నిస్తున్నట్లు ఉంటాడు.

♦ ♦ ♦

లేత లేత చిగుళ్ళు కొరికి తినడంలో, ముని పంట గరికగడ్డి కొసలు తుంపడంలో రుచులు తెలిసివచ్చాయి బేంబికి. కాని అప్పుడప్పుడు ఇంకా అమ్మదగ్గర పాలు కుడుచుకొనడానికి వస్తూనే ఉన్నాడు. మధ్య మధ్య అమ్మ బేంబిని గదిమేస్తున్నది.

"నువ్వేం చిన్నపిల్లాడివి కాదు. వెళ్ళు. నన్ను కాస్సేపు విసిగించకు."

ఇద్దరూ కలిసి వెడుతున్నప్పుడు ఇదివరకటిలాగ బేంబి వెనుక వస్తున్నాడో, లేదో చూసుకుంటూ ఆగి ఆగి నడవడంలేదిప్పుడు అమ్మ. అతడిమీద వెనకటి శ్రద్ధ ఉన్నట్లు లేదు.

ఒక రోజున అమ్మ ఉన్నట్లుండి మాయమైపోయింది. అసలు ఎప్పుడు వెళ్ళిందో, ఎటు వెళ్ళిందోకూడా బేంబికి

తెలియదు. నిద్దుర లేచి చూచుకుంటే పక్కన అమ్మ లేదు. ఒంటరిగా ఇంట్లో ఉండడం బేంబికి అదే మొదటిసారి.

మొదట ఆశ్చర్యపడ్డాడు. తరువాత కంగారు పడ్డాడు. అంతలో భయం. అంతలో దిగులు. ఎలుగెత్తి "అమ్మా!" అని అంగలార్చాడు. కాని ఆ అరుపు ఆ పుట్టల్లోనూ, గుట్టల్లోనే అణిగిపోయింది. జవాబు రాలేదు. చెవులు రిక్కించి విన్నాడు. ముట్టె పైకెత్తి ఊపిరి గట్టిగా తీసుకుని వాసన చూశాడు. ఊహుఁ. మళ్ళీ అరిచాడు; "అమ్మా! అమ్మా!"

నిరాశతో బయలుదేరాడు. ఎటు వెళ్ళాలో తెలియదు. తనకు తెలిసిన కాలిబాట వెంట నెమ్మదిగా కొంత దూరం నడిచాడు. కాళ్లు తడబడుతున్నాయి. ఇంకా స్త ఎదరకు నడిచాడు. ఏదో కొత్తచోటు. ఇదివరకెప్పుడూ అక్కడికి వచ్చినట్లు లేదు.

అక్కడ మరో రెండు లేడి పిల్లల గొంతుకలు వినిపించాయి. వాళ్ళూ తనలాగే దిగులుగా అరుస్తున్నారు: "అమ్మా! అమ్మా!" బేంబి జాగ్రత్తగా విన్నాడు. గోబో, ఫలీనాల గొంతుకలే అవి. వాళ్ళే. ఇంకా అనుమానం ఏమిటి? ధ్వని వినబడిన వైపుగా పరిగెత్తాడు. ఎర్రగా, చుక్కలు చుక్కలుగా కదులుతూ ఆకుల సందులలోనుంచి కనిపించారు. ఒకళ్ళ నొకళ్లు రాసుకుంటూ మద్ది చెట్టుకింద వెర్రి మొగాలు వేసుకుని నిలుచున్నారు. అరుస్తున్నారు: "అమ్మా! అమ్మా!"

పొదలవెనక ఆకుల చప్పుడు విని, వాళ్లిద్దరూ ఎంతో సంతోషపడ్డారు. తీరా చూస్తే వచ్చింది బేంబి. ఆ ఆశా

భంగాన్ని దాచుకోలేకపోయారు పసికూనలు. అయినా సరే, బేంబి కనిపించినందుకు వాళ్ళ ముఖాలు వికసించాయి. బేంబికీ అంతే. ఇంక ఒంటరితనం అక్కరలేదు.

"మా అమ్మ వెళ్ళిపోయింది ఎక్కడికో" అన్నాడు బేంబి.

"మా అమ్మా అంతే" అన్నాడు గోబో. ఒకళ్ళ నొకళ్ళు ఏమీ అర్థం కానట్లు చూచుకున్నారు. అందరికీ కళ్ళ నీళ్ళు తిరిగాయి.

"ఎక్కడికి పోయారో!" అన్నాడు బేంబి స్వగతం లాగా.



"ఏమో!" గోబో నిట్టూర్పు విడిచాడు. అతని గుండెలు టువ్వు టువ్వు మంటున్నాయి. అందరి లోకీ బేలగా ఉన్నవాడు గోబో.

చటుక్కున ఫలీనా అంది. "బహుశా ... నాన్నల దగ్గరికి వెళ్లారేమో!"

గోబో, బేంబి ఆమె కేసి వెర్రిగా చూశారు. వాళ్ల కెందుకో ఈ సంగతి

భయం కలిగించింది.

ఫలీనాకూ భయంలాగే కనిపిస్తున్నది. అయితే వా్దరికన్నా ఆమెకు బాగా తెలిసినట్లున్నాయి ముఖ్య కవళికలు. అసలు - అమ్మలు నాన్నల దగ్గర ఉండి ఉంటారని ఎందు కనిపించిందో ఆమెకే తెలియదు.

"అంతే నంటావా?" అన్నాడు బేంబి.

"నాకు బాగా తెలుసు" అంది ఫలీనా.

బేంబి అధికంగా ఆలోచించలేకపోయాడు. మనస్సంతా గజిబిజిగా ఉంది. ఎదరకు నడిచాడు. మిగిలిన ఇద్దరూ అతని వెనకాల నడుస్తున్నారు. ముగ్గురూ కలిసి నోరు నెప్పిపెట్టేలా అరుస్తున్నారు. "అమ్మా! అమ్మా! అమ్మా!"

ఇంతలో ఫలీనా, గోబో ఒక చోట ఆగారు. ఇంక వాళ్ళు ముందుకు నడవం అన్నారు.

"ఎందుకు? అమ్మ తిరిగి వచ్చిందంటే మాకోసం వెతుక్కుంటుంది" అంది ఫలీనా.



కానీ, బేంబికి ఒకచోట నిలవబడాలని లేదు. ఎదరకు నడిచాడు. పొదలు దాటి, చిన్న తెరిపిలాంటి చోటికి వచ్చాడు. ముందుకు చూసేసరికి బిక్క చచ్చిపోయాడు. అక్కడ, ఆ చిన్న తెరిపికి

అవతల పెద్ద టేకు చెట్టు నానుకుని ఇదివరకు ఎప్పుడూ చూసి ఉండని చిత్రమైన జీవం నిలబడి ఉంది. ఆ జీవంనుంచి నసాళం అంటిపోయేలా వెగటు వాసన వస్తున్నది. ఆ వాసన పిచ్చి ఎక్కించేలా ఉంది. గుండెలు కోసేసేలా ఉంది.

ఆ కొత్త జీవం మీాదినుంచి దృష్టి మరల్చడం బేంబికి సాధ్యం కాలేదు. అది రెండే రెండు సన్నని కాళ్ళమీాద నిటారుగా నిలవబడి ఉంది. ముఖం బల్లపరుపుగా, వికృతంగా, అసహ్యం వేసేలా ఉంది. ఏదో చెప్పరాని భయంకరమైన శక్తి, అదిలించి ఆజ్ఞాపించే శక్తి ఆ ముఖంలో ఉంది. అదే బేంబి గుండెలను పట్టేసింది. దృష్టిని మరల్చకుండా చేసింది.

ఆ కొత్త జీవం చాలాసేపు కదలకుండా అలాగే నిలుచుంది. అంతలో ఒక కాలు – అది తలకు దగ్గరగా ఉంది – పైకి ఎత్తింది. ఇంతకు ముందు ఆ జీవానికి అక్కడో కాలు ఉందనే సంగతే బేంబి గమనించలేదు. ఇప్పుడే చూశాడు. ఆ కదలికతో భయం పుట్టింది. ఆ భయం బేంబిని అతకిని తెలియకుండానే పొదలలోకి లాగేసింది.

బేంబి గమనించనే లేదు. అతని పక్కనే అమ్మ నిలుచుని ఉంది. ఒకళ్ళ నొకళ్ళు చూసుకున్నారు. ఒకళ్ళ నొకళ్ళు ఒరుసుకుంటూ వెనక్కి తిరిగి చప్పుడు కాకుండా పరుగెత్తారు. ఆ పరుగు పరుగు ఇల్లు చేరుకునేదాకా ఆగ

"చూశావా?" అని అడిగింది అమ్మ నెమ్మదిగా.

బేంబి ఒగరుస్తున్నాడు. మాట్లాడలేకపోయాడు. తల మాత్రం ఆడించాడు.

"అతడే మ—ని—షి!" అంది అమ్మ.
ఇద్దరూ భయంతో వణికిపోయారు.

♦ ♦ ♦

అటు తరువాత తరచుగా బేంబిని వదిలిపెట్టి అమ్మ ఎక్కడికో వెళ్లిపోతూనే ఉండేది. కాని, మొదటిసారి అంత భయం కలగలేదు. ఉన్నట్లుండి వెళ్లిపోయేది. అతడు వెతికే వాడు; కనబడేది కాదు. పిలిచేవాడు; పలికేది కాదు. ఎప్పుడో ఉన్నట్లుండి తనంతట తానే వచ్చేది. కొన్నాళ్ళు మళ్ళీ మామూలుగా గడిచేవి.

ఒకనాడు రాత్రి అమ్మ మళ్ళీ మాయమైంది. బేంబి అడవి అంతా గాలించాడు. తెలతెలవారబోతున్నది. ఆకాశం ఎర్రబడింది. ఏం చెయ్యాలా అనుకుంటుండగా పక్కనున్న పొదలు కదిలినట్లయింది. ఆకులు గలగల మన్నాయి. తిరిగి చూస్తే దూరంలో అమ్మ కనిపించింది. ఆమె పక్కన ఎవరో ఉన్నారు. అత డెవరో బేంబికి తెలియదు. తళుక్కుమని ఒక్క క్షణం కనిపించి పొదలలో మాయమైంది అమ్మ. వెళ్ళుతూ వెళ్ళుతూ చిత్రంగా అరిచింది. అటువంటి అరుపు అమ్మ నోట అత డెన్నడూ వినలేదు. అది భయమో, సంతోషమో అర్థం కాలేదు. మరుక్షణంలో ఆ కొత్తవాడు కూడా మాయమైపోయాడు.

ఇంకో రోజున పట్టపగలు ఇంతకంటే ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది. బేంబి ఏమీ తోచక అడవిలో తిరుగుతున్నాడు. ఫలానా దారి అనుకోకుండా ఎటు తోస్తే అటు నడుస్తున్నాడు. అంతలో అమ్మ జ్ఞాపకం వచ్చింది. దిగు



"ఒంటరిగా ఉండలే వనడానికి సిగ్గులేదూ?"

పుట 65.

లుగా అమ్మను పిలవసాగాడు. ఆ పిలవడం భయంవేసి కాదు-ఒంటరితనం భరించలేక.

"అమ్మా!..."

అంతలో హఠాత్తుగా బేంబి పక్కన తండ్రులలో ఒకడు ప్రత్యక్షమయాడు. అతడు ఎప్పుడు వచ్చినదీ గమనించనే లేదు బేంబి. హఠాత్తుగా చూడడంతో ఉలిక్కిపడ్డాడు.

ఆయన తానంతకు ముందు చూచిన వాళ్ళందరికన్నా బలంగా, మంచి ఎత్తుగా, బహు దర్జాగాఉన్నాడు. ఆయన చర్మం ఎర్రగా మిసమిసలాడుతున్నది. కళ్ళు దర్పంగా, నిశితంగా ఉన్నాయి. ముఖంలో ఏదో వింత గాంభీర్యం. అన్నిటికన్నా అందంగా నెత్తిమీద చిలవలు పలవల కిరీటం. ఆయన బేంబికేసి తీక్ష్ణంగా, రూక్షంగా చూశాడు.

"ఏమిటి తెగ అరుస్తున్నావు? ఒంటరిగా ఉండలేనవడానికి సిగ్గు లేదూ?"

బేంబికి బిక్కు బిక్కు మనిపించింది. 'ఒంటరిగా ఉండడం ఇదే మొదటిసారి కాదు; ఇప్పటి కప్పుడే ఎన్నోమాట్లు ఒంటరిగా ఉన్నానండీ' అని చెప్పాలనుకున్నాడు. కానీ, నాలుక కదలదు. ఈయనచేత ఇంత మాట అనిపించుకున్నానే అని బేంబి మహా గుంజాటన పడ్డాడు.

ఆ మాట అనేసి, ఆ పెద్ద లేడి విసురుగా చెట్ల గుంపులలో కలిసిపోయింది.

ఆయన నడకచూసి బేంబి ఆశ్చర్యపడ్డాడు. అడుగు వేస్తుంటే ఒక్క ఆకూ గలగల మనలేదు. పిసరంత చప్పుడు

కాలేదు. కొంతసేపు ఉన్నాక బేంబి పసి చూశాడు. ఏమీ వాసన తగలలేదు. ఎవ్వరూ లేరు.

ఆయనను మళ్ళీ ఇంకోమారు కలుసుకోవాలనీ, తాను పెద్దవాడైనట్లు రుజువు చేసుకోవాలనీ బేంబి ఉవ్విళ్ళూరాడు.

ఈమారు అమ్మను కలుసుకున్నప్పుడు తాను నాన్న గారిని కలుసుకున్న సంగతి చెప్పలేదు. రహస్యంగా ఉంచాడు. అమ్మ మాయం అయిపోయినప్పుడు అరవనూలేదు. ఒంటరిగా అడవిలో తిరుగుతూ పెద్ద లేడి ఎదురవుతుందేమోనని ఒళ్ళంతా చెవులు చేసుకున్నాడు. 'చూశారా! నేనేం భయపడడం లేదు' అని చెప్పాలనీ, ఆయన మెప్పు పొందాలనీ బేంబి తాపత్రయం.

అయితే తాను నాన్నను కలుసుకున్న సంగతి గోబో దగ్గరా, ఫలీనాదగ్గరా రహస్యంగా ఉంచలేదు. అతడా సంగతి చెబుతుంటే ఊపిరి బిగబట్టి విన్నారు, ఆ స్నేహితులు. వాళ్ళకిది చాలా ఆశ్చర్యకరమైన సంగతే. అటువంటి సంఘటన వాళ్ళకు అంతవరకూ తటస్థ పడలేదు.

"బాగా భయం వేసిం దనుకుంటాను" అన్నాడు గోబో ఉత్కంఠతో.

"అయ్యో! భయపడకపోవడ మేమిటి?" అని అంతలో సర్దుకున్నాడు బేంబి. "అయితే అంత ఎక్కువ కాదులే."

"అదే నేనైతే హడిలి చచ్చిపోదును" అన్నాడు గోబో.

అంత భయం కలగలే దనిపించింది బేంబికి.

"బాబోయ్! అది నావల్ల కాదు. అసలు తలే పైకెత్త

లేను. భయం వేసినప్పుడు గుండె గుబగుబ లాడిపోయింది. ఊపిరి ఆడదు” అన్నాడు గోబో.

ఫలీనా పైకి ఏమీ మాట్లాడలేదు. అతను చెప్పిన దంతా విని ఆలోచిస్తున్నది.

మళ్ళీవాళ్లు కలుసుకున్నప్పుడు బేంబిని అంత దూరాన చూడగానే గోబో, ఫలీనా ఒక్క పరుగున వచ్చారు.

“నీకోసం తెగ వెతుకుతున్నాము” అన్నాడు గోబో.

“నిజంగా! నువ్వు కిందటిసారి కలుసుకున్నాయన ఎవరోమాకు తెలిసిపోయింది” అంది ఫలీనా.

బేంబి ఎగిరి గంతు వేశాడు. “ఎవరాయన ?”

ఫలీనా ఆచి తూచి చెప్పింది. “ముసలి నాయకుడు!”

“నీ కెల్లా తెలుసు ?”

“మా అమ్మ చెప్పింది.”

బేంబి కంగారు పడ్డాడు. “నా రహస్యం చెప్పేశారన్న మాట ?”

ఇద్దరూ తలలూపారు.

“అది రహస్యం అని నేను చెప్పలేదూ ?” బేంబి బుంగ మూతి పెట్టాడు.

“చెప్పింది నేనుకాదు. అంతా ఫలీనాయే చెప్పేసింది.” తాను నిర్దోషినని చెప్పుకున్నాడు గోబో.

ఫలీనా హుషారుగా అరిచింది. “రహస్యం అన్నావు సరేలేవయ్యా! నీకు కనిపించినాయన ఎవరో తెలుసుకోవా లనిపించింది; అడిగాను. ఇప్పుడు తెలిసిపోయింది. బాగు లేదూ ?”

బేంబి అంగీకరించక తప్పలేదు. అతని జిజ్ఞాసను గుర్తించి ఫలీనా ముసలి నాయకుణ్ణి గురించి ఎన్నో కబుర్లు చెప్పింది.

"ఆయన అందరిలోకీ చాలా గొప్పవాడు.

"నాయకుడు కదూ మరి ? ఆయనకి సమానమైనవాళ్ళే లేరు. ఆయనకి ఏళ్ళు ఎన్నో, బంధువులు ఎవరైనా ఉన్నారో లేదో ఎవ్వరికీ తెలియదు. అసలాయన తరుచుగా కనిపించనే కనిపించడు. ఒకొ్కక్కప్పుడు చాలా రోజులు ఆయన దర్శనమే కాదు. ఏమైపోయాడో తెలియదు. చచ్చిపోయాడేమో అనుకుంటారు చాలామంది. కానీ అంతలో కనిపిస్తాడు ఎక్కడో. ఆయన బతికే ఉన్నట్లు తెలుస్తుంది. 'ఇన్నాళ్లూ కనిపించలేదు. ఎక్కడికి వెళ్లా'రని ఒక్కళ్లూ అడగలేరు. ఆయన ఎవళ్ళతోటీ మాట్లాడరు. ఆయన ఎక్కడ ఉంటాడో, ఏ దారిన వచ్చి పోతాడో తెలియదు. ఎక్కడో దూరంనుంచి వస్తుంటాడని తెలుస్తూ ఉంటుంది. ఆయనకి భయం అన్నది లేదు. అపాయం అంటే లెక్క చెయ్యడు. అప్పుడప్పుడు మనవాళ్లు తమలోతాము దెబ్బలాడుకుంటూ ఉంటారు — ఒకొ్కక్కప్పుడు సరదాకీ, ఒక్కొక్కప్పుడు నిజంగానూను. అయితే ఆయనతో తలపడ్డవాళ్లు ఒక్కళ్ళూ లేరు. కనీసం ఎవ్వరూ ఎరగరు. ఇదివరలో ఆయనతో దెబ్బలాడినవాళ్లెవ్వరూ ఇప్పుడు బతికి లేరు. ఆయన గొప్ప నాయకుడు."

ఫలీనాను, గోబోను బేంబి క్షమించేశాడు. వాళ్లు తన రహస్యం చెప్పివెయ్యకపోతే ఇన్ని విషయాలు తెలిసేవే

కాదుకదా ? బేంబి అసలు రహస్యంలో కూడా కొంత దాచి పెట్టకపోలేదు. "ఒంటరిగా ఉండలే నడానికి సిగ్గులేదూ ?" అని నాయకుడు కేకలేసినట్లు వాళ్ళకు చెప్పలేదు. అది తప్ప మిగిలినవన్నీ చెప్పేశాడు. ఇంకా నయం, అదికూడా చెప్పేస్తే నలుగురిలోనూ తల దించుకోవలసి వచ్చేది' అనుకున్నాడు.

ఆ రాత్రి నెల పొడిచాక అమ్మ తిరిగి వచ్చింది. అనుకోకుండా మద్దిచెట్ల చాటునుంచి వచ్చింది. వచ్చాక కూడా ఏమీ మాట్లాడలేదు. నిశ్శబ్దంగా నిలుచుని బేంబిని చూసింది. అతడే ఆమె దగ్గరగా వెళ్ళాడు.

ఆ రాత్రి బేంబికి మరికొన్ని కొత్త సంగతులు తెలిశాయి.

అమ్మ చాలా అలిసిపోయింది. బాగా ఆకలిగాకూడా ఉంది. అందుచేత వాళ్లిద్దరూ అట్టే దూరం తిరగలేదు. ఇద్దరూ మైదానంలోకి వెళ్ళారు. మంచులో తడిసిన చల్లని గరికగడ్డి తింటున్నది అమ్మ. అది అయ్యాక ఇద్దరూ చిన్నప్పటిలాగా తూతుమ్మెండ మొదలుపెట్టారు. ఆ ఆటలో పడి అనుకోకుండానే అడవి నడిబొడ్డుకు వెళ్లారు. పొదలలో కీచురాళ్లు చెవులు గింగుర్లెత్తేలా అరుస్తున్నాయి. ఇంతలో అమ్మ అరిచింది: "ఆ — వూ! ఆ — వూ!"

బేంబికి అర్థం కాలేదు. ఇంతలో పొదలమాటునుంచి పెద్ద చప్పుడు చేసుకుంటూ కొత్త జీవం వొకటి హఠావిడిగా బయటికి వచ్చింది. అదికూడా తన తల్లిలాగా, ఏణి పిన్నిలాగా, మిగిలిన తన బంధువులలాగానే ఉంది. అయితే ఉన్న

భేదమల్లా, అది తనవాళ్ళకన్నా చాలా పెద్దది. దానిని చూడడానికి మెడ పైకెత్తవలసి వచ్చింది బేంబికి.

బేంబి కూడా గొంతెత్తి పెద్దగా అరిచాడు : "ఆ—వ్వూ ! బా — వ్వూ !"

అయితే అలా ఎందుకరిచాడో అతనికే తెలియదు. అరవకుండా ఉండలేకపోయా

బయటి వచ్చాయి. వాటి వెనకాల మరోటి. ఆ చివరిది అన్నిటికన్నా పెద్దది. పర్వతంలా ఉంది. మెడమీద ఏదో జూలులా ఉంది. నెత్తిన పెద్దచెట్టులాకిరీటం.





వాళ్ళను చూస్తే జెంబికి భయం వేయ లేదు. వాళ్ళ ముందర తామంతా ఎంత చిన్న వాళ్ళమో అనిపించింది. "ఆవ్వా! బా-వ్వా!" అని మళ్ళీ అరిచాడు.

ఆ జీవాలు కనుమరుగైపోయాయి. అంతా నిశ్శబ్దంగా ఉంది. ఉండీ ఉండీ జెంబి మాత్రం "ఆ - వ్వా!" అని అరుస్తున్నాడు.

"చాల్లే, ఊరుకో. వాళ్ళు వెళ్ళిపోయారు" అంది అమ్మ.



"అమ్మా! వాళ్ళెవరే?" అని అడిగాడు బేంబి.

"వాళ్లా? మనకి బహు దూరపు బంధువులు. బాగా ఉత్తరాన ఉంటారు. చాలా మంచివాళ్ళు."

"వాళ్ళు ఎవరినీ ఏమీా చెయ్యరా?"

"నేను ఎరిగిఉన్నంతవరకూ ఎవరినీ ఏమీా చెయ్య లేదు. అయితే వాళ్ళను గురించి అనేక రకాలుగా చెప్పు కుంటారనుకో. చెప్పేడు మాటలు మన కెందుకుగానీ..."

"దూరపు బంధువులైతే మనకి అపకారం ఎందుకు చేస్తారులే" అన్నాడు బేంబి స్వగతంలాగా.

"అబ్బే! వాళ్ళేం చెయ్యరు" అని కాస్సేపు ఊరుకుని, మళ్ళీ ఇలా అంది అమ్మ: "వాళ్ళు వస్తే అంతా భయపడ తారు. ఎందుకో మాత్రం తెలియదు. నాకుటుకు నాకూ ఏదో చెప్పలేని గాబరా. ఎప్పుడూ ఇంతే."

బేంబి ఆలోచనలో పడ్డాడు. సరిగ్గా అదే సమయంలో గూబ తన మామూలు ధోరణిలో భయంకరంగా అరిచింది. అయితే బేంబి ఆలోచనల్లోపడి ఉండడంచేత ఆ కూతను పట్టించుకోలేదు.

గుడ్లగూబ కింది కొమ్మలమీాదికి దిగివచ్చి, తానే పలకరించింది. "నేను మిమ్మల్ని భయపెట్టినట్లున్నాను!"

"అవునవును. భయమే వేసింది" అన్నాడు బేంబి.

గుడ్లగూబ లోపల సంతోషంగాఉన్నా పైకి క్షమా ర్పణ కోరుతున్నట్లు మాట్లాడింది. "మరోలా అనుకోకండేం, నా కదో దురలవాటైపోయింది." రెక్కలు టపటప లాడించి, ఒళ్ళు పొంగించి బంతిలాచేసి, ముక్కుతో ఈకలు దువ్వుకుని

కుదురుగా కూర్చున్నది.

"ఇంత క్రితమే మీకంటే భయపెట్టినవాళ్ళని చూశాను" అన్నాడు బేంబి.

గుడ్లగూబకు కాస్త నిరుత్సాహమే కలిగింది. "ఎవరు?" అని అడిగింది.

బేంబి తన దూరపు జ్ఞాతులను గురించి చెప్పాడు.

"అబ్బో! మా జ్ఞాతు లెంతమందో లెక్కపెట్టలేము. పగలు కాస్త ముఖం బయటికి చూపించామో – ఇక వాళ్ళని వదిలించుకోలేము. ఈ జ్ఞాతులంటే నాకు పడదు. వాళ్ళ కాస్త దూరంలో ఉండడమే మంచిది" అంది గూబ.

"మా జ్ఞాతులను గురించి నాకు బొత్తిగా తెలియదండీ" అని సిగ్గుపడ్డాడు బేంబి.

"ఆఁ – సింగినాదం! జ్ఞాతుల నెరక్కపోతే మునిగి పోయిందేమిటి? నే చెబుతున్నా వినండి – వాళ్ళతో అసలు స్నేహం పనికిరాదు. మనం ఇద్దరమూ ఉన్నాము, స్నేహితు లం. అది ఇద్దరికీ మంచిది."

బేంబి మధ్యలో ఏదో చెప్పబోయాడు. కానీ, గూబ అతని కా అవకాశం ఇవ్వలేదు.

"మీదేముంది? కుర్రతనం! అనుభవంతో చెబు తున్నాగా! తరువాత మీ ఇష్టం. పైగా మీ కుటుంబ విష యాలలో నేను జోక్యం కలిగించుకోవడమేమిటి?" అంది కళ్లు తిప్పుకుంటూ.

*       *       *

ఒక రోజున చాలా భయంకరమైన సంఘటన జరి

"అమ్మా! వాళ్ళెవరే?" అని అడిగాడు బేంబి.

"వాళ్లా? మనకి బహు దూరపు బంధువులు. బాగా ఉత్తరాన ఉంటారు. చాలా మంచివాళ్ళు."

"వాళ్ళు ఎవరినీ ఏమీ చెయ్యరా?"

"నేను ఎరిగిఉన్నంతవరకూ ఎవరినీ ఏమీ చెయ్య లేదు. అయితే వాళ్ళను గురించి అనేక రకాలుగా చెప్పు కుంటారనుకో. చెప్పుడు మాటలు మన కెందుకుగానీ..."

"దూరపు బంధువులైతే మనకి అపకారం ఎందుకు చేస్తారులే" అన్నాడు బేంబి స్వగతంలాగా.

"అబ్బే! వాళ్ళేం చెయ్యరు" అని కాస్సేపు ఊరుకుని, మళ్ళీ ఇలా అంది అమ్మ: "వాళ్ళు వస్తే అంతా భయపడ తారు. ఎందుకో మాత్రం తెలియదు. నామటుకు నాకూ ఏదో చెప్పలేని గాబరా. ఎప్పుడూ ఇంతే."

బేంబి ఆలోచనలో పడ్డాడు. సరిగ్గా అదే సమయంలో గూబ తన మామూలు ధోరణిలో భయంకరంగా అరిచింది. అయితే బేంబి ఆలోచనల్లోపడి ఉండడంచేత ఆ కూతను పట్టించుకోలేదు.

గుడ్లగూబ కింది కొమ్మలమీదికి దిగివచ్చి, తానే పలకరించింది. "నేను మిమ్మల్ని భయపెట్టినట్లున్నాను!"

"అవునవును. భయమే వేసింది" అన్నాడు బేంబి.

గుడ్లగూబ లోపల సంతోషంగాఉన్నా పైకి క్షమా ర్పణ కోరుతున్నట్లు మాట్లాడింది. "మరోలా అనుకోకండేం. నా కదో దురలవాటైపోయింది." రెక్కలు టపటప లాడించి, ఒళ్ళు పొంగించి బంతిలాచేసి, ముక్కుతో ఈకలు దువ్వుకుని

కుదురుగా కూర్చున్నది.

"ఇంత క్రితమే మీకంటే భయపెట్టినవాళ్ళని చూశాను" అన్నాడు బేంబి.

గుడ్లగూబకు కాస్త ఉత్సాహమే కలిగింది. "ఎవరు?" అని అడిగింది.

బేంబి తన దూరపు జ్ఞాతులను గురించి చెప్పాడు.

"అబ్బో! మా జ్ఞాతు లెంతమందో లెక్క పెట్టలేము. పగలు కాస్త ముఖం బయటికి చూపించామో – ఇక వాళ్ళని వదిలించుకోలేము. ఈ జ్ఞాతులంటే నాకు పడదు. వాళ్లకి కాస్త దూరంలో ఉండడమే మంచిది" అంది గూబ.

"మా జ్ఞాతులను గురించి నాకు బొత్తిగా తెలియదండీ" అని సిగ్గుపడ్డాడు బేంబి.

'ఆఁ సింగినాదం! జ్ఞాతుల నెరక్కపోతే మునిగి పోయిందేమిటి? నే చెబుతున్నా వినండి – వాళ్ళతో అసలు స్నేహం పనికిరాదు. మనం ఇద్దరమూ ఉన్నాము, స్నేహితు లం. అది ఇద్దరికీ మంచిది."

బేంబి మధ్యలో ఏదో చెప్పబోయాడు. కానీ, గూబ అతనికా అవకాశం ఇవ్వలేదు.

"మీదేముంది? కుర్రతనం! అనుభవంతో చెబు తున్నాగా! తరువాత మీ ఇష్టం. పైగా మీ కుటుంబ విష యాలలో నేను జోక్యం కలిగించుకోవడమేమిటి?" అంది కళ్లు తిప్పుకుంటూ.

* * *

ఒక రోజున చాలా భయంకరమైన సంఘటన జరి

గింది.

ఆ రోజున ఎంతో హాయిగా తెల్లవారింది. ఏ ఆకు మీద చూసినా స్వచ్ఛమైన మంచు బిందువులు. గాలి స్వచ్ఛంగా, మందంగా వీస్తున్నది. ఆకాశాన ఒక్క మబ్బు తునకకూడా లేదు. మైదానం రోజుటికన్నా చక్కని వాసనలతో నిండి ఉంది.

"చిక్! రిచ్! రిచ్!" అన్నాయి పిచికలు ఒకదాని నొకటి ముక్కులతో సరదాగా పొడుచుకుంటూ.

"ఊంగ్! ఊంగ్!" అంటూ పావురం వాటిని గదమాయించింది - 'సరిగ్గా తెల్లారిందో లేదో, అప్పుడే మొదలెట్టారూ!' అన్నట్టు.

"చచ్ చచ్! రర్ రర్!" అంటూ ఒక వడ్రంగి పిట్ట విసుక్కుంది - 'మీకు నిద్దర్లు లేకపోతే ఇంకెవ్వరికీ ఉండ వనుకున్నారా?' అన్నట్టు.

చందలాది సన్నని అందమైన గొంతుకలు ప్రభాత గీతాలాపనం ప్రారంభించాయి.

"పివ్రూ! పివ్రూ! తుయిచ్! తుయిచ్! ట్రీత్! ట్రీత్!" గోరింక ఎగిరివచ్చి మద్దిచెట్టు చిటారి కొమ్మలమీద కూర్చుంది. అడవి కాపలాదారులలో నేనూ ఒకర్తిని అన్నట్టు మెడ చాచి చూపు మేరవరకు నలుదిక్కులూ జాగ్రత్తగా పరిశీలించి చూచింది.

దూరాన తూరుపు రేకలు. ఆకాశం అంచున పుప్పొళ్లు అద్దినట్టు రంగు రంగులు. ఆకాశమే పూస్తున్నదో ఏమో! మరో కొమ్మమీద కోయిలమ్మ గొంతెత్తింది.

దాని పంచమ స్వరం తరంగాలుగా, తేనె సోనలుగా అడవి అంతా అల్లుకుపోయింది.

పావురాలు రెక్కలు టపటప లాడిస్తూ కొమ్మమీది నుంచి కొమ్మమీదికి గంతులు వేస్తున్నాయి. నెమళ్ళు తమ పంచరంగుల మెడలు రిక్కించి, రాత్రి తాము నిద్రపోయిన కొమ్మలమీది నుంచి విలాసంగా కిందికి దిగివస్తున్నాయి. వాటి కేకలు మిగిలిన పక్షుల కూతల నన్నింటినీ తోసిపుచ్చి వినిపిస్తున్నాయి.

బొంతకాకులు బొంగురుపోయిన గొంతుకలతో మయూరాల షడ్జమ క్రేంకారాలకు అపశ్రుతులు వేశాయి.

అంతా నిద్రలేచిన ప్రభాతవేళ అది.

బేంబి తన పొదరిల్లు వదిలాడు. జువ్విచెట్టు దాటి మైదానంలో ప్రవేశించాడు. లేత చివుళ్లతో గడ్డి, గడ్డి నిండా రంగు రంగుల పువ్వులు, పువ్వులనిండా అప్పుడేపడ్డ మంచు, అంతటా మైమరిపించే చక్కని చిక్కని వాసనలు! మైదానం నిండా రకరకాల జీవాలు, పక్షులు, కీటకాలు!

బేంబి స్నేహితులంతా అక్కడే ఉన్నారు. కుందేలు మామయ్య ఒకచోట కూర్చుని ఏదో దీర్ఘాలోచనలో మునిగి ఉన్నట్లు కనపించాడు. పింఛం నేలను జీరాడుతుంటే నెమలి నెమ్మది నెమ్మదిగా అడుగులువేస్తూ పెళ్లి నడకలు నడుస్తున్నది.

బేంబి పక్కనే ఒకాయన మేస్తున్నాడు. ఆయన మంచి యౌవనంలో ఉన్నాడు. మంచుకు తడిసి ఎర్రని శరీరం మెరిసిపోతున్నది. బేంబిని ఆయన చూశాడో లేదో?

చూసినా – చిన్నపిల్లకాయతో పనేమిటి? అన్నట్లు నిర్లక్ష్యమేమో – తల ఎత్తకుండా ఏపుగా ఎదిగిన గడ్డి కొసలు కొరుకుతున్నాడు.

అంత దగ్గరలో పెద్ద లేడిని చూసి, బేంబి మొదట గాబరా పడ్డాడు. అంతలో ధైర్యం తెచ్చుకున్నాడు. ఆయనతో ఒక్కసారి మాట్లాడాలనిపించింది. కొత్త పెద్దవాళ్లతో ఎప్పుడూ మాట్లాడలేదు మరి. ఎల్లా మాట్లాడాలో ఏమో! ఏమనుకుంటాడో! 'పోనీ అమ్మను అడుగుదా' మనుకున్నాడు. తల ఎత్తి చూశాడు. ఆమె దూరాన ఎక్కడో ఏణి పిన్నితో మాట్లాడుతూంది. ఆమె దగ్గరకు వెళ్లాలంటే ఈ పెద్ద లేడి పక్కనుంచే వెళ్లాలి. అది మర్యాద కాదనిపించింది.

'అసలు అమ్మను అడగవలసిన పనేముంది?' అనుకున్నాడు మళ్ళీ. 'ఇదివరకు తాను నాయకుడితో మాట్లా



డాడు. అమ్మను అడిగే మాట్లాడాడా? ఇప్పుడు మాత్రం ఎందుకు? నేనే పలకరిస్తాను. "అయ్యా! నమస్కారమండీ!" అంటాను. అంటే ఆయనకు కోపం వస్తుంది – వెళ్ళిపోతాను' అనుకుంటూ బేంబి గొంతుక సవరించుకున్నాడు.

ఆ లేడి పొదమాటు వదిలి పక్కకు అడుగు వేసింది.

'సరిగ్గా ఇదే సమయం, మాట్లాడడానికి!' అనుకుంటున్నాడు బేంబి.

అంతలో పిడుగుపడ్డట్లు పెద్ద చప్పుడు.

అసలు ఏం జరిగిందో బేంబికి అర్థం కాలేదు.

వయస్సులో ఉన్న ఆ లేడి అంత ఎత్తు ఎగిరి, బేంబికి దగ్గరలో పొదపక్కన వెల్లకిలా పడిపోయింది.

ఆ ఉరుము అతని చెవుల్లో ఇంకా గింగుర్లెత్తిపోతున్నది. అంతలో అమ్మ, ఏణి పిన్ని, గోబో, ఫలీనా –



అందరూ పొదల్లోకి బాణాల్లాగా దూసుకుపోతూ కనిపించారు.

కుందేలు మామయ్య అంచీలమీద దూకేశాడు. వంకర కాళ్ళు తడబడగా నెమలికూడా పరిగెత్తింది. అంతటా నిశ్శబ్దం.

పడిఉన్న లేడి చుట్టూ తిరిగి చూశాడు బేంబి. ఆయన ముందరి బుజాన పెద్ద గాయం. రక్తం కాలవలు కట్టేస్తున్నది.

"ఆగకు! పరుగెత్తు! పారిపో! ప్రమాదం! ప్రమాదం!" అని వినిపించింది. తిరిగి చూస్తే పక్కనే అమ్మ.

వణుకుతున్న అమ్మ కంఠధ్వని విని, బేంబి క్షణం నిలవకుండా అడవిలోకి బలంకొద్దీ పరిగెత్తాడు.

పరిగెత్తుతూనే అడిగాడు: "ఏం జరిగింది, అమ్మా?"

"మ—ని—షి!" అంది అమ్మ వగరుస్తూ!

ఆఖరికి ఒకచోట ఆగారు బేంబి, అమ్మ.

"ఏమిటీ మీరన్నదీ? నాకు తెలియలేదు. మరో సారి చెప్పండి" అని వినిపించింది.

బేంబి తల పైకెత్తి చూశాడు. చెట్టు కొమ్మలమీద గాభరాగా పరుగులు పెడుతున్నది ఉడత.

"నేను మీ వెనకాలే వస్తున్నాను. ఎంత భయం వేసిందో!" అంది ఉడత.

"మీరుకూడా అక్కడే ఉన్నారన్నమాట?" అంది అమ్మ.

"ఇంకా నయం. తలుచుకుంటే వణుకు వచ్చేస్తోంది" అంది ఉడత — వెనక కాళ్ళమీద కూర్చుని, తెల్లని ఎదురు రొమ్ముకు చేతులు నొక్కుకుంటూ.

"ఆ చప్పుడు వినగానే నా గుండెలు ఆగిపోయా యంటే నమ్మండి" అంది.

" మనిషి అక్కడ ఉన్నట్లు ఎవ్వళ్ళం చూడనే లేదు" అంది అమ్మ.

"అయ్యో! నేను చాలా సేపటినుంచి చూస్తూ ఉన్నా నండీ, ఆ జంతువుని" అంది ఉడత.

"నేను చూశాను" అంది మరో గొంతు. అది గోరింక.

"నేనూ చూశాను" అంది ఇంకా పైకొమ్మని గిజిగాడు.

అన్నిటికన్నా ఎత్తున రెండు కాకులు విచారంగా చూస్తూ కూర్చున్నాయి.

"మనిషిని మేముకూడా చూశాము" అన్నాయి. హడలిపోయిన అడవి జంతువులన్నీ ఎప్పుడు, ఎక్కడ తామూ మనిషిని చూచాయో చెబుతున్నాయి.

"పాపం! ఆ లేడిగారికి 'ప్రమాదమయ్యా!' అని చెప్పాలని ఎంత ప్రయత్నం చేశానో" అంది ఉడత, చేతులు గుండెలకు నొక్కుకుంటూ.

"నేనూ అంతే. తెగ అరిచాను. కానీ ఆయన వింటేనా?" అంది గిజిగాడు.

"అందాకా ఎందుకూ? అరుస్తుంటే విన్నాడా? ఆఖరికి దగ్గరగా వెళ్ళి 'ఏమయ్యోయ్!' అని చెబుదా మనుకుంటున్నాను. అంతలో ఇంత ఘోరం జరిగిపోయింది" అంది గోరింక.

"మీ అందరి గొంతుకలకన్నా నాది పెద్దది కదా?

నేనూ గొంతు చించుకుని అరిచాను. కానీ అటువంటి ప్రభు వులకి మనబోటి చిన్న చిన్న జీవాల మాటలు చెవి కెక్కు తాయా ?" అంది బొంతకాకి.

"బాగా చెప్పావు" అని వంతపాడింది ఉడత. "మనం చెయ్యగలిగిందంతా చేశాము. ఇంక ఆ పైన ప్రమాదం వచ్చి పడితే ఎవళ్ళమేం చెయ్యగలం ?" అని రెక్కలు కుదుపు కుంది గోరింక.

"ఎంత అందమైనవాడు ! ఎటువంటి వయస్సు ! ఎల్లా జరిగిపోయిందీ !" అని కళ్ళనీళ్లు పెట్టుకుంది ఉడత.

"ఆఁ ! మరీ అంత తనదే లోకమైపోతే ఎల్లా ? కాస్త ఇతరులు ఏమంటున్నారో కూడా వింటుండాలి" అంది గిజిగాడు.

"అదేమిటిలే ? వాళ్ళ లేడి జాతిలో యువరాజులంతా అల్లాగే ఉంటారు" అంది ఉడత.

"కాస్త మంద మతి కాబోలు" అంది పావురం.

"నువ్వే మందమతివి. నీకన్నా మందమతులు అసలీ అడవిలోనే లేరు" అని గట్టిగా అరిచింది కాకి.

"నేనా ? తెలివితక్కువదాన్నా ? ఇంతవరకూ నన్నింత మాట ఎవ్వరూ అనలేదు. కానైతే కాస్త మరుపు ఉంటే ఉండవచ్చు. కానీ, తెలివితక్కువదాన్ని అంటే ఊరుకోను. తెలుసా ?" అంది పావురం అనుమానరుద్ధమైన కంఠంతో.

కాకి కొంచెం సర్దుబాటు చేసుకుంది. "తొందరలో ఏదో అనేశాను. మరోలా అనుకోకు. కానీ, ఒక్కటి మాత్రం గుర్తుంచుకో. యువరాజావారు చచ్చిపోయారంటే

ఆయన తెలివితక్కువతనంమాత్రం కారణం కాదు. ఆ మనిషికి ఎదురు నిలవగలవాడు అసలు ప్రపంచంలోనే లేడు" అంది కాకి.

"ఆ హా హా! ఏం కారణం సెలవిచ్చారండీ కాకిబావ గారు!" అంది గిజిగాడు ఎగిరిపోతూ.

"నా జీవితకాలంలో ఇప్పటికి ఆ మనిషి ఎందర్ని చంపేశాడో లెక్కపెట్టలేను. అతడికి తోచినప్పుడు చంపేస్తాడు. అతనికి అడ్డుపడగలవాళ్లెవ్వరూ లేరు" అంది కాకి.

"అల్లా అయితే మనమంతా జాగ్రత్తగా కాపలా కాచుకుంటూ ఉండాలి" అంది గోరింక.

"అంతే మరి" అంది విచారంగా కాకి. అంటూనే తన గుంపులో కలిసి ఎటో ఎగిరిపోయింది.

జేంబి పక్కన చూచుకున్నాడు. అమ్మ లేదు.

వీళ్ళంతా మాట్లాడుకుంటున్నది ఎవరిని గురించో అతనికి అర్థం కాలేదు. మనిషి అంటే ఎవరు? ఆ రోజున చెట్ల తెరిపిలో తాను చూచిన జంతువు కాదు కదా! 'అయితే మరి నన్ను చంపలేదేం?' అని సందేహం కలిగింది.

అంతలో ఇందాకటి సంఘటన గుర్తుకు వచ్చింది. చక్కని బలమైన పెద్ద లేడి కిందపడి రక్తంలో కొట్టుకుంటున్నట్లు కనపడింది.

అడవి మళ్ళీ వేలాది జీవాల గొంతుకలతో చైతన్యవంతమైంది. సూర్యుడు పొడుగాటి చేతులుచాచి, అడవి నంతనూ నిమురుతున్నాడు. ఎక్కడ చూచినా వెచ్చని వెలుగు. పచ్చి ఆకుల వాసనలు మత్తెక్కిస్తున్నాయి.

చెట్లమీద పక్షులు హుషారుగా పాడుతుంటున్నాయి. అంతా మామూలుగానే ఉంది. ఏమీ జరిగినట్లే లేదు.

కానీ, బేంబికి మనస్సంతా వికలమైపోయింది. హృదయం చేయిపెట్టి దేవినట్లయింది. అంతా ఇంతలోనే ఇంత సంతోషంగా ఎల్లా ఉండగలుగుతున్నారో అతనికి అర్థం కాలేదు. జీవితం ఎంత అల్పం! అడుగడుగునా ప్రమాదాలే. దట్టమైన అడవి లోపలిభాగంలో ఇన్ని రహస్యస్థలాలున్నాయి. ఎంత నిర్భయంగా విహరించవచ్చు! అయినా ఈ దిక్కుమాలిన మైదానంలోకే వస్తారెందుకో? ఈ మైదానంలో లభించే స్వల్పానందానికి ఎంతెంత శిక్షలు!

పక్క పొదలలో ఏదో అలికిడి అయి, బేంబి ఆలోచనలలోంచి బయటపడ్డాడు. గిరుక్కున తిరిగి చూశాడు. ఎదట ముసలి నాయకుడు! పారిపోవడానికి ప్రయత్నంలో ఉన్నవాడల్లా ఆగాడు. నాయకుడు నిశితమైన చూపులతో బేంబికేసి చూశాడు.

"అది జరిగినప్పుడు నువ్వు అక్కడే ఉన్నావా ?"

"ఊఁ" అనిమాత్రం అనగలిగాడు బేంబి, తల వంచుకుని. ఆ సంగతి జ్ఞాపకం వచ్చేసరికి మళ్లీ గుండెలు అదిరాయి.

"మీ అమ్మ ఎక్కడ ?"

"తెలియదు" అన్నాడు, విచారంగా బేంబి.

"మరి అమ్మను పిలవడం మానేశావా ?"

బేంబి తల ఎత్తి, ముసలి నాయకుడి ముఖంలోకి చూశాడు. ఆ మాటకు అతనికి పౌరుషం పొడుచుకు

వచ్చింది. "ఇప్పుడు నేను ఒంటరిగా ఉండగలనండీ" అన్నాడు.

నాయకుడి కళ్లు బేంబిమీద వాత్సల్యపూరితంగా ప్రసరించాయి. కంఠంలో ఆర్ద్రిత ధ్వనించింది. "ఆ రోజున అమ్మకోసం ఏడ్చిన అబ్బాయివి నువ్వేకదూ?" అన్నాడు.

బేంబి సిగ్గుపడిపోయాడు. "అవునండీ" అని నసిగాడు.

నాయకుడు మౌనంగా బేంబిని ఆపాదమస్తకం పరిశీలించాడు. ఆ కళ్ళలో ఆప్యాయత కనిపించి, బేంబి ధైర్యం పుంజుకున్నాడు.

"అయితే తమరు నన్ను పోల్చుకున్నారన్నమాట? అప్పుడంటే అమ్మని విడిచి ఉండలేక పోయేవాడిని. ఇప్పుడు నాకేం భయం లేదండీ."

నాయకుడు దృష్టి మరల్చకుండా గంభీరంగా చూశాడు. ఆయన లోతైన కళ్ళలో మందహాస రేఖలు కనిపించాయి. మరికొంత ధైర్యంచేసి బేంబి ఇల్లా అన్నాడు:

"అయ్యా! అసలు ఈవేళ ఏం జరిగిందండీ? మనిషి, మనిషి అంటూ అడవి అంతా గగ్గోలుగా ఉంది. ఎవరా మనిషి?"

నాయకుడు బేంబిని విడిచి దూరంగా శూన్యంలోకి దృష్టి సారించాడు. కొంతసేపు ఊరుకుని మెల్లిగా ఇల్లా అన్నాడు:

"జాగ్రత్తగా వినడం నేర్చుకో. జాగ్రత్తగా వాసన చూడడం నేర్చుకో. చక్కగా చూడడం నేర్చుకో. స్వయంగా జీవితాన్ని తెలుసుకో."

నాయకుడు గంభీరంగా తల ఎత్తాడు.

"చిరంజీవివి కా!" ఆ మాటతో ఆయన అడవిలో మాయం అయిపోయాడు.

బేంబి ఒంటరిగా మిగిలిపోయాడు. అతని హృదయం దిగులుతో నిండిపోయింది. చెవులలో ముసలి నాయకుడి ఆఖరి మాటలు గింగురు మంటున్నాయి — 'చిరంజీవివి కా!' ఏదో తెలియని గర్వం హృదయంలో మెరిసింది. 'జీవితంలో అన్నీ ప్రమాదాలే. అయితే భయపడి లాభం ఏమిటి?' అనుకుంటూ బేంబి నెమ్మదిగా అడుగులు వేస్తూ అడవిలోకి వెళ్లిపోయాడు.

మైదానానికి వెళ్ళే దారిలోఉన్న పెద్ద జువ్వి చెట్టు, ఆకులను మెల్లిమెల్లిగా రాలుస్తున్నది. 'మిగిలిన చెట్లుకూడా కాస ముందూ వెనకగా ఎర్రటి, చ్చటి ఆకుల్ని గాలి పాటున విడిచిపెట్టేస్తున్నాయి.

రోజులు గడిచిపోతున్నాయి. జువ్వి చెట్టు చిటారి కొమ్మను ఉగ్గిలి పట్టుగా పట్టుకుని బంగారు రంగులోఉన్న రెండు పండు ముసలి ఆకులు మాట్లాడుకుంటున్నాయి.

"ఎంతలో ఎల్లా అయిపోయింది!"

"అవును. మనవాళ్ళు చాలామంది నిన్నరాత్రే రాలి పోయినట్లున్నారు, పాపం! ఈ కొమ్మని మన మిద్దరమే మిగిలి నట్లున్నాము."

"మరణం ఎప్పుడు వచ్చి పడుతుందో ఎవ్వరికీ తెలియదు కదా? నీకు గుర్తుందా? సూర్యుడు నడినెత్తిని ఎంతో కాంతితో వెలిగేవాడు. ఎంతో వెచ్చగా ఉండేది."

"ఆ రోజులు వెళ్లిపోయాయి. సూర్యుడు అపురూపం

అయిపోయాడు. ఒకవేళ సూర్యుడు కనిపించినా వెనకటి వేడి లేదు. అతణ్ణి చూస్తే మనకు వెనకటి ఉత్సాహము కలగడం లేదు." అని నిట్టూర్చింది.

"మనం ఇప్పుడో మరి కాస్సేపటిలోనో రాలి మట్టి అయిపోతాము. మన చోట్లో కొత్త ఆకులు వస్తాయి. అవి పోతే మరో ఆకులు. దీనికి అంతే లేదు కాబోలు."

"సరే. దాన్ని గురించి ఎందుకీ ఆలోచన? మన చిన్ని బుర్రలకు అందేది కాదది."

"ఏమిటో భయంగా ఉంది."

రెండూ కాస్సేపు ఊరుకున్నాయి. మళ్ళీ మొదటి ఆకు అందుకుంది:

"అసలు మనం ఎందుకు రాలిపోవాలి? రాలిపోయాక మనం ఏమవుతాము?"

"కింద మట్టిలో..."

"అక్కడెలా ఉంటుందో?"

"నాకూ తెలియదు. అందరూ తలోలాగా చెప్పుకుంటూ ఉంటారు."

మళ్ళీ కాస్సేపు మౌనం.

"కిందపడిపోయాక మనకేమైనా తెలుస్తుందా? స్పర్శలాంటి పరిజ్ఞానం ఉంటుందంటావా?"

"ఆ సంగతి ఎవ్వరికీ తెలియదు. మట్టిలో కలిశాక మరి తిరిగి వచ్చి చెప్పినవాళ్ళు లేరు."

మళ్ళీ మౌనం. బాధతో నిట్టూర్పు.

"మరీ అంతగా కుమిలిపోకు."

"అబ్బే! లేదు. ఏదో వణుకు వస్తోంది. ఆ వెనకటి గట్టితనం లేదు ఒంట్లో."

"ఇంకో దేదైనా చెప్పు. మన సంభాషణ మరీ దిగులు కలిగిస్తోంది."

"సరే, ఏం మాట్లాడుదాము?"

కాస్సేపు నిశ్శబ్దం.

"చివరి ఘడియ దగ్గర పడ్డట్టే ఉంది. మనలో ముందెవరో; వెనకెవరో."

"ఆ సంగతి వదిలెయ్యి. చిన్నప్పటి మాటలేమైనా చెప్పు. ఆ రోజులు తలుచుకుంటే కాస్త మనస్సుకి సంతోషంగానైనా ఉంటుంది. అప్పట్లో సూర్యుడు ఎంత వేడిగా, ఎంత కాంతిగా ఉండేవాడో జ్ఞాపకం ఉందా? మన నోళ్లలోకి ఎంతెంత రసం వచ్చేది! తాగనని మారాంచేసినా అమ్మ నోట్లో పోసేసేది."

"తెల తెలవారే వేళ పొగమంచు ఎంత బాగుండేది! నవనీతం లాంటి రాత్రిళ్ళు."

"ఇప్పటి రాత్రిళ్ళు భయంకరంగా ఉన్నాయి. ఎంతకీ తెల్లారదు."

"మనది పూర్ణాయుర్దాయంలే — ఏ మాట కామాటే చెప్పుకోవాలి."

"నేను చిన్నప్పటికీ, ఇప్పటికీ చాలా మారిపోయానులా ఉంది."

"నాకు మాత్రం నీలో మార్పు కనిపించడం లేదు. అదే అందం, అదే సొగసు. మార్పేం కనిపించదు."

"చాలైద్దా. మరీ పొగుడుతావు."

"అబ్బే! పొగడ్త కాదు, నిజం. చిన్నప్పుడెల్లా ఉన్నావో ఇప్పుడూ అంతే. ఉందా లేదా అన్నట్లు ఆ పసుపుపచ్చదనం చివళ్లనుంది. అదైనా నీకు అందాన్నే ఇస్తూంది."

"నువ్వు చాలా మంచివాడివి. మొదటినుంచీ నీ స్వభావమే అంత. నే నెరుగుదునుగా?"

"చాల్లే. ఊరుకో."

ఇద్దరూ ఆయాసపడుతున్నారు. మరికొన్ని గంటలు గడిచాయి. గాలి తెర వచ్చింది.

"అయ్యో! నువ్వుకూడా రాలిపోయావూ? నేనూ త్వరలో నిన్ను కలుసుకుంటాలే."

అంతే. గొంతు పూడిపోయింది. మరో నిమిషానికి ఆ ఆకుకూడా వణికి రాలి నేలమీద పడిపోయింది.

శీతాకాలం అడుగుపెట్టింది.

  

అడవి అంతా మారిపోయింది. గుర్తు తెలియనంతగా మారిపోయింది. ఎప్పుడూ కలకలలాడే ఆ పచ్చదనం మాసిపోయింది. ఎక్కడ చూచినా పేదతనం కొట్టవచ్చినట్లు కనిపిస్తూంది.

ఈ కొత్త పరిస్థితులకు జేంబి ఓ పట్టాన అలవాటు పడలేకపోయాడు. తినడానికి గడ్డికూడా కరువై పోతుందని అతడెప్పుడూ అనుకోనేలేదు. ఆకుల కప్పుకింద తన పొదరిల్లు ఎప్పుడూ వెచ్చగానే ఉంటుందనుకున్నాడు. ఆ కలలన్నీ కరిగిపోయాయి.

మొదట్లో చుట్టుపక్కల వాతావరణంలో వస్తున్న మార్పులకు అతడు సంబరపడ్డాడు. తెల్లవారకట్ట మైదానాన్ని పొగమంచు కప్పేసేది. సూర్యోదయమయ్యాక ఆ మంచు దట్టమై, మెల్లిగా కరిగిపోయేది. చెట్ల ఆకులు పచ్చగానూ, ఎర్రగానూ మారుతుంటే అతనికి వింతగా తోచింది. సూర్య కాంతిలో అడవి అంతా వెలిగిపోతున్నట్లు భావించుకునే వాడు.

తమ ఉత్తరదేశపు జ్ఞాతుల అరుపులు ఇప్పుడు ఎక్కు వగా వినిపిస్తున్నాయి. అవి వింటుంటే ఎంతో ఆందోళన కలుగుతున్నది. ఆ స్వరాలకు అడవి అంతా కంపిస్తున్న ట్లుండేది.

అబ్బబ్బ! ఎంతెంత శరీరాలు! ఎంత బలం! వీటి కిరీ టాలు చెట్ల మొదళ్లలా ఉన్నాయి' వీటి కంఠధ్వని ఉరుము లతో పోటీ పడుతుంది - అంటూ కవిత్వం అల్లుకునేవాడు. భరించరాని బాధ, ఒక్కొక్కప్పుడు గర్వం, ఉత్సాహం లాంటి భావాలు వాళ్ళ అరుపులలో వినిపిస్తూ ఉండేవి.

తమ జ్ఞాతుల బలపరాక్రమాలను తలుచుకున్నప్పుడు జేంబి గర్వపడ్డా, అవి 'నన్ను ముట్టుకోకోయ్' అన్నట్లుండ డం అతని కసంతృప్తి కలిగించేది. తన్ను చులకన చేస్తున్నట్లు అనిపించేది. ఎందుకో తనకే తెలియదు. 'ఉహూఁ! వాటితో పొత్తు పనికిరాదు' అని నిర్ణయించుకున్నాడు.

రాత్రివేళ అడవిలో తిరుగుతూఉన్నా, పగలు ఇంట్లో పడుకునిఉన్నా రాలిపోతున్న ఆకుల చప్పుడే వినిపించేది' ఎక్కడ విన్నా గలగలలు, గరగరలు. ఆ గలగలలలో ఏవో

రహస్యాలు వినిపించేవి. నిద్రకూడా పట్టేది కాదు.

ఇప్పుడు అడవి నేల అంతా పండుటాకులతో నిండి ఉంది. అడుగులేస్తే అవి గయ్‌మనేవి. కాళ్ళతో వాటిని నాలుగుమూలలకూ దున్నడం బలే సరదాగా ఉండేది. ఆ ఆకుల గలగలలు వినడానికి తమాషాగా ఉండడమే కాదు; వాటి వల్ల చాలా లాభాలు కనిపిస్తున్నాయి. కష్టపడి వాసన పసికట్ట నక్కరలేదు. కళ్లు పొడుచుకుని చూడ నక్కరలేదు. పరాయివాడు దగ్గరకు వస్తుంటే చెప్పేస్తున్నాయి.

వర్షం కురిసింది. పొద్దుటినుంచి చాలా రాత్రి అయే వరకూ అలా కురుస్తూనే ఉంది. రివ్వున చలిగాలి ఒకటే పోరు. మళ్ళీ తెల్లారాక కొట్టించిన విసురుతో వర్షం. అడవిలో పొడిగా ఉండే చోటే మిగలలేదు. కాస్త ఎంగిలి పడదామని గడ్డి కొరకబోతే నోటినిండా నీళ్ళు. ఏ పొద్దనైనా కాస్త రాసుకుంటే చాలు, జడివాన.

వర్షాకాలంలో రోజులు గడవడం ఎంత కష్టమో బేంబికి అర్థం అయింది. తడిసిన చర్మాన్ని మాటిమాటికీ దులుపుకోవలసి వచ్చేది. వెచ్చదనానికి అర్రులు చాచేడు.

ఆకుల గలగలలు అణగిపోయేయి. ఇప్పుడవి మెత్తబడి తడిగా ఉన్న నేలను అంటుకుని పడిఉన్నాయి.

తరువాత ఉత్తర పవనాలు వీచడం మొదలుపెట్టేయి. అసలు చలి అంటే ఏమిటో బేంబికి ఇప్పుడు తెలిసింది. అమ్మదగ్గర ఎంత ఒత్తుకుని పడుకున్నా చలి తగ్గడంలేదు.

చలిగాలి విసురు హెచ్చింది. అడవిమీద కోపంవచ్చి చెట్లన్నింటిని వేళ్ళతో సహా పీకెయ్యాలని అనుకుంటూందేమో

అన్నట్లు గాలి భయంకరంగా విసురుతూంది. ఆ విసురు నెదిరించి పెనుగులాడుతున్న పీనుగులాగ చెట్లు అల్లల్లాడి పోతున్నాయి. కొమ్మలు విరుగుతున్నాయి. ఒక్కొక్కటి వేళ్ళతోసహా లేచి వచ్చేస్తూంది. చెట్లబోడికొమ్మల మధ్య నుంచి సుళ్ళు తిరుగుతూన్న గాలి హోరులో మరింకే ధ్వనీ వినబడడం లేదు.

గాలీ, వానా కలిసి తమపని చక్కగా పూర్తిచేసుకున్నాయి. చెట్లను ఒక్కఆకు మిగలలేదు. ప్రాణం ఉందా లేదా అనిపించేటట్లు నల్లని మోళ్ళు తప్ప మరేమీ కనబడడం లేదు. నిలువెత్తు గడ్డితో కన్నుల పండువుగా ఉంటున్న మైదానంలో ఇప్పుడు గడ్డికోసం కన్ను పొడుచుకోవలసివస్తూంది. జేంబి పొదరిల్లు బోడిగా తయారైంది. ఇప్పు డక్కడ నిలుచుంటే చాటూ మాటూ లేదు. నడిదారిలో ఉన్నట్లే.

♦ ♦ ♦

ఒక రోజున చిన్నారి గోరింక ఒకటి మైదానంలో ఎగురుతూ వెడుతూంది. ఏదో మెత్తని, తెల్లని, చల్లని వస్తువు దాని కళ్ళ బడింది. అదిబహు స్వచ్ఛంగా ఉంది. దూదిపింజలా మెత్తగా ఉంది. చూస్తూండగానే ఆ చల్లని దూదిపింజలు పడడం దట్టమైంది. గోరువంక రెక్కలు దులుపుకొని వాటినుంచి తప్పించుకోడానికి ఇంకా పైకి ఎగిరింది. అక్కడా అవి వదలలేదు. అది మరింత పైకి ఎగిరింది.

"ఓసి పిచ్చిదానా! అనవసరంగా ఎందుకు ఆ శ్రమ?

పైకి ఎక్కడికి ఎగురుతావు ? ఎంత ఎత్తు ఎగిరినా ఈ పింజలు రాలకమానవు. అది మంచు!" అంది ఒక ముసలి కాకి.

"మంచా!" గోరువంక ఆశ్చర్యంతో నోరు తెరిచింది.

"అవును. ఇది శీతాకాలం. మంచు."

"క్షమించండి. నేను మొన్న మేనెల లోనే గూట్లోంచి బయటికి వచ్చాను. శీతాకాలం అంటే ఏమిటో తెలియదు నాకు."

"కావచ్చు. పోను పోను నీకే తెలుస్తుందిలే" అంది ఆ ముసలికాకి.

"ఎంత ఎత్తు ఎగిరినా ఈ మంచు తప్పకపోతే హాయిగా ఏకొమ్మ మీదనో కూర్చుంటా" అని సర్దుకుంది గోరువంక.



కాకి ముందుకు సాగిపోయింది.

మంచు చూసి బేంబి మొదట చాలా సంబరపడ్డాడు. తెల్లని పింజెలు రాలిపడుతూ ఉంటే ఎంతో హాయిగా ఉందనిపించింది.

త్వరలోనే బేంబికి ఆ ఉబలాటం తగ్గిపోయింది. గడ్డి కోసం ఇప్పుడు మంచులో చాలా సేపు వెతుక్కోవలసి వస్తూంది. మంచు పింజెలు గడ్డకట్టేయంటే నడిచేటప్పుడు కాలు జారుతుంది. కాళ్ళు విరుగుతాయి. జాగ్రత్తగా నడవవలసి వస్తూంది. గోబో నిజంగానే జారిపడ్డాడు. అతడెప్పుడూ అంతే. ఎవరో ఒకరు ఎప్పుడూ కనిపెట్టి ఉండవలసిందే.

వాళ్ళంతా తరుచు కలుసుకుంటూనే ఉన్నారు. ఏణిపిన్ని పిల్లలను తీసుకుని ప్రతిరోజూ వస్తూనే ఉంది. ఈ జట్టులో



మరీనా కూడ చేరింది. ఆమె చక్కని చుక్క. నవీనా పిన్ని ఉందంటే కబుర్లకు లోటు ఉండదు. ఆమెవి అన్నీ ప్రత్యేక మైన అభిప్రాయాలూ, అభిరుచులూ, మంచి మాటకారి.

పెద్దవాళ్ళంతా చుట్టూ చేరి కబుర్లు చెప్పుకుంటూంటే పిల్లలకు ఎన్నో సంగతులు తెలిసేవి. ఆడంగులంతా కూర్చుని ఉండగా అప్పుడప్పుడు ఒహడూ అరా యువరాజాలు వాళ్ళ దగ్గరకు వస్తూ ఉండేవారు. మొదట్లో పిల్లలు సిగ్గుపడేవారు కాని రానురాను అందరితోపాటు వాళ్ళూ కబుర్లలో దిగు తున్నారు.

యువరాజా రోనో అంటే బేంబికి చాలా గౌరవం. కారో అన్నా అంతే. వాళ్ళిద్దరూ ఈమధ్యనే తమ కిరీటాలు తీసిపారేశారు. బేంబి ఔత్సుక్యంతో వాళ్ళ బోడితలలమీాది చిన్న చిన్న నల్లని బొడిపెలను కన్నార్పకుండా చూశాడు. ఆ స్థలాలలో పూర్వం వాళ్ళకు కిరీటాలు ఉండేవి. అవి చూస్తే చాలా తమాషాగా ఉంది.

యువరాజాలు తమ కథలు చెప్తూ ఉంటే బలే సరదాగా ఉంది. రోనోకి ఎడమకాలిమీాద కంతి. ఆ కాలు కాస్త సంకర కూడాను. నడిచేటప్పుడు కొంచెం కుంటుతాడు. అతడు తన సంభాషణలో తరుచుగా తన కుంటి కాలిని గురించి చెప్తూ ఉంటాడు.

“నేను కుంటుతూ వుండడం మీారు గమనించే ఉంటారు” అని మొదలు పెడతాడు.

అందరూ మర్యాదకు, “అబ్బే! కుంటడం ఏమీా కనబడడం లేదు” అంటారు. రోనోకి కావలసిందే అది. కాని,

అతని కుంటి నడక స్పష్టంగా కనిపిస్తూనే వుంటుంది.

"పెద్ద గండం తప్పి బతికేను" అని రోనో తన కథ మొదలుపెడతాడు.

ఆ మనిషి ఒకరోజున రోనోమీద అగ్గి కురిపించాడు. అయితే ఆ అగ్గి కాలికి మాత్రమే తగిలింది. చర్మం బాగా చీకుకుపోయింది. భరించరానంత బాధ. దాని నెలాగో ఓర్చుకుని రోనో మూడుకాళ్లమీదే పరుగు అందుకున్నాడు. వెనకాల ఎవరో తరుముకు వస్తున్నట్లు తోచింది. ఆయాసం. అయినా ఆగడానికి వీల్లేదు. పరుగెత్తాడు; పరుగెత్తాడు. చీకటి పడేదాకా పరుగెత్తుతూనే వున్నాడు. ఆఖరికి ఆ రాత్రికి ఒకచోట ఆగి, కాస్త ఊపిరి తీసుకున్నాడు. తెల్లవారగానే మళ్ళీ పరుగు. చివరికి ప్రమాదం దాటిపోయిందని తోచింది. ఒక రహస్య స్థలంలో తల దాచుకున్నాడు. ఆ పుండు మానుపట్టేకనే లేచి, అందరిలోకీ వచ్చాడు. అదీ అతని కథ. అతణ్ణి అందరూ మహావీరుడుగా ఊహిస్తారు. పాపం! బాగా కుంటుతాడు. కాని అది ఎవరికీ కనిపించదనే ఆతని ఊహ.

నలుగురూ కలిసి కూర్చుని కబుర్లు చెప్పుకునేటప్పుడు సంభాషణ ఎక్కడ ప్రారంభమైనా అది తప్పకుండా మనిషి మీదికే మళ్ళేది. మనిషి ఎంత భయంకరంగా వుంటాడో, అతని వాసన ఎంత తలదిమ్మెక్కిస్తుందో ఒకరి తరువాత ఒకరు వర్ణిస్తూ వుంటారు. జేంబి కూడా మనిషిని చూశాడు. చెప్పడానికి అతనికే కొంతఅనుభవం ఉంది. అయితే పెద్దవాళ్ళు మాట్లాడుకునేటప్పుడు పిల్లకాయలు మధ్యలో తలదూర్చడం

మర్యాద కాదు. ఆ విషయం బేంబికి తెలుసు. అందుకే ఎప్పుడూ వాళ్ళమాటలు వింటాడే కాని, తాను మాట్లాడడు.

మనిషి రెండు కాళ్ళమీద నడుస్తాడని వాళ్ళందరికీ చాలా ఆశ్చర్యం. అతని చేతికి ఎంతో లాఘవం వుందని గుసగుసలు పోతారు. ఆ చేతుల సంగతి వచ్చినప్పుడు నవీన పిన్ని తప్పకుండా చప్పరించేసేది.

"అందులో ఆశ్చర్యమేముందీ? మన ఉడత వెనక కాళ్ళమీద కూర్చుని, ముందరి కాళ్ళతో అన్ని పనులూ చేసుకోవడం లేదూ? అది గొప్పేంకాదు" అంటుంది.

ఉడత వెనక కాళ్ళమీద కూర్చోవడం, మనిషి రెండు కాళ్ళమీద నడవడం ఈ రెండూ ఒకటి కాదని అందరూ చెప్పేరు. కాని, నవీనపిన్ని ఒప్పుకోలేదు

కాకి, గద్ద, గూబ, వీటన్నింటికీ రెండేసి కాళ్ళే. అప్పుడప్పుడు అవి ఒక్క కాలిమీద నిలుచుని, రెండో కాలితో ఏదేనా పట్టుకుంటూ వుంటాయి. మనం ఎన్నో సార్లు చూశాం. మనిషికూడా అంతే."

మనిషిలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు అంటుందామె. అతని పేరు చెప్తే ఆవిడకు చెప్పలేని రోత.

"మనషిమాట ఎత్తితే నాకు డోకు" అని ముఖం వికారంగా పెడుతుంది.

ఆమె మాట నెవ్వరూ కాదనరు. అయితే, మనిషికి మూడో చెయ్యి వుందా లేదా అన్న విషయంమీద అందరిదీ తలోదారీ అయింది.

"ఆ, సింగినాదం! మూడో చెయ్యాకాదు, ఏంకాదు"

అంటుంది నవీనా.

కాని రోనో ఆ అభ్యంతరాన్ని అంగీకరించడు. "ఓహో అల్లాగేం! అయితే నా కాలిమీద దెబ్బ కొట్టింది ఎవరంట" అని అడ్డు తగులుతాడు.

"నీ గాయం సంగతి నువ్వు చూసుకోవాలి. కాలు విరిగింది నాకు కాదు కదా," అని నవీనా కించపరిచినట్లు మాట్లాడుతుంది.

ఓ మాటు ఏణిపిన్ని అని అంత తీసిపారవెయ్యవలసిన మాట కాదంది.

"మూడో చేతిని గురించి నేను చాలాసార్లు విన్నాను."

యువరాజా కానో మర్యాదలు ఒలకబోస్తూ తన అభిప్రాయం చెప్పేడు.

"నాకు తోచిన మాట ఒకటి చెప్తే మరోలా అనుకో రనుకుంటాను. నాకు తెలిసిన కాకి ఒకటి ఉంది..."

అందరూ ఏమనుకుంటున్నారో అన్నట్లు ఒకమారు అందరి ముఖాలలోకీ చూశాడు.

"ఆ కాకికి అనేక సంగతులు తెలుసు. మనిషి నిజంగా మూడో చెయ్యి వుపయోగిస్తాడుట. ఐతే ఒక్కొక్కప్పుడు వుపయోగించక పోవడం కూడా వుందిట. అది ఆ కాకి చెప్పింది. ఆ మూడో చెయ్యి చాలా ప్రమాదమైందిట. అది మనిషికి శరీరంలోంచి పుట్టుక వచ్చింది కానేకాదుట. దానిని భుజంమీద వేసుకుని వస్తాడట. అది కూడా వుందంటే అపాయం వున్నట్లూ, లేదా లేనట్లూ సులభంగా చెప్పెయ్యవచ్చుట..."

నవీనపిన్ని ఎకసక్కెంగా నవ్వింది.

"నీకాకి ఎవరోగాని, దానికి బుర్ర ఉన్నట్లులేదు. ఈమాటు అది కనిపిస్తే నే చెప్పేనని చెప్పు - మనిషి ఎప్పుడూ ప్రమాదమే."

అయితే ఆమె మాటను ఇతరులు ఒప్పుకోలేదు.

"అయితే వాళ్ళలో మాత్రం మంచివాళ్లు ఉండరా ఏమిటి?" అంది బెంబి అమ్మ.

"ఓహోహో! ఏమి సత్యకాలం! మనిషి వస్తూంటే ఎదురువెళ్ళి స్వాగతం చెప్పేలా ఉన్నావు" అంది నవీన పిన్ని వెక్కిరిస్తూ.

మాట మధ్యలో ఫలీనా కలిగించుకుంది.

"అతడంత దూరాన కనిపించినప్పుడు కాళ్ళకి బుద్ధి చెప్పడమే మంచిది."

చిన్నపిల్ల అల్లా అంటూ ఉంటే అందరికీ నవ్వు వచ్చింది.

"మూడితో చెయ్యి అను. మరేమన్నా అను. దానివల్లే కదా చావు మూడుతోంది" అంది ఏణి పిన్ని.

అయితే ఎవరికీ ఆ సంగతి సరిగా తెలియదు.

అందరూ ఎవళ్ళో చెప్పగా విన్నమాటలే. మనిషి దూరంగా నించుంటాడు. ఏమీ కదలడు. అంతలో ఏదో అయిపోతుంది. పెద్ద ఉరుములా చప్పుడు వినిపిస్తుంది. అంతే. ఎవళ్ళో ఒకళ్ళు చచ్చిపోతారు.

లేళ్ళు అన్నీ భయంతో దగ్గరకుచేరి నిలబడ్డాయి. మొన్న మొన్న జరిగిన సంఘటనను ఇంతకు పూర్వం విన్న

వాటితో సమన్వయించి చూచుకున్నాయి. భయంతో వణికి
పోయాయి. ఉన్నట్లుండి ఆ మనిషి ఎంతో మంచివాడై పోయి,
ఎవరినీ చంపకపోతే ఎంత బాగుంటుందో అనుకున్నాయి
అన్నీ.

"దూరాన్నుంచి చంపడం ఎల్లా సాధ్యమవుతుందో?"
అన్నాడు కారో.

"మీ తెలివైన కాకిబావ ఉన్నాడుగా! అడుగు"
అంది నవీనా.

"నేనూ అడక్కపోలేదు. అడిగేను. అయితే కాకి
తనకికూడా తెలియదంది."

"మనిషి తలుచుకుంటే ఆ కాకినికూడా ఇట్టే చంపే
స్తాడు" అన్నాడు రోనో.

"ఎగిరిపోతున్న పిట్టలనుకూడా" అంది ఏణి.

"తన చేతిని విసిరేస్తాడని మా అమ్మమ్మ చెప్తూ
ఉండేది" అంది బేంబి అమ్మ.

"ఆహా! అలాగేం! అయితే ఆ చప్పుడేమిటో?" అంది
వేళాకోళంగా నవీనా.

"చెయ్యి విసిరేసినప్పుడు అగ్గి పుడుతుంది. చప్పుడవు
తుంది. అసలు మనిషే అగ్గి" అంది బేంబి అమ్మ.

మధ్యలో రోనో అడ్డు వచ్చాడు.

"మనిషి నిండా అగ్గి అన్నమాటకి సందేహం లేదు.
కాని అతని చెయ్యి విషయంలో మాత్రం మీరంతా కాస్త
పొరబడుతున్నారు. ఇదిగో, నా కాలిమీద చూశారా,
ఇలాంటిగాయం చేతితో ఎలా అవుతుంది? అది పన్ను.

పన్ను విసురుతాడు. ఒక్కొక్క జంతువు కరిస్తే చచ్చిపో తూంటాయి. మనకి తెలుసుగా? అది పన్ను. సందేహం లేదు."

కారో దీర్ఘంగా నిశ్వసించాడు.

మరీనా ఇలా అంది.

"ఏదో ఒక రోజున మనిషి మారిపోతాడంటాయి. అప్పుడు మనలాగే అతడూ మంచిగా అవుతాడు. మనతో ఆటలాడు కుంటాడు. అడవిలో మనమందరం ఎంతో సంతో షంగా ఉండవచ్చు. భయం లేకుండా శాంతంగా జీవించ వచ్చు."

"ఆ మనిషి మనతో ఆటలాడ నక్కరలేదుగానీ, తన గొడవేదో తాను చూసుకొని, మన్ని ఇలాగా విడిచిపెడితే చాలు" అంది నవీనా.

"అది కూడా సరియైన మాటకాదు" అంది ఏణి.

"ఏం, ఎందుచేతనుటా? మనిషిని నేను చచ్చినా నమ్మను. నాకు జ్ఞానం వచ్చినప్పటినుంచీ చూస్తున్నాను. వాడు మన అన్నల్ని, తమ్ముళ్ళని, అక్కల్ని, చెల్లెళ్ళని, అమ్మల్ని, నాన్నల్ని, మన పిల్లల్ని ఎందరిని పొట్టన పెట్టు కున్నాడో! కనిపిస్తే చాలు, చంపేస్తున్నాడు. వాడికేం అప కారం చేశామనీ? అలాంటి వాడితోటా స్నేహం? ఛీ" అంది నవీన పిన్ని వగరుస్తూ.

"కాదు, పిన్నీ! ఎప్పటికో అప్పటికి ఈ ద్వేషాలు చల్లారక తప్పదు" అంది మరీనా.

నవీన పిన్నికి అది నచ్చలేదు. కాని ఇంక కొనసాగించ

దలుచుకోలేదు. లేచింది.

"నాకు ఆకలివేస్తోంది. ఈ మాటలు ఎప్పుడూ ఉండేవే. పోయి, ఏదో కాస్త ఎంగిలి పడాలి."

ఇంక వాళ్ళపని ఏమీ లేదన్నట్లు నవీనా దూరంగా వెళ్ళిపోయింది.

శీతాకాలం ఇంకా నడుస్తూంది. అయితే చలిగాలి విసురు తగ్గింది. మంచు పడడం తగ్గింది. మంచు గుట్టలు గట్టిపడ్డాయి. బాగా ఎండ కాచినప్పుడు మంచు పైపొరలు కరుగుతున్నాయి. చీకటి పడ్డాక మళ్ళీ గడ్డ కట్టిపోతున్నాయి. వాటిమీద నడుస్తూంటే మంచు పెళ్ళలు పెళపెళమని విరుగుతూ ధ్వనివినిపిస్తూంది. జారుడుగాకూడా ఉంది. వాటిమీద నడుస్తూంటే కాలి మడమలు నెప్పులు పుడుతున్నాయి.

గాలి స్వచ్ఛంగా, మందంగా, చల్లగా వీస్తూఉంది. ప్రకృతిలో ఆ తీక్ష్ణత, తగ్గి సాత్వికత్వం కనిపిస్తూంది .అయితే ఇప్పుడు అడవిలో కొత్త ఇబ్బందులు తలెత్తేయి. అడుగడుగునా భయంకరమైన సంఘటనలు.

కుందేలు మామయ్యగారి మూడో వాడు - కాస్త జబ్బువాడు. ఓ రోజున వాడు పాపం కాళ్ళీడ్చుకుంటూ తన దారిన పోతున్నాడు. ఇంతలో ఒక బొంతకాకి పిశాచంలా మీదపడింది. తన ఇనప ముక్కుతో వాణ్ణి తూట్లు తూట్లుగా పొడిచేసింది. బాధతో వాడు అరుస్తూంటే అడవి అంతా అదిరిపోయింది. దూరంగా ఎక్కడో కాయలూ కసర్లూ ఏరుకుంటున్న కుందేలు మామయ్యకు ఆ కేకలు వినిపించాయి. పిచ్చెత్తినట్లు అయిపోయాడు పాపం.

మరో రోజున వెంట్రుక పరాగ్గాఉన్న ఉడత మీదపడి నడ్డి చీరేసింది. ఉడత గిజాయించుకొని దాని నోట్లోంచి తప్పుకుంది. చెట్టుమీదికి ఎగ బాకేసింది. అక్కడ కూర్చుని, చీరుకుపోయి రక్తంతో తడిసిన వీపు తడుముకుంటుంటే వెనుకపాటున డేగవచ్చి, పొడిచేసింది. ఉడత కిందపడి పోయింది. దానిని పక్షులు ముక్కలు ముక్కలు చేసేశాయి.

ఇది జరిగిన కొద్ది రోజులకే నక్క చడీ చప్పుడూ కాకుండా వచ్చి, నెమలిని పట్టుకుని గొంతు కొరికేసింది. ఆ నెమలి అంటే ఆ అడవి అంతా పెద్ద పేరు. అంత అంద మైనది లేదనుకుంటారు. అల్లాంటిది చచ్చి పోయిందని విన్న రోజున ఆ అడవి జంతు వులన్నీ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాయి. ఆ



దురంతం గురించి ఎవరికి తెలిసిన మాటలు వాళ్ళు చెప్పు కున్నారు. ఆ నెమలి ఉంటున్న పొద మంచుతో కప్పబడి ఉందిట. అందులోనే అది పడుకుని ఉంది. తాను ఎవ్వరికీ కనపించ ననీ, ఈ చలికాలం ఏదో ఇలా వెళ్ళబుచ్చేద్దా మనీ అనుకుంటూ ఉందిట, పాపం కాని, ఇంతలో చావుముంచుకు వచ్చింది. పట్టపగలు ఇలాంటి దురంతం జరగడంతో పక్షులన్నీ బెదిరి పోయాయి. అంతులేని ఆకలి అక్కడి జీవా లలో క్రౌర్యాన్ని, మొరటుతనాన్ని కలి గించింది. ఆకలి హృదయాన్ని నమిలేసింది. సహృదయత్వాన్ని చెరిపేసింది. దయను దాచేసింది. కట్టుబాట్లన్నీ కదిలిపోయాయి.

"అసలు ఎప్పటికైనా రోజులు బాగుపడ తాయా అని అనుమానంగా ఉంది" అంది బేంబి అమ్మ, దిగులుగా.



ఏణి పిన్ని నిట్టూర్పు విడిచింది.

"నాకూ అల్లాగే అనిపిస్తూంది."

"పూర్వం ఎంత బాగుండేదీ!" అని వెనుకటి ఉల్లాసం తలుచుకుంది మరీనా.

ఇంతలో నవీన పిన్ని గోబోను చూసి, ఏణితో ఇల్లా అంది:

"అదేమిటమ్మా! మీ పిల్లాడు మరీ ఇంత అర్భకంగా ఉన్నాడూ! ఆ నడక ఏమిటి? ఆ వణుకేమిటి?"

"అవునమ్మా! ఏం చెయ్యమంటావు? వాడెప్పుడూ అల్లాగే ఉంటున్నాడు" అని విచారించింది ఏణి.

గోబోకు ఎప్పుడూ ఏదో ఒంట్లో బాగుండకపోవడమే. బేంబి, ఫలీనాలకన్న పెరుగుదలలో బాగా వెనకబడిపోయాడు. ఈ చలికాలం వచ్చాక వాడి పని మరీ అధ్వాన్నంగా ఉంది. కాలి గిట్టలతో మంచుగోకేసి, గడ్డి పరకలు ఏరుకు తినడం వాడికి చేతకాదు. కడుపునిండకపోతే బలం ఎక్కడి నుంచి వస్తుంది? ఓపిక లేక ఎందులోనూ కలుగజేసుకోడు.

నవీన పిన్ని వాత్సల్యంతో గోబోను దగ్గరకు పిలిచింది.

"మొహం అల్లా వేలాడేసుకోకూడదు. యువరాజులు అల్లాఉంటే అందరూ నవ్వరూ."

ఉన్నట్లుండి రోనో ఉలిక్కిపడ్డాడు.

"ఏమిటో అది? ఏదో జరుగుతోంది" అన్నాడు కంగారుగా.

అందరూ గాభరాగా లేచి నిలబడ్డారు.

"ఏమి టేమిటి? ఏం జరిగింది?"

"ఏమో తెలియదు. నాకేదో గాభరాగా ఉంది. గుండెల్లో ఏదోలా ఉంది. ఏదో జరుగుతూంది" అన్నాడు రోనో.

కారో మోర పైకెత్తి, గాలి పీల్చుకుని, వాసన చూసేడు.

"ఏమీ లేదే! ఏం ఉన్నట్లు లేదే!" అని గొణిగేడు.

రోనో కంగారు తగ్గలేదు.

"వాసన ఏమీ లేదు. కాని నా మనస్సుకి ఏదో కంగారుగా ఉంది."

"అవిగో, కాకులు అరుస్తున్నాయి" అంది మరీనా.

"అవిగో. అవునవును" అంది ఫలీనా.

అందరికీ కాకుల అరుపులు వినిపించాయి.

"అవిగో, కాకులు ఎగురుతున్నాయి" అన్నాడు కారో.

అందరూ తలఎత్తి చూశారు. కాకుల గుంపు అరుస్తూ చెట్లమీదుగా ఎగిరిపోతూంది. అవి అడవికి ఆ చివరినుంచి ఎగిరి వసున్నాయి. మామూలుగా అపాయా లన్నీ ఆ దిశనుంచే వస్తూంటాయి.

కాకులు ఎగిరిపోతూ కోపంగా అరుస్తూంటే జంతువు లన్నీ వింటున్నాయి:

"నేను చెప్పినది నిజమంటారా, కాదా? ఏదో జరుగు తూంది" అన్నాడు రోనో.



బేంబి అమ్మ భయం భయంగా అడిగింది: "ఇప్పుడేంచేద్దాం?"

"పారిపోవాలి" అంది ఏణి.

"కాస్సేపు చూద్దాం ఆగండి" అన్నాడు గోనో.

"ఈ పిల్లలతోనా? అమ్మనాయనోయ్! గోబో అసలు పసుగెత్తలేడు కూడాను" అంది ఏణి.

అయితే సరి. వెళ్లండి. నామట్టుకి నాకు ఇప్పటినుంచీ పసుగెత్తడం అనవసరం అనిపిస్తూంది. అయితే, నేనేదో వద్దంటున్నా ననుకోకండేం? వెళ్ళదలచుకున్నవాళ్ళు వెళ్ళండి" అన్నాడు గోనో.

ఏణి పిన్ని ముందుకు అడుగేస్తూ పిల్లలను కంగారుగా పిలుస్తూంది.

"గోబో! ఫలీనా! నడవండర్రా, పోదాం!" ఆమె వెళ్లిపోయింది.

మిగిలినవాళ్ళంతా అక్కడే నిలబడ్డారు.

"ఏమవుతుందో?" అంది నవీన పిన్ని.

అంతలో ఆ దిక్కునుంచే "త్రీం-త్రి-త్రీం-త్రీం" అంటూ గోరువంకలు అరుస్తున్నాయి.

"జాగ్రత్త! అపాయం! జాగ్రత్త!"

కాస్సేపటిలో గోరింకల గుంపు ఎగిరిపోతూ కని పించింది.



గిజిగాడు "తీచ్" అంటూ ప్రమాద సూచన చేశాడు.

లేళ్ళకేమీ తోచలేదు. ఒకదానినొకటి ఒరుసుకుని నిలుచుని ఉన్నాయి.

ఆ వస్తున్నది మ—ని—షి! భరించరాని వెగటు వాసన, గాలి తెరతో తోసుకువచ్చింది. ఆ వాసనకు తలలు తిరి గాయి. భయం గుండెల్ని పిండేసింది. ఉన్నట్లుండి తొడ తొక్కిడి ప్రారంభమైంది.

చెట్లమీదనుంచి వందల పిచికలు తొందర పెట్టేయి.

"పరుగెత్తండి! ముందరికి!"

నల్లంగి పిట్ట కూసింది. చెట్ల వెనుకనుంచి నెమళ్ళు, అడవికోళ్ళు హడావిడిగా పరుగెత్తుకు వచ్చాయి. వాటి మధ్యనే బూడిదరంగు కుచ్చుతోకా ఉంది. అది నక్క. ఇప్పుడు నక్క అంటే ఆ నెమళ్ళకు భయంలేదు. గాఢంగా, ఘాటుగా, మత్తుగా నసాళాన్ని అంటిపోతున్న నరవాసన చెట్ల సందులలోంచి విసురుతూంది. జంతువులకూ, పక్షు లకూ అన్నిటికీ వొకే వొక లక్ష్యం.

ఏమయినా సరే, ప్రాణాలు కాపాడుకోవాలి!

ఈ వాసన ఇదివరకెన్నడూ ఎరగనంత బరువుగా

ఉంది. శేళ్ళు నిలుచున్న చెట్ల తెరపికి నాలుగు వైపుల నుంచీ వస్తూంది. వాటికి అర్థం అయింది. వచ్చింది వొక్క మనిషి కాదు. అల్లాంటి వాళ్ళు చాలామంది ఉన్నారు.

ఉడతలు చెట్ల తొర్రలలో దూరి భయంగా అరిచేస్తున్నాయి. కొమ్మమీద గంతులేస్తూ పిచికలు వొళ్ళంతా నోరు చేసుకుని కీచు మంటున్నాయి. పావురాలు, గోరింకలు వొకటే రొద. ఆ గోలంతా వింటూంటే అంత ప్రమాదం లోను శేళ్ళకు కొంచెం విసుగనిపించింది.

ఇల్లాంటి అల్పజీవులకు ప్రస్తుతం వచ్చిన భయమేమీ లేదని వాళ్ళ భావం. కానీ, ఆ జీవుల ఆత్రం అర్థంకాక పోలేదు. మనిషి అంటే వాటన్నిటికీ భయమే, అసహ్యమే, ఆందోళనే.

కుందేలు మామయ్య గుండెలు కొట్టుకుంటూ పరుగెత్తుకు వచ్చాడు. వొక్క క్షణం ఆగి నిలబడి మళ్ళీ పరుగు అందుకున్నాడు.

కాకో అతణ్ణి ఆపేడు.

"ఏమిటయ్యా! ఏం జరుగుతోంది?" కుందేలు మామ గుప్పు తిప్పుతూ, కంగారుగా చూడడమే కాని నోరు విప్పలేక పోయాడు.

అంతా స్పష్టంగానే అర్థమైనట్లు రోనో అన్నాడు:

"అడగడం దేనికీ?"

కుందేలు మామ ముట్టె పైకెత్తి, గాలి పీల్చాడు అప్పటికి కొంచెం ఆయాసం తీరింది.

"మనిషి మన్ని చుట్టి పెట్టేశాడు! చుట్టూ మనిషే!



ఇక్కడి నుంచి బయటకు వెళ్ళడం సాధ్యం కాదు."

సరిగ్గా అదే సమయంలో మనిషి కంఠం వినిపించింది. పది.. ఇరవై... ముప్పై సార్లు గట్టిగా అరిచేడు మనిషి.

"హాోహాోహాోహాో! హాహాహాహా!"

ఆ కంఠం తుపానులా పొంగింది. మేఘంలా గర్జించింది. అతడు చెట్ల మాకులమీద దేనితోనో కొట్టేడు. ఉరుములాంటి చప్పుడైంది. చెట్లు బాధతో మూలిగేయి. అతడు నడిచి వస్తూంటే చెట్ల కొమ్మలు ఫెళఫెళలాడిపోయేయి.

అతడు చెట్ల తెరప్రివైపుకే వస్తున్నాడు.

అంతలో రెక్కలు టపటపలాడించిన చప్పుడు. ఒక నెమలి గాలిలోకి లేచింది.

ఒకటి, రెండు క్షణాలు గడిచాయి. పది బారలు పైకి లేచిందో లేదో ఉరుములాంటి చప్పుడు వినిపించింది. అంతలో

నిశ్శబ్దం. భూమిమీద ఏదో దబ్బుమని బరువుగా పడ్డ చప్పుడు. బేంబి అమ్మ మూలిగింది.

"నెమలి చచ్చిపోయింది."

"ఇది మొదటి బలి" అన్నాడు రోనో.

"ఈ సారి మనలో చాలామంది చచ్చిపోతాం కాబోలు. నేనుకూడా చచ్చిపోతానేమో" అని కళవళ పడింది మరీనా.

ఆమె మాట లెవరూ వినిపించుకోనేలా లేరు. ఎవరి భయం వాళ్ళది.

ఏం జరుగుతూందో తెలుసుకోవాలనుకున్నాడు బేంబి.

అంతకంతకు ధ్వనులు పెద్దవి అవుతున్నాయి. ఏవో ప్రేలుడు చప్పుళ్ళు, అరుపులు, కేకలు అన్ని వేపుల నుంచీ వినిపిస్తున్నాయి. అంత హోరులోనూ బేంబికి తన గుండెల చప్పుడు స్పష్టంగా వినిపిస్తూంది. అతని మనస్సు గజిబిజిగా ఉంది.

"నాకు దగ్గరగా ఉండు" అంది అమ్మ.

ఇప్పటికే ఆ మాట ఆమె పదిమాట్లు అంది. గట్టిగా అరిచినా అంత గోలలో గుసగుసలాడినట్లు వినిపిస్తూంది.

"నా దగ్గరగా ఉండు."

అమ్మ మాటలకు బేంబి ధైర్యం కోలుకున్నాడు. ఆమెకు మరింత దగ్గరగా జరిగేడు. ఆ క్షణంలో ఆమె ఆ మాట చెప్పకపోతే కంగారులో ఈ పాటికి పరుగు ప్రారంభించేవాడే.

బేంబి చుట్టూ చూశాడు. చిటారు కొమ్మ ఎక్కి

ఉడత చూస్తూ కబురందిస్తూంది. అడవి మొగలోకి తొంగి చూస్తూ నక్క సంగతులు చెబుతూంది. దానికిప్పుడు తన నోటి ముందుకు వచ్చిన ఆ పక్షులలో ఒక్కదానిని కూడా పట్టుకోవాలన్న కోరిక లేదు. మోరెత్తి మాటిమాటికి వాసన చూస్తూంది. కొత్త సంగతి ఏమైనా తెలుస్తుందేమో నని మహా తంటాలు పడుతూంది.

నెమళ్ళలో పెద్ద దొకటి కంగారుగా అటూ ఇటూ పరుగెత్తుతూంది. దానికి ఇంచు మించు మతిపోయింది, భయంతో.

"పైకిమాత్రం ఎగరకండి! చచ్చిపోతారు! ఎగరవద్దు! పరుగెత్తండి! పరుగెత్తండి" అని కీచుగొంతుతో అరుస్తూంది.

తానేమంటూందో కూడా దానికి తెలిసినట్లు లేదు.

ఈ మాటు మనిషి గొంతు మరీ దగ్గరలో వినిపించింది.

"హోహోహోహో! హౌహౌహౌహౌ!"

"పైకి మాత్రం ఎగరకం! ఎగరకండి!" అంటూనే ముసలి నెమలి రెక్కలు విప్పి, రివ్వున లేచింది.

బేంబి నెమలి లేవడం చూశాడు. రెక్కలు టపటప లాడటం విన్నాడు. దాని కళ్ళలో భయం కనిపించింది. మెడ సోగగా సాచింది. రెక్కలు బారజాపింది. అంతలో పెద్ద ఉరుము! ఎగురుతూ ఎగురుతూన్న నెమిలి చడీ చప్పుడూ లేకుండా మెడ వేలాడేసి కిందఉన్న నెమళ్ళ గుంపులో రాయిలా పడిపోయింది. ఇహ మరి కదలలేదు.

అయిదారు అడవి కోళ్లు ఒక్కసారిగా పైకి లేచేయి.

“ఎగరకండి. ఎగరకండి!” అని మిగిలిన పక్షులు ఒకటే గోల.

కాని అవి వినిపించుకొనే స్థితిలో లేవు. ఒక్కమారుగా అయిదారు ఉరుములు. ఎగురుతున్న పక్షులన్నీ టపటప నేలను రాలిపోయాయి.

“నడు, పోదాం!” అంది బేంబి అమ్మ.

బేంబి తిరిగి చూశాడు. రోనో కారోలు ఇదివరకే వెళ్లిపోయారు. నవీన పిన్ని వెళ్లిపోయింది. మరీనా వొకతే మిగిలిపోయింది. ముందుకు నడిచేరు, ముగ్గురూ. బేంబి, తల్లి పక్క పక్కల నడుస్తూంటే, వెనకాల మరీనా వస్తూంది.

నాలుగు మూలలనుంచీ వొకటే చప్పుడు, వొకటే అరుపులు, వొకటే ఉరుములూను.

బేంబితల్లి కంగారు పడలేదు. కాని, భయం లేకపోలేదు. కొడుక్కు ఏంచేయాలో చెబుతూంది.

“చిట్టి తండ్రీ! ఒక్కమాట చెప్తాను విను. తొందర పడి పరుగెత్తకు. నా పక్కనే వుండు. భయం లేదులే. ఎలాగో బయటపడిపోతాం.”

చప్పుళ్ళు అంతకంతకు ఎక్కువయ్యాయి. పది పదిహేను వురుములు ఒకదాని తరువాత ఒకటి అవ్యవధిగా వినవచ్చేయి.

“జాగ్రత్త! పరుగెత్తడం మాత్రం వద్దు. పుంతలోకి వచ్చేకే పరుగెత్తడం. తెలిసిందా? అప్పుడు బలంకొద్దీ పరుగెత్తాలి. మరో సంగతి. జాగ్రత్తగా విను. నాకు ఏదేనా

అయినా సరే ఆగవద్దు. అసలు చూడవద్దు. నేను పడిపో యినా సరే. ఒక్కటి జ్ఞాపకం వుంచుకో. పరుగెత్తాలి, అంతే."

అమ్మ మెల్ల మెల్లగా ముందుకు అడుగులు వేస్తూంది. వాళ్ళకు కొంచెం ముందుగా నెమళ్ళూ, కోళ్ళూనూ. మరో పక్కన కుందేలు మామయ్య కుచేల సంతానం.

ఎవ్వరూ నోరు విప్పి మాట్లాడడం లేదు. తెరిపి లేకుండా వినవస్తున్న చప్పుళ్ళతో చెవులు దిబ్బళ్ళు వేశాయి. భయంతో మతిపోయి ఉన్నాయి జీవులన్నీ.

చెట్ల వరుసలు ఆఖరు అయాయి. మధ్యన ఖాళీ పుంత. అవతల మళ్ళీ అడవి. వెనుకనుంచి డప్పుల చప్పుడు క్రమంగా దగ్గర పడుతూంది. హోహో హాహాలు పక్కనే వున్నట్టు వినిపిస్తున్నాయి.

కుందేలు మామయ్య, మరో ఇద్దరు బంధువులతో పుంతలోకి ఒక్క గంతు వేశాడు. ధనాధన్ మంది ఉరుము. కుందేలు మామయ్య వెల్లకిలా పడిపోవడం చూసి, బేంబి భయంతో నిలబడ్డాడు.

ఎవరిదో కంఠం వెనుకనుంచి వినిపించింది. "వచ్చే స్తున్నారు వాళ్ళు! త్వరగా! లేవండి! రండి!"

రెక్కలు ఆడించిన చప్పుడు. అడవి కోళ్ళు అన్నీ మూకుమ్మడిగా పైకి లేచేయి. పది ఉరుములు కలిసిపోయి. గుండెలు పగిలిపోయేటట్లు ఒక్కటే చప్పుడు. చచ్చిపోయిన పక్షులు నేలను రాలేయి. అదృష్టం బాగున్నవి కొన్ని మాత్రం తప్పించుకుపోయేయి.

అంతలో ఎవరిదో అడుగుల చప్పుడు వినిపించింది.

బేంబి తిరిగి చూశాడు. మనిషి! ఎక్కడ చూచినా మనిషి! డప్పులు వాయిస్తూ హోహో హోహో అని అరుస్తూన్న మనిషి! ఏ పొదలో చూచినా మనిషే!

"ఇదే సమయం! పరుగెత్తు! నాకు మరీ దగ్గరగా వుండకు. కాస్త ఎడంగా."

అంటూనే బేంబిఅమ్మ ఒక్క గంతు వేసి పుంతలోకి ఉరికింది. ఆ దూకుడుకు గిట్టలకింద మంచు నలుదిక్కులకూ ఎగిరిపడింది. అమ్మ వెనకాలే బేంబీ దూకేడు.

పెద్ద వురుము వురిమింది. ఆకాశం విరిగి నెత్తిమీద పడుతూన్నట్లు బేంబికి అనిపించింది. కంటికి ఎదర ఏముందో కూడా కనిపించడంలేదు. మరో రెండు దూకులతో దాటి పోయేడు.అతని మనస్సులో ఒక్కటే వాంఛ. ఏమయిపోయినా సరే పారిపోవాలి. తప్పించుకుపోవాలి. మనస్సులో మరో ఆలో చనే లేదు. ఒకటే పరుగు.

మధ్యలో ఒకచోట అమ్మ నేలమీద పడిపోతూన్నట్లు చూశా ననుకున్నాడు. అదీ స్పష్టంగా కాదు. వట్టినే అల్లా అనిపించి వుంటుందనుకున్నాడు కూడాను. కళ్లను మంచు పొరలా కప్పేసింది భయం. ఆ భయంతో టే పరుగెత్తేడు ముందుకు. పరుగెత్తడంలో దారి తెలియదు. బాహ్య పరి జ్ఞానం లేదు. ఒకటే పరుగు.

ఆ ఖాళీ పుంత దాటేసేడు. పుంతకు అవతల చెట్ల గుంపులో కలిసిపోయేడు. వెనుకనుంచి ఇంకా అరుపులు వినిపిస్తూనే వున్నాయి. డమడమలు వినిపిస్తూనే వున్నాయి. కొమ్మలమీదినుంచి ఏవో రాలిపడుతూన్నాయి వడగళ్ళలాగ.

ఆతడు పరుగెత్తుతూనే ఉన్నాడు. తరువాత నిశ్శబ్దం.

మంచులో మెడ విరిగి పడిపోయిన అడవి కోడి కొట్టు కుంటూంది. పక్కనుంచే పరుగెత్తుతున్న బేంబి అడుగుల చప్పుడు విని "చంపేశాడు" అంది నీరసంగా.

దాని కేసి చూడకుండానే బేంబి పరుగెత్తు తున్నాడు. దారిలో అడ్డంగా చెట్ల కొమ్మలు పడివున్నాయి. వేగం తగ్గించవలసి వచ్చింది.

"బేంబీ!" అని ఇంతలో ఒక కేక!

అతడు చటుక్కున ఆగేడు. తనవాళ్ళ గొంతుకలాగే ఉంది.

మళ్ళీ వినిపించింది — "బేంబీ!" అని.

దారిపక్కన మంచులో గోబో పడివున్నాడు. పరుగెత్తడం మాట దేవు డెరుగు, లేచి కాళ్ళమీద నిలుచునే ఓపిక కూడా లేదు. పూర్తిగా అలిసిపోయాడు.

బేంబికి జాలేసింది. దగ్గరగా వచ్చేడు.

"మీ అమ్మేది? ఫలీనా ఏది?" అని తొందర తొందరగా అడిగేడు. భయం, ఆందోళన అతన్ని ఇంకా విడిచిపెట్టనే లేదు.

"వాళ్లిద్దరూ ముందుకు పరుగెత్తుకు పోయేరు. నేను పడిపోయా నిక్కడ. ఇంక ఒక్క అడుగు వెయ్యలేను. నువ్వు వెళ్లిపో!" అన్నాడు గోబో, నెమ్మదిగా, అనుభవజ్ఞుడిలా.

బేంబి అతన్ని ప్రోత్సహించడానికి ప్రయత్నించేడు.

"లేచి నిలబడవోయ్! చాల్లే ఈ విశ్రాంతి. లే.

పారిపోదాం."

గోబ్లో తల అడ్డంగా తిప్పేడు.

"లాభం లేదు. నేను లేవలేను. నన్ను వదిలెయ్యి నీతో రావడం ఇష్టమే. కాని, రాలేను."

"ఇక్కడే వుంటే ఏమవుతావు?"

"తెలియదు. చచ్చిపోతే చచ్చిపోవచ్చు."

అంతలో మళ్ళీ వురుములు, అరుపులు. వెనుకనుంచి ఎవరో పరుగెత్తుకు వస్తున్నారు. బేంబి వెనక్కి తిరిగి చూశాడు.

కారో వస్తూనే బేంబిని హెచ్చరించాడు.

"పరుగెత్తు. ఆగకు" అంటూనే అతడు పరుగెత్తుకు పోయాడు.

అతని వేగం చూస్తూంటే బేంబికి కూడా హుషారు కలిగింది. అనుకోకుండానే అతని కాళ్లు పరుగెత్తేయి. కొంత దూరం వెళ్ళేక జ్ఞాపకం వచ్చింది. కాలు నిలుపకుండానే తల మాత్రం వెనక్కి తిప్పి కేకేశాడు.

"వెళ్ళిపోతున్నా, గోబ్లో!"

అయితే అప్పటికే గోబ్లో చాలా దూరాన ఉన్నాడు. ఆ కేక వినపడి వుండదు.

సాయంకాలందాకా వురుములు చప్పుళ్ళతో అడవి అంతా అదిరిపోతూనే వుంది. చీకటి పడ్డాక క్రమంగా అంతా చల్లబడింది. చల్లని గాలి అసహ్యాకరమైన నర వాసనను అడవిలోంచి బయటికి నెట్టేసింది.

భేంబి ఆ రోజున మొట్టమొదటగా రోనోను చూశాడు.

అతడు మామూలుకన్న ఎక్కువగా కుంటుతున్నాడు.

"ఇప్పుడే దారిలో మద్దిచెట్టుకింద నక్కబావ కనిపించాడు. ఇంకెంతోసేపు బతకడు. ఆయనను చూస్తే అబ్బా!" అని ఊసుకున్నాడు రోనో.

బేంబికి ఇప్పుడు వాళ్ల అమ్మ జ్ఞాపకం వచ్చింది.

"మా అమ్మని చూశారా ఎక్కడేనా?"

"లేదే!" అంటూ రోనో అక్కడినుంచి వెళ్లిపోయేడు.

రాత్రి బాగా పొద్దుపోయాక నవీన పిన్ని, ఫలీనా కనిపించేరు. వాళ్ళని చూసేసరికి బేంబికి ప్రాణం లేచి వచ్చింది.

"మీకు మా అమ్మ కనిపించిందా?"

"లేదే" అంది ఫలీనా. "మా అమ్మ సంగతీ తెలియడం లేదు."

నవీన పిన్ని నవ్వింది.

"ఇహ నాకు పిల్లలతో పనిలేదులే అనుకున్నాను. వున్నట్లుండి ఇద్దరు పిల్లలు నా మెడకి తగిలేరు."

సంభాషణ గోబో వైపుకి మళ్లింది. తా నెరిగినదంతా బేంబి చెప్పేడు. అంతా చాలా విచారించారు. పిల్ల లిద్దరికీ కళ్ళ నీళ్ళు తిరిగేయి. కాని నవీనా వాళ్ళ కా అవకాశం ఇవ్వలేదు.

"ముందర తిండి సంగతి చూసుకోవాలి. నడవండి. ఈవేళ రోజంతా ఒక్క గడ్డిపరక ముట్టుకోలేదు."

నవీన పిన్ని పిల్ల లిద్దరినీ పొదలవైపు తీసుకెళ్ళింది. అక్కడా అక్కడా ఒకటీ అరా సగం ఎండిన ఆకులు పొదలని

కనిపిస్తున్నాయి. నవీనా తానేమీ తినకుండా, పిల్ల లిద్దరికీ వదిలింది. అక్కడినుంచి ఇంకో చోటికి తీసుకువెళ్ళి కాలి గిట్టలతో మంచు అటూ ఇటూ తోసేసి, కిందనున్న గడ్డి చూపించింది.

"రండి, ఇల్లా. గడ్డి ఇక్కడ బాగుంది."

వాళ్ళు తిండి తింటూంటే నవీన ఆప్యాయంగా చూస్తూ గొణుక్కుంది.

"పరాయి పిల్లలు! అయితేనేం, పిల్లలు... ఎల్లా బతుకు తారో ఏమిటో..."

ఇంతలో ఏణి పొదలచాటునుంచి అక్కడికి వచ్చింది.

ఫలీనా సంతోషంతో ఎగిరి గంతేసింది.

"అమ్మా!" అంటూ దగ్గరకు వెళ్ళి మెడను రాసుకుంది.

"పిన్నీ!" అంటూ దగ్గరగా వచ్చాడు, బేంబి.

అతణ్ణి చూసి ఏణి ఏడుపు మొదలు పెట్టింది.

"గోబో ఏమైపోయాడో తెలియడం లేదోయ్! ఇందాకా చూసిన చోట అంతా వెతికి వచ్చాను. చిట్టి బాబు లేడు."

నవీన ఆమెను ఊరుకోబెట్టింది.

"గోబో కాలి అడుగులు ఎటు ఉన్నాయో చూడక పోయావూ?"

"అక్కడ మా నాయన అడుగులు లేనేలేవు. చుట్టూరా అంతా మనిషి అడుగులే" అంది ఏణి.

కొంతసేపు అందరూ మౌనంగా ఊరుకున్నారు.

"ఏణి పిన్నీ! మా అమ్మ కనిపించిందా?" అని బేంబి ఏడుపు ముఖం పెట్టేడు.

"లేదు" అంది నెమ్మదిగా, ఏణి.

అంతే. అటు తరువాత బేంబికి వాళ్ళ అమ్మ మరి కనిపించలేదు.

♦ ♦ ♦

కొన్నాళ్ళు గడిచేయి.

అప్పుడే చెట్లనిండా దట్టంగా పచ్చని ఆకులు పెట్టుకు వచ్చేయి. నేలనిండా గడ్డిపరుపు ఏర్పడింది. అప్పుడే కళ్ళు తెరుస్తున్న లేలేత చిగుళ్ళు సూర్యుణ్ణి చూసి నును సిగ్గులు పోతున్నాయి. పొదలనిండా పువ్వులు. తెలతెలవారే వేళల లేత ఎండలో విప్పారిన పువ్వులు నిద్రలో పసిపాపల బోసి నవ్వుల్లా ఆహ్లాదకరంగా ఉన్నాయి.





బేంబి తలమీద కిరీటంకొత్తగా వచ్చింది. అతడు బాదం చెట్లకింద నిలబడి, ఆ కిరీటానికి పదును పెట్టు కుంటున్నాడు. దాన్ని అలా చెట్ల కేసి రాయడంలో ఎంతో సుఖం కలుగుతూంది. పైగా అది అవసరం కూడాను. కొమ్ముల కిరీటంమీద నూనూగుచర్మంఉంటుంది. ఆచర్మం దినం తట అదే రాలిపోతుంది, మరి కొన్నాళ్ళుపోతే. అయితే శుభ్రంగా, అందంగా ఉండాలను కున్న యువరాజాలు తమకు తామే కొమ్ములను బాగు చేసుకోవడం మంచిది. బేంబిపట్టుదలతో కొమ్ము లకు పదును పెడుతున్నాడు. వాటిపై నున్న వికారమైన నూనూగుచర్మం ఊడివచ్చి చెవులమీదికి వేళ్లాడింది.

కొమ్ములతో బాదం చెట్టును రాసుకోవడంలో బేంబికి ఒక కొత్తసంగతి తెలిసింది. ఆచెట్టు కన్న తన కొమ్ములే గట్టివి. ఆ సంగతి తెలిశాక అతనిలో కొత్తగర్వం, బలం ఉప్పొంగేయి. బేంబికొమ్ముల రాపిడికి ఆ చెట్టుమీద బెరడు చాలా చోట్ల ఊడివచ్చింది. ఆ చెట్టుకు తెల్లని గాయాలయాయి. కొద్దిసేపట్లోనే ఆ గాయాలు గాలి

తగిలి ఎర్రబడ్డాయి. వాటిని చూసి బేంబికి చెట్టుమీద జాలి వెయ్యలేదు. పైగా ఉత్సాహం కలిగింది. మరింత వేగంతో కొమ్ములకు పదును పెట్టుకున్నాడు. కొద్ది సేపట్లోనే చుట్టుపక్కల ఉన్న బాదంచెట్లు అన్నింటినిండా గాయాలే.

"ఇంకొంచెం పదునుపెడితే కొమ్ములు బహు పసందుగా తయారవుతాయి!" అని చెట్టుమీది నుంచి ఎవరిదో కంఠం వినిపించింది.

బేంబి తల పైకెత్తి చూశాడు. కొమ్మమీద ఉడత కిచకిచలాడుతూంది.

"హే. హహ్హహ్హహ్హ...!"

ఎవరిదో కొత్త కంఠం మరో కొమ్మను వినిపించింది. అది వడ్రంగి పిట్ట అని వారిద్దరికీ తెలుసును. కనక కంగారు పడలేదు.

"ఏమీ అనుకోకండి. నాకు నవ్వు ఆగలేదు" అంది వడ్రంగి పిట్ట.

"ఏమిటో అంత నవ్వు కలిగించింది?" అన్నాడు బేంబి, సగౌరవంగా.

"తమకి సరిగ్గా చేతకాలేదు. అసలు బాదం చెట్టుని పొడిస్తే లాభంలేదు. దళసరిపాటి బెరడున్న చెట్టు వెతుక్కోవాలి ముందర. బెరడు పలచగా ఉంటే అవి అసలు ఉండనే ఉండవు" అంది వడ్రంగి పిట్ట.

"మీరేమంటున్నారో నాకు తెలియడంలేదు. ఏమిటి ఉండనివి?" బేంబి ప్రశ్నించాడు.

"అవే. పురుగులు! ఇంకేం ఉంటాయి?" అని మళ్ళీ

నవ్వింది.

"చూడండి, ఎల్లా చెయ్యాలో చూపిస్తా" అని తన పొడుగుపాటి ముక్కుతో చిట్లిఉన్న బెరడు సందుల్లో పొడి చింది. టక్...టక్...టక్!

ఉడత కీచుమని పకపకా నవ్వింది. తాను కూర్చున్న కొమ్మమీదినుంచి వడ్రంగి పిట్టకు దగ్గరగాఉన్న మరో కొమ్మమీదికి ఉరికింది.

"ఏమిటి ఊరికే వాగుతావు? యువరాజా వారికి నీ పురుగులతో పనేమిటి?"

వడ్రంగి పిట్టకు ఆశ్చర్యం వేసింది.

"ఏం? అవి చాలా రుచిగా ఉంటాయే!" అని ముక్కుతో ఒక పురుగును పొడిచి గుటుక్కున మింగేసింది.

ఉడత అవహేళన, చిరాకు కనబరిచింది.

"నీకేమీ తెలియదు. ఈ యువరాజావారి పద్ధతి అంతా వేరు. వారివి పెద్ద ఊహాలూ, పెద్ద ఆశయాలూను. నీ పురుగులూ, నువ్వూ — నీదో లోకం."

"సింగినాదం! పెద్ద పెద్ద ఆశయాలంటే నాకు మహా మంట" అని ఎగిరిపోయింది, వడ్రంగి పిట్ట కోపంతో.

ఉడత పై కొమ్మనుంచి కిందికి దిగి, బేంబి దగ్గరకు వచ్చింది.

"మీరు నన్ను గుర్తు పట్టేరా?"

"ఎరక్కేం? మీరు ఆ పైకొమ్మమీద ఉంటారు కదూ?" అంటూ బేంబి తల తిప్పి మద్ది చెట్టువైపు చూపించాడు.

ఉడతకి హుషా రెక్కువైంది.

"మీరు నన్ను చూసి మా అమ్మమ్మ అనుకుంటు న్నారులా ఉంది. నేను ముందరే అనుకున్నా. తప్పకుండా మీరు అల్లాగే అనుకుంటారని. ఆ మద్దిచెట్టు తొర్రలో ఆవిడ మిమ్మల్ని గురించి చాలా చెప్పేది. ఓరోజుని వెంట్రుక ఒకటి ఆవిడ నడ్డి చీరి చంపేసింది. అబ్బో! అది జరిగి ఎంత కాలమైపోయిందో! బహుశా మీకు జ్ఞాపకం ఉండి వుండదు..."

బేంబి తల ఆడించేడు.

"ఔను. ఎవరో చెప్తూండగా విన్న జ్ఞాపకం వుంది."

"అటు తరువాత మా నాన్న ఆ మద్దిచెట్టు వదిలేసి, ఈ ప్రాంతానికి వలస వచ్చేశాడు."

ఉడత కళ్లు పెద్దవిచేసి, ముందరి చేతులు గుండెలకు నొక్కుకుంది.

"మీరు నన్ను చూసి మా నాన్న అనుకోవడంలేదు కదా! అన్నట్లు మీరు మా నాన్న నెరుగుదురా?"

"ఆయన పరిచయ భాగ్యం నాకు లేకపోయిందనడానికి విచారిస్తున్నాను" అన్నాడు బేంబి.

"కావచ్చు. అందులో ఏమీ ఆశ్చర్యం లేదు. ఆయన వట్టి భయస్తుడు. ఎవ్వరితోటీ పరిచయాలు పెట్టుకోకుండా ఎప్పుడూ గూటి నంటిపెట్టుకునే వుండేవాడు."

"వారు ఇప్పుడు ఎక్కడ వున్నారూ?"

"ఏంచెప్పనూ? నెల్లాళ్ల కిందట గూబ ఆయన్ని హాడి చేసింది. ఆ ఘోరం జరిగిపోయాక ఇంక అక్కడ ఉండలేక

పోయాను. ఆ చెట్టుకూడా విడిచిపెట్టేసి ఇక్కడికి వచ్చాను. అప్పటినుంచీ ఇక్కడే ఉంటున్నాను."

ఆ దుర్వార్తకు విచారం తెలియబరిచి, బేంబి ముందుకు కదిలేడు. ఉడత దారికి అడ్డం వచ్చింది.

"ఉండండి, ఉండండి! ఏమిటలా వెళ్లిపోతున్నారు? మీతో ఏదో మాట్లాడాలనుకుంటూనే ఇంకో ధోరణిలో పడిపోయాను."

"ఏమిటి? చెప్పండి" అన్నాడు సగౌరవంగా బేంబి.

చెప్పాలనుకున్నదేదో ఉడత మరిచిపోయింది. ఆలోచనలో పడింది.

"అన్నట్లు ఏదో చెప్దామనుకున్నాను."

చటుక్కున ఎగిరి చెట్టెక్కింది. కొమ్మలమీద గిర్రున తిరిగి, మళ్లీ కిందికి వచ్చింది. చక్కని కుచ్చుతోక ఆడిస్తూ కూర్చుంది.

"ఆఁ. జ్ఞాపకం వచ్చింది. తమ కిరీటం చాలా అందంగా ఉంది. ఆమాటే చెప్దామనుకొన్నాను."

బేంబి చాలా సంతోషించేడు.

"నిజంగానా?"

"ఇంకా మెల్లిగా అంటున్నారూ?" అంటూ ముందరి చేతులు గుండెల కదుముకుంది ఉడత.

"ఓహోహో! ఏమి అందం! ఏమి చిలవలు! ఏమి పలవలు! ఇటువంటి కిరీటాలు బహు అరుదుగా కనిపిస్తాయి."

"నిజంగానా?" అన్నాడు బేంబి.

అతనికి హుషారు అధికమైంది. ఆ హుషారులో

ఒక్క ఉరుకు ఉరికి బాదం చెట్టును ఢీకొన్నాడు. కొమ్ముల తాకిడికి చీరుకుపోయి పై పట్ట రేకులు రేకులుగా ఊడి వచ్చింది.

"మీా జాతిలో ఇంత అందమైన కిరీటం మరెవ్వళ్ళకీ లేదు, ఒక్క ముసలి నాయకుడికి తప్ప. కిందటి వేసవిలో మిమ్మల్ని చూాచినవాళ్లు ఎవ్వరూ ఇప్పుడు గుర్తే పట్టలేరు. ఆ పసికూనే నా ఈ యువరాజు అనిపిస్తుంది. ఈ కిరీటం..."

మాాట మధ్యలోనే "ఇంక వస్తా..." అని బేంబి ముందుకు పరుగెత్తేడు.

క్రిందటి ఏడాది సంగతు లేమీా బేంబి జ్ఞాపకం చేసుకోడు. అతని జీవితం అంతలోకీ చాలా కష్టాలు పడ్డది ఆ ఏడాదే.

అమ్మ కనిపించకుండా పోయాక బేంబి చాలా ఇబ్బందులు పడ్డాడు. 'ఎందుకొచ్చిన బతుకు?' అనిపించేది. ఆ ఏడాది శీతాకాలం మరీ బాధ అనిపించింది. రోజులు జరిగేది కాదు. కొంకరించుకుపోయే చలి. తినడానికి ఏమీా ఉండేది కాదు. ఆకలి. ఇంక వసంతం అనేది రానే రాదేమో అవేపించింది. నవీన పిన్ని కనక లేకపోతే బేంబి ఆ శీతాకాలంలో బతికి బయటపడేవాడే కాదు. అతడి బాధ్యత అంతా ఆవిడ తనమీాదే వేసుకుంది. తాను చేయగలిగినదంతా చేసింది. అయినా బేంబిని ఏదో ఒంటరితనం బాధించేది. తరుచు గోబో జ్ఞాపకం వచ్చేవాడు. మిగిలిన అడవి జంతువు లన్నింటికీ లాగా అతడికి బాధలు లేవు కాబోలు. తన చిన్నప్పటి గోబో ఎంత మంచివాడో, అతనిది ఎంత ఉదాత్తమైన హృదయమో

అనుకుని బేంబి గోబో మరణానికి నిట్టూర్పులు విడిచేవాడు.

ఫలీనా అప్పుడప్పుడు కనిపించేది. సిగ్గుతో ఆమె ఎప్పుడూ వాళ్ళ అమ్మ వెనకాలే ఉండేది.

వసంతం ప్రవేశించి, గాలిలో కొత్త వెచ్చదనం కనిపించేక బేంబికి ధైర్యం వచ్చింది. అప్పుడప్పుడే కిరీటం కూడా వచ్చిందేమో దానిని చెట్ల మొదళ్ళకేసి రాసి శుభ్ర పరుచుకుని ఎంతో గర్వపడేవాడు. కిరీటం వచ్చేక మరో కొత్తపేచీ వచ్చింది.

కిరీటాలున్న మిగిలిన లేళ్లు బేంబిని ఎందుకో అస హ్యించుకునేవారు. కనిపిస్తే చాలు, తరిమివేసేవారు. తన మీద వాళ్ళకు అంత అక్కసు ఎందుకో అర్థంకాదు. వాళ్ళ క్రౌర్యం చూసి అత డెంతో భయపడిపోయాడు. వాళ్ళతో దెబ్బలాట పెట్టుకోడానికి ధైర్యం లేదు. అందుచేత ఎవ్వరూ నడవని దారులలో ఒంటరిగా, విచారంగా, మౌనంగా తిరు గుతూ ఉండేవాడు.

చక్కగా ఎండ కాస్తున్న రోజున అతని హృదయం ఏదోలా ఉండేది. ఏదో బాధ. ఆవేదన. అలజడి. ఫలీనాను కానీ, ఆమె స్నేహితురాళ్ళను కానీ చూస్తే చెప్పలేనంత సంతోషం కలిగేది. వారివైపే ఆకర్షించబడేవాడు. వాళ్ళు దగ్గరలో ఉన్నట్లు వాసన తెలిసినా, వాళ్ళ కాలి గుర్తులు చూసినా అదే భావం కలిగేది బేంబికి. మనస్సు మరీ బాగుండకపోతే వాళ్ళకోసం వెతుక్కుంటూ బయలుదేరే వాడు. ఒకొక్కప్పుడు వాళ్ళు కనిపించేవారు కాదు. అల్లాం టప్పుడు మరీ దిగులనిపించేది. ఏదో పోగొట్టుకున్నట్లు అడ

విలో ఒంటరిగా తిరుగుతూ ఉండేవాడు.

అదృష్టం బాగుండకపోతే తమ జాతి కిరీటధారులు ఎదురుపడేవారు. వాళ్ళు బేంబిని చూస్తేచాలు గుర్రుమనే వారు. పరుగెత్తుకువచ్చి, కింద పడతోసేవారు. పడతోసి దొర్లించేవారు. కొట్టేవారు. కాళ్ళతో తన్నేవారు. రక రకాలుగా బాధ పెట్టేవారు. తరిమేవారు. రోనో, కారోలు కూడా అల్లాగే చెయ్యడం బేంబికి మరీ బాధగా ఉండేది. అసలు అందరికన్నా ఎక్కువగావాళ్ళే బేంబిని హింసించేవారు.

అటువంటి చెడ్డ రోజులను ఉడత ఎందుకు జ్ఞాపకం చెయ్యాలి ? ఆ అవమానాలన్నీ మళ్ళీ జ్ఞాపకం చెయ్యడం ఎందుకు ? అందుకే బేంబికి విసుగేసింది. ఆ మాటలు వినడం ఇష్టంలేక ముందుకు సాగిపోయాడు.

బేంబి వెడుతున్న దారిలో గిజిగాళ్ళూ, తేనె పిట్టలూ భయపడి పొదలలోనుంచి పైకెగిరేయి. ఆశ్చర్యంతో గుస గుసలాడేయి.

"ఎవరీయన ?"

గోరింక కంగారుగా అరిచింది : "ఎవరు ? ఎవరు ?"

బేంబి వాటిని లెక్క చేయలేదు.

కోకిలమ్మ పాట పాడింది.

"కుహూ కుహూ యువరాజా !

కుశలంగా ఉన్నావా ?"

ఆ పాటనూ చెవిని పెట్టలేదు బేంబి.

చుట్టుపక్కల అడవి అంతా సూర్యకాంతితో ధగధగ లాడుతూంది. బేంబి దానినీ గమనించడంలేదు.

పరాగ్గా నడుస్తున్న బేంబి కాళ్ళకింద ఏదో కదులాడింది. చటుక్కున రెక్కలాడించి రంగు రంగుల కంఠం తిప్పుకుంటూ అడవి కోడి పైకెగిరింది. మరి కాస్త ఉంటే బేంబి కాలు దాని నడ్డిమీది పడిపోయేదే. దానికి భయం, కోపం ముంచుకు వచ్చాయి.

"కాస్త చూసుకు నడిస్తే ఏం పోయిందీ!"

బేంబి నొచ్చుకున్నాడు.

అతని పక్కనుంచే మరో కంఠం వినిపించింది. "పెద్దలు మీరేం చేసినా చెల్లుతుంది. మధ్యలో మాకే ఇబ్బందు లన్నీనూ."

అది అడవికోడి పెళ్లాం. ఆమె ఇంకా నస వదలలేదు.

"మావారు ఎంత జడుసుకున్నారో! నేనుమాత్రం? అయితే లేవడానికి వల్లకాదాయిరి నాకు. ఇల్లాంటప్పుడు ఎవళ్లైనా కంగారు పడతారు. ఇంకా నయం, ఆ అడుగు నా నడ్డిమీద పడింది కాదు!"

బేంబి సిగ్గు పడిపోయాడు.

"క్షమించండి. నేను చెయ్యాలని చెయ్యలేదు."

అడవికోడి పెళ్ళాం కొంచెం నెమ్మదించింది.

"దానికేముంది లెండి. మీరుమాత్రం చూసి చేశా రన్నామా? నాకూ, మావారికీ కూడా బేలగుండె. కాస్త ఎటో మువ్వ వస్తే అదిరిపోతాం. మీరు మాత్రం ఎరగరూ?"

బేంబికి అదేమీ తెలియదు. అతడు ముందుకు నడిచేడు.

చుట్టూ అడవి అంతా బహు హుషారుగా ఉంది.

పిట్టలు కూనిరాగాలు తీస్తున్నాయి. చక్కని ఎండ కాస్తూంది. చెట్లు, పొదలు కలకలలాడుతున్నాయి. నేలమీదినుంచి ఏవేవో తియ్యని వాసనలు వస్తున్నాయి.

బేంబికి పడుచుదనపు అతిశయం ఒళ్ళంత పాకింది. దర్జాగా, దృఢంగా అడుగులేస్తూ ముందుకు నడిచేడు.

దేవదారు తోపుదగ్గరకు వచ్చేక కాళ్ళతో నేల దున్నడం మొదలుపెట్టేడు. కాలి గిట్టలు చీలి సన్నంగా పదునుగా ఉన్నాయి. వాటి తాకిడికి గడ్డిగాదం మట్టితో సహా లేచిపోయి, వానజల్లులా పక్కలకు పడింది.

ఆ పక్కనే కన్నాలు తవ్వుతున్న రెండు ఎలుకలు ఆశ్చర్యంగా బేంబివంక చూశాయి.

"ఇదెక్కడి కన్నాలు తవ్వడం? ఎక్కడా చూడలేదు" అంది ఆడ ఎలుక మగనితో. బియ్యపు గింజల్లాంటి తెల్లని పళ్ళు కనిపించేలా నవ్వింది మగ ఎలుక.

"అతగాడికి ఏం చేతనవును? చేతకాని పనుల్లో చెయ్యి పెడితే ఇల్లాగే అవుతుంది."

అంతలో ఉన్నట్లుండి బేంబి తల ఎత్తేడు. చెవులు నిటారుగా రిక్కించాడు. చురుగ్గా చూశాడు. అవతల పొదలవెనుక ఎవరో ఎర్రగా కనబడ్డారు. కిరీటపు కొనలు ఎండలో తళుక్కు మన్నాయి. వాసన చూశాడు.

"ఎవరు నన్ను వెంటాడుతున్నారూ? రోనో కాబోలు. లేక కారో కావచ్చు. ఇంకెవరుంటారూ? తప్పుకుంటూన్న కొద్దీ వీళ్ళ పని మహా ఇదిగా ఉంది. ఒక్కమాటు నా తడాఖా చూపిస్తే..."అనుకుంటూ బేంబి విసురుగా ముందుకు

దూకేడు.

పొదలు గరగరలాడేయి. ఎండు కొమ్మలు పెళపెళ మన్నాయి, బేంబి కాళ్ళకిందపడి. రెండు అంగలలో అతడు శత్రువు దగ్గరకు వచ్చేశాడు. అతడు ఎవరో బేంబి చూడనే లేదు. 'చూడవలసిన అవసరం ఏముందీ! ఒక్కసారి బుద్ధి చెప్పాలి. మళ్ళీ నా దరిమానానికి కూడా రాకుండా డొక్క చీరెయ్యాలి.'

బేంబి తల భాగానంచేడు. కొమ్ములు ఎదుటికి బల్లెములలా జాపేడు. బలమంతా మెడలో పోగుచేశాడు. క్షణంలో అతడు కుమ్ములాటకు సిద్ధం అయాడు.

శత్రువు బొచ్చు వాసన తగులుతూంది. అతగాడికి పొట్టకు కాపులేదు. ఇదే సమయం. ఒక్క ఊపులో వచ్చాడు.

శత్రువు కొంచెం పక్కకు తప్పుకున్నాడు. బేంబి ఆ విసురులో ముందుకు దూసుకు పోయాడు. శత్రువుకు దెబ్బ తగలలేదు.

ఈమారు మహా కోపం వచ్చింది. గిరుక్కున తిరిగి చూశాడు. ఆ శత్రువు ఎవరో కాదు. ముసలి నాయకుడు!

బేంబి గ్రామ్నపడిపోయాడు. మహాపరాధం జరిగిపోయి నట్లు సిగ్గుపడ్డాడు. తల వంచుకుని, కాలి గిట్టలతో నేల రాస్తూ నిలబడ్డాడు.

"ఊరుకున్నావేం?" అని శాంతంగా అన్నాడు, నాయకుడు.

ఆయన ప్రశాంత గంభీరమైన కంఠం ఎప్పటిమావెరి

గానే రాజరికపు దర్పంతో వినిపించింది. బేంబి హృదయం పట్టేసినట్లైంది.

"ఏం, ఆగావేం?" అన్నాడు, మరోసారి నాయకుడు.

బేంబి అస్పష్టంగా గొణుగుతూ తల వంచుకున్నాడు.

"రానో అనుకున్నాను."

నాయకుడు పర్వతంలా అచలంగా నిలబడి ఉన్నాడు. తల నెరిసినా, నల్లని గంభీరమైన కళ్ళు మిలమిల్లాడుతున్నాయి.

"ఏం, నాతో అయితే తలపడవా? ఎందుకనీ?"

బేంబి తలఎత్తి ముసలి నాయకునివంక చూశాడు. భక్తి, భయం, గౌరవం, ప్రేమ ఎన్నెన్నో, ఏవేవో భావాలు అతని మనస్సులో సుడులు తిరిగేయి.

"మీరంటే నాకు చాలా ఇష్టం" అని చెప్పాలనుకున్నాడు. నాలుక తడబడింది.

"నాకు తెలియదు" అని మాత్రమే అనగలిగేడు.

నాయకుడు బేంబిని చూపులతోనే తడివిచూశాడు.

"నిన్ను చూసి చాలాకాలమైంది. చాల పెద్దవాడివయ్యావు."

బేంబి ఏమీ అనలేదు. అతని సంతోషానికి అవధులు లేవు.

నాయకుడు బేంబిని ఇంకా పరీక్షగా చూశాడు. చూసి దగ్గరగా వచ్చాడు.

"ధైర్యవంతుడివి కావాలి" అంటూ గిరుక్కున తిరిగి క్షణంలో అదృశ్యమైపోయాడు. బేంబి చాలాసేపటివరకూ

అక్కడే నిలుచుండిపోయాడు.

వేసవి వచ్చింది. ఇంతవరకూ సన్న సన్నగా అప్పు డప్పుడు అనుభూతమైన ఆందోళన బెంబేని పూర్తిగా అవ శ్యక్తి చేసింది. అతని రక్తం చీమలు తొక్కింది. శరీ రాన్ని గుంజేసింది. విధి విరామం లేకుండా తెలియని దేనికోసమో ఓ దారీ తెన్నూ లేకుండా ఆ అడవిలో తిరిగేడు.

ఒక రోజున ఫలీనా కనిపించింది. అనుకోకుండా కనిపించిందేమో ఎంతో సంతోషం కలిగింది. ఏదో తెలి యని చిత్రమైన దిగులు గుండెలను అదిమేస్తూ ఉండగా ఆమె ఎదురుగా నిలబడ్డాడు.

"ఫలీనా! నువ్వెంత అందగత్తె వయావు!" అన్నాడు ఆశ్చర్యంగా.

"మొత్తానికి గుర్తుపట్టేవన్నమాట" అంది ఫలీనా.

"గుర్తు పట్టడం? చిన్నతనంలో ఒక్కచోట కలిసి మెలిసి ఉన్నాంకదూ?"

ఫలీనా నిట్టూర్చింది.

"మనం కలుసుకుని ఎన్నాళ్ళయిపోయిందో! బొత్తిగా పరాయివాళ్ళలా అయిపోయాం" అంది ఫలీనా.

ఆమె గొంతులో వెనకటి స్నేహం, ఆప్యాయతా విని పించాయి.

ఇద్దరూ దగ్గర దగ్గరగా నిలుచున్నారు.

"ఇదిగో, ఈదారి వెంట మనం చాలాసార్లు వెళ్ళేం. జ్ఞాపకం ఉందా? అప్పటికి మనం బాగా చిన్నవాళ్ళం"



"నువ్వెంత అందకత్తె వయావు?"

(పుట 133)

అన్నాడు బేంబి.

"అవును. దీని వెంబడిపోతే మైదానం వస్తుంది."

" మైదానంలోనే మనం మొట్టమొదటి సారి కలుసుకున్నాం. గుర్తుందా?"

"అవును. నేనూ, గోబో నిన్ను చూశాం" అంటూ గోబో గుర్తురాగా నిట్టూర్చింది ఫలీనా.

బేంబికూడా దీర్ఘంగా నిట్టూర్చాడు. ఇద్దరూ చిన్ననాటి సంగతులు ఒక్కొక్కటిగా గుర్తుకు తెచ్చుకున్నారు.

"నీ కిది గుర్తుందా?"

"నీ కది జ్ఞాపకం ఉందా?"

ఇద్దరికీ అన్ని సంగతులూ బాగానే గుర్తున్నట్లున్నాయి. ఆ జ్ఞాపకాలు వాళ్ళకు ఎంతో సంతోషం కలిగించాయి.

"ఆ మైదానంలో మనం తూతుమ్మొండ ఆడుకునే వాళ్ళం."

"మరే, మరే" అంటూ ఫలీనా మెరుపులా పక్కకు గంతువేసింది.

బేంబి మొదట్లో విస్తుపోయాడు. మరుక్షణంలోనే సంతోషంతో అరిచేడు.

"ఆగు. క్షణం నిలబడు."

"ఊఁహుఁ నే నాగను. నాకు చాలా తొందర పని ఉంది" అని చిలిపిగా అనుస్తూ ఫలీనా పొదలమీదుగా బహు సున్నితంగా ఎగిరి గంతువేసింది. గడ్డిలో గిరికీలు చుట్టింది.

బేంబి ఆమె వెంటపడ్డాడు. ఒక్క పరుగులో ఆమెను దాటిపోయి, దారి కడ్డంగా, ఎదురుగా నిలబడ్డాడు.

మళ్ళీ ఇద్దరూ దగ్గరగా నిలబడి ఏవేవో కబుర్లు చెప్పు కున్నారు. నవ్వుకున్నారు. వాళ్ళ సంతోషం అంతా ఇంతా కాదు.

కబుర్లు చెప్తూనే ఫలీనా అంత ఎత్తు ఎగిరి మైదానంలో అడ్డంగా పరుగెత్తింది. బేంబి ఆమె వెంట పడ్డాడు. అయితే ఆమె అంత సులభంగా దొరకలేదు. దొరికినట్లే దొరికి ఇట్లే జారిపోయింది.

"ఆగు. ఆగమంటూంటే! నీకోమాట చెప్పాలి" అని బేంబి బ్రతిమలాడేడు.

ఫలీనా ఆగింది.

"ఏమిటా మాట?"

బేంబి మౌనంగా ఊరుకున్నాడు.

"ఏంలేదు చెప్పడానికి అబ్బాయిగారికి" అని ఫలీనా ముందుకు పోబోయింది.

"ఆగు. కొంచెం ఆగు. చెప్తాను. నిన్ను ఒక్కటి అడగాలని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాను...నీకు...నీకు..." అని నీళ్లు నమిలేడు బేంబి.

"ఏమిటీ నీకు...?" అని ఫలీనా కనుబొమలు ముడిచింది.

"నీకు... నేనంటే ఇష్టమేనా?"

ఆమె ఆశ్చర్యంగా బేంబిని చూసింది. నల్లని చక్కని కళ్ళు నేలకు వాలిపోయాయి.

"నాకు తెలియదు."

"అబ్బ! తెలియకపోతే ఎల్లాగేమిటి? తెలియాలి.

నామట్టుకు నాకు నువ్వంటే చాలా ఇష్టం, మరి నీకు?"

"ఇష్టమేనేమో" అంది ఫలీనా సందిగ్ధంగా.

"మరి, ఎప్పుడూ నాతోనే ఉంటావా?"

"అడగవలసిన విధంగా అడుగుతే..." అని నవ్వింది ఫలీనా.

"ఫలీనా? నీమీది ప్రేమకు నా దగ్గర మాటలు లేవు. నువ్వంటే నాకు ఎంత ఇష్టమో! నువ్వు నాతోనే ఉండి పోవూ?" ఆ మాటలకామె సంతృప్తిపడింది. తల ఆడించి నేల చూపులు చూసింది.

బేంబి సంతోషంతో ఎగిరి గంతులేశాడు.

ఫలీనా ముందుకు నడుస్తూంటే ఆమెను రాసుకుంటూ పక్క పక్కనే బేంబి నడుస్తున్నాడు. అంతలో ఆమె పొదల మాటుకు తుమికింది. బేంబి ఆమె వెంట పడబోయాడు.

అంతలో పొదలు గలగలమన్నాయి. కారో కోపంగా ముందుకు వచ్చి, బేంబి దారికి అడ్డు నిలబడ్డాడు.

"ఆగు!"

ఫలీనా తోడిదే లోకంగాఉన్న బేంబి కారో వైపు సరిగ్గా చూడలేదు.

"దారిలో లే. నీతో వాదం పెట్టుకోడానికి తీరుబడి లేదు నాకు" అన్నాడు బేంబి నెమ్మదిగా.

కారో కోపంతో వణికిపోయాడు.

"ఎక్కడికి వెడతావ్? అడుగు వేశావంటే ఎముకలు విరగ్గొడతాం. ఫలీనాను చూడడానికికూడా వీల్లేదు. ఫో!"

బేంబిలో నిద్రాణమైవున్న క్రోధాగ్ని ఈ మాటలతో

ప్రజ్వలించింది. అసహ్యాం, కోపంతో అతడి పెదవులు అది రేయి. ఇంతకాలం నుంచి అన్యాయంగా, నిర్దయగా తనను పెట్టిన హింసలు, అవమానం కళ్ళముందు కనబడ్డాయి. బేంబి ఏమీ మాట్లాడలేదు. తల వంచేడు. ఒక్క ఊపులో కారోమీద పడ్డాడు. బలంకొద్దీ ఒక్కపోటు పొడిచేడు.

ఆ పోటుతో కారోకు దిమ్మతిరిగిపోయింది. అసలు ఏమైందో అర్థం అయేలోగానే నేలమీద వెల్లకిలా పడిపోయాడు. అంతలో సర్దుకుని లేచి నిలబడ్డాడు. సరిగ్గా లేచి నిలబడ్డాడో లేదో మొదటిదానికన్నా రెండో పోటు మరింత బలంగా తగిలింది. కారో చలికిలపడిపోయాడు. ఎంతో అసహాయత, భయం అతన్ని కుంగదీశాయి.

"బేంబీ!" అని అరిచాడు కారో.

బేంబి వినిపించుకునేలా లేడు. ఇంకోసారు పిలుస్తూండగానే మూడో పోటు తగిలింది. ఆ దెబ్బకు కళ్లు చీకట్లు కమ్మేయి. చూసేసరికి బేంబి మరోపోటు పొడవడానికి తయారీలో ఉన్నాడు. కారో ఇంక లాభం లేదనుకున్నాడు. ఒక్క దూకులో లేచి, పరుగు అందుకున్నాడు. బేంబి అతనివెంటపడ్డాడు. దొరికితే చంపేస్తాడనిపించింది. బలం కూడదీసుకుని దారి వదిలి, పొదలమీదుగా ఉరకలువేస్తూ కారో క్షణంలో అదృశ్యమైపోయాడు.

బేంబి చటుక్కున నిలబడిపోయాడు. చెవులు రిక్కించి విన్నాడు. గిరుక్కున వెనుదిరిగి ఫలీనా వైపు పరుగెత్తేడు. ఫలీనా, ఆమె వెనకాల రోనో కనిపించారు. బేంబికి మహా కోపం వచ్చింది.

"రోనో!"

రోనో ఆగేడు.

"నన్ను పిలుస్తున్నావా, ఏమైనా పనుందా?" అని ఏమీ ఎరగనట్లు అన్నాడు రోనో.

బేంబి కోపాన్ని అణుచుకుంటూ పళ్లు బిగపట్టేడు.

"ఫలీనాను వదిలిపెట్టి నువ్వు తక్షణం వెళ్లిపో."

"అబ్బ! పెద్ద కోరికే! పిట్ట కూతపట్టింది!" అన్నాడు రోనో హేళనగా.

బేంబి అతనికి నచ్చచెబుతున్నట్లు ఆచి ఆచి అన్నాడు:

"రోనో! నీ మంచికోసమే చెప్తున్నా. వెళ్లు. వెంటనే వెళ్లు. ఇంక తరువాత ఏమనుకున్నా..."

రోనోకు కోపం వచ్చింది.

"ఊరుకున్నాననా, మహా వాగుతున్నావు? లేక నా కాలు కుంటికదా అని నీ ఇష్టం వచ్చినట్లు వాగవచ్చు ననుకున్నావా? చేతకానివాడు కనుక కారో పారిపోయాడు. జాగ్రత్త! నా సలహా విని..."

"ఆ సలహా ఏదో నేనే ఇస్తున్నాను నీకు. వెళ్ళు. నీమీద నాకు మొదటినుంచీ గౌరవం. తెలివైనవాడివీ అనుభవం గలవాడివి. ఆఖరిసారి చెప్తున్నా. వెళ్ళిపో. నా సహనం తగ్గిపోతోంది."

రోనో వెక్కిరించాడు.

"పాపం! నీకు సహనం చాలా తక్కువ కాబోలు. మరీ ఇంత తక్కువైతే ఇబ్బంది సుమీ — నీ మంచికోసమే చెప్తున్నా. ఇదివరలో తిన్న తన్నులు మరిచిపోయినట్లు

న్నావు."

రోనో ఆ ఆఖరి మాట అనకుండా ఉంటే బాగుండేది. బేంబికి వెర్రికోపం వచ్చింది. తల వంచి మీదికి వచ్చాడు. రోనోకూడా ఎదురుకొన్నాడు.

బుర్రలు ఢీకొన్నాయి.

రోనో గట్టిగానే నిలబడ్డాడు. తన బలం ముందు బేంబి నిలబడలేడనుకున్న రోనోకు ఆశ్చర్యమే కలిగింది. అసలు బేంబి తనతో ఢీకొనడానికి ధైర్యం చేస్తాడని అతడు అనుకోనేలేదు. శత్రువు ధైర్యం అతనికి వింత అనిపించింది.

నవయౌవనంలో ఉన్నాడేమో బేంబిని సులభంగా కొట్టెయ్యలేనని భయపడ్డాడు రోనో. ఉపాయం ఉండాలి.

ఉన్నట్లుండి రోనో తల వెనక్కు తీసుకుని, పక్కకు తప్పుకున్నాడు. పట్టుతప్పి ఆ ఊపులో బేంబి కింద పడిపోతాడని అతని ఆలోచన. కాని, బేంబి ముందుకు పడిపోకుండా కాళ్ళు నిగడదన్ని నిలుచున్నాడు. అతడా ఎత్తును ముందే గ్రహించాడు కాబోలు. రెట్టించిన కోపంతో రోనోను ఈమారు సరాసరి ఢీకొన్నాడు. కటుక్కుమని చప్పుడు. రోనో కిరీటంలో ఒక ముక్క విరిగిపోయింది. నుదురే పగిలిపోయినట్లనిపించింది. రోనోకు కళ్ళు బైర్లు కమ్మాయి. మరుక్షణంలో మరోపోటు. ఈమాటు దెబ్బ బుజానికి తగిలింది. గుండెలు పట్టేశాయి. ఊపిరి అందలేదు. నేలమీద పడిపోయాడు. "ఆగు! ఆగు!" అని మూలుగుతున్నా బేంబి కళ్ళు మూసుకుని పిచ్చి కోపంతో మరోపోటు పొడిచాడు.

"బేంబి! ఆగు. నేను కుంటివాడినని తెలియదుటోయ్!

తమాషాకి ఓ చిన్నమాట అంటే అంత కోపం అయితే ఎల్లాగోయ్?" అన్నాడు రోనో.

బేంబి రొప్పుతూ నిలబడ్డాడు. మరోపోటు పొడిచే వాడే. నిగ్రహించుకుని పక్కకు తప్పుకున్నాడు.

రోనో కష్టపడి లేచాడు. కుంటుకుంటూ మెల్లిగా వెళ్ళిపోయాడు.

బేంబి ఫలీనాను వెతకడానికి పొదలవైపు నడిచేడు. నాలుగు అడుగులలోనే ఆమె ఎదురు వచ్చింది. ఇంతసేపూ ఆమె పొదల వెనుక నిలుచుని జరిగినదంతా చూస్తూనే ఉంది.

"నీ కెంత బలం! ధైర్యం! బలేగా యుద్ధం చేశావు!" అని మెచ్చుకుంది.

తరువాత మెల్లిగా బేంబి చెవిలో, "నువ్వంటే నాకు చాలా ఇష్టం" అంది.

ఇద్దరూ సంతోషంగా ఒకళ్ళ నొకళ్ళు రాసుకుంటూ అల్లా అల్లా అడవిలోకి వెళ్ళిపోయారు.

ఒకరోజున వాళ్ళిద్దరూ బేంబి ముసలినాయకుణ్ణి కలుసుకున్న చోటు వెతుక్కుంటూ బయలుదేరేరు.

అప్పటి కప్పుడే తా నెన్నోమార్లు నాయకుణ్ణి కలుసుకుని మాట్లాడేనని బేంబి ఫలీనాకు చెప్పేడు.

"ఏమో, ఎవరు చెప్పగలరు? అదృష్టం బాగుంటే ఆయన మళ్ళీ కనిపిస్తారేమో?" అన్నాడు బేంబి.

"నిజమే. నాకూ ఆయనతో మాట్లాడాలనే ఉంది" అంది ఫలీనా.

కాని, ఆమె మాట నిజం కాదు. బేంబిని సంతోష పెట్టడానికి అల్లా అందే గాని, ఆమెకు నాయకుడంటే మహా భయం.

తెలతెలవారుతూంది. చల్లని గాలిలో ఇద్దరూ హాయిగా నడుస్తున్నారు. దగ్గరలోనే పొదల వెనుక ఏదో చప్పుడైంది. ఇద్దరూ హడలిపోయారు. పొదల వెనుక నక్కి నక్కి చూశారు.

దగ్గరలోనే వాళ్ళ ఉత్తరదేశపు జ్ఞాతి — పెద్ద కణుజు — మెల్లగా నడుస్తూ కనిపించింది. తెల్లవారేముందు కనిపించీ కనిపించని వెలుగులో అది పెద్ద భూతంలాగ ఉంది.

ఫలీనా కంగారుపడి అరిచింది. బేంబికూడా భయపడ్డాడు. మామూలు ధోరణిలో తలవంచి కుమ్ములాటకు తయారయాడు. కానీ, అతి ప్రయత్నంమీద ఆ ఉద్దేశం



మార్చుకున్నాడు.

ఫలీనాకు ఒక్కటే భయం. ఒకటే గాభరా.

బేంబి ఆమెను బుజ్జగించాడు.

"ఏమయింది ? ఇప్పు డేమైందని ? అతడు మనకి అపకారం ఏమీ చెయ్యడు."

కానీ, ఫలీనా అరుస్తూనే ఉంది.

"భయపడకే, పిచ్చిదానా ! అతడు మనకి బంధువే కదూ ?"

కాని, ఫలీనాకు ఆ బంధువుల, దూరపు బంధువుల అవసరం ఏమీ లేదు. ఆ బంధుత్వాన్ని అంగీకరించదుకూడా. మంత్రముగ్ధలాగ ఆ కణుజుకేసే చూస్తూంది.

తన చుట్టూ ఇంత గొడవ జరుగుతున్నా ఆ కణుజుకు ఏమీ తెలియదు. నడగొండలా నడిచిపోతూంది.



ఫలీనా ఒకటే అరుపు.

"ఆ — వూ ! బా — వూ !"

"అబ్బ ! ఊరుకో. ఆయన ఏమనుకుంటాడూ ?" అన్నాడు, బేంబి బ్రతిమాలుతూ.

"ఏమైనా అనుకోనీ. ఆ — వూ ! బా— వూ !" మధ్య మధ్యలో బేంబిని కసురుతూంది.

"అబ్బ ! నన్ను అడ్డుపెట్టకు. ఆ — వూ ! బా—వూ !"

కణుజు మంచుకు తడిసిన గడ్డిపరకలు కొరుకుతూ అడుగులేస్తూంది.

బేంబి ఇటు గాభరాతో మతిపోయి ఉన్న ఫలీనానూ, అటు తనకేమీ పట్టనట్లున్న కణుజునూ మార్చి మార్చి చూస్తున్నాడు. ఫలీనాను సముదాయించడం పేరుతో తన మనస్సులోని గాభరాను అణుచుకుంటున్నాడు. అతనికి ధైర్యం కలిగింది.

ఇదివరలో ఆ కణుజును చూసినప్పుడు తనకు కాలూ చెయ్యీ ఆడలేదని జ్ఞాపకం వచ్చింది.

"వట్టి తెలివితక్కువ ! వట్టి సిగ్గుచేటు" అనుకున్నాడు.

"వెళ్లి ఆయనతో పరిచయం చేసుకు వస్తానుండు" అన్నాడు పైకి.

ఫలీనా గాభరా పడింది.

"వద్దు, వెళ్ళనద్దు. బా — వూ ! అది మంచిదికాదు. బా — వూ !"

"నేను వెళ్లితీరుతాను", అన్నాడు బేంబి, దృఢంగా.

తాము అక్కడ ఉన్నామనే గమనికే లేనట్లు, ఏమీ

పట్టనట్లు ఆ కణుజు ప్రవర్తించడం బేంబికి చాలా అవమానకరంగా తోచింది.

"నేను వెడుతున్నా. భయపడకు. ఇక్కడే ఉండు. మరేం ప్రమాదం లేదు" అని నిజంగానే బయలుదేరేడు.

అయితే అతడు ఉండమన్నచోట ఫలీనా ఉండలేదు. ఉండలేకపోయింది. దూరంగా చెట్లలోకి పరుగెత్తింది. నోరు పెద్దగా తెరిచి అడవి ప్రతిధ్వనించేలా అరిచింది.

"ఆ — వూ! బా — వూ!"

నిజం చెప్పాలంటే బేంబికి కూడా గాభరాగానే ఉంది. వెనక్కి వెళ్లిపోవాలనే ఉంది. అయితే ఇంతవరకూ వచ్చాక వెనక్కి వెళ్ళడం సాధ్యం అనిపించలేదు. ఫలీనా ఏమనుకుంటుంది? మనస్సు గట్టిపరుచుకుని ముందుకు అడుగేశాడు.

బేంబికి గుండెలు అదురుతున్నాయి.

కణుజుకు పది బారల దూరంలోదాకా వచ్చి నిలబడ్డాడు.

కణుజు ఒక్క క్షణం తలతిప్పి, బేంబిని చూచి, మళ్ళీ తలవంచుకుని గడ్డి మేయడంలో పడిపోయింది.

అలవోకగా ఆ చూడడం, తల తిప్పుకుని శూన్యంలోకి చూడడం, తన కేమీ పట్టనట్లు తల వంచుకుని తన పని తాను చేసుకుపోవడం— ఇవన్నీ చూస్తూంటే గొప్ప ఇంటి వాళ్ళ దుర్గర్వం బాగా కనిపించింది బేంబికి. చికాకుకలిగింది. యనతో ఎల్లాగైనా మాట్లాడితీరాలని నిర్ణయించుకున్నాడు.

"నమస్తే. నన్ను బేంబి అంటారండి. తమ నామధేయం ఏమిటో తెలుసుకోవచ్చునా?" అని మొదలుపెట్టా

లనుకున్నాడు. కాని, అది అనుకున్నంత సులభంగా కనిపించ లేదు. తానే ముందరికి వచ్చాడు, కనక, తానే ముందు పలకరించడం మర్యాద. అయితే, ఏదో తెలియని భయం వల్ల నోరు విప్పలేకపోయాడు.

ఎదురుగా నిలుచుని చూస్తూంటే కణుజు పెద్ద పర్వ తంలా కనిపిస్తూంది. దానిముందు తాను మరీ నలుసులా ఉన్నట్లు అనిపించింది. అంతలో తనకు తానే ధైర్యం చెప్పు కున్నాడు.

"ఈయన ముందర సిగ్గు పడవలసిన పని ఏముందీ? నేనుకూడా ఇంచుమించుగా ఆయన అంతా ఉన్నాను కదా!" అనుకున్నాడు.

అల్లా సరిపుచ్చుకోబోయినా మనస్సులో ఎక్కడో మూల బెరుకుగానే ఉంది. 'నే నెక్కడ? ఆయ నెక్కడ? కాస్తో కూస్తో ఏమిటి, బోలెడంత తేడా ఉంటే?' అనుకుని క్రుంగిపోయాడు.

కణుజు బేంబిని క్రీగంట చూస్తూ మనస్సులోనే మెచ్చుకుంది.

'ఓహో! ఏమి అందంగా ఉన్నాడూ! ఇంత అందగాళ్లు మా జాతిలో కనబడనే కనబడరు. ఇతని ప్రతి కదలికలోనూ సొగసులు చిందిపోతున్నాయి. మరీ తేరిపార చూస్తున్నాను, కాబోలు. ఏమనుకుంటాడో ఏమో? పైకి తేలకపోయినా నేనంటే తేలిక అయిపోనూ?'

తేలిక అయిపోతాననే భావంతో కణుజు బేంబి మీదుగా శూన్యంలోకి చూస్తూ నిలబడింది.

"ఎంత గర్వం. నాకేసి చూడడమే అప్రతిష్ఠ అనుకుం టున్నాడు కాబోలు. ఆయన కాలు అంతకూడా లేనను కుంటున్నాడేమో ?" అనుకున్నాడు బేంబి.

"ఈ కుర్రాడితో మాట్లాడితే బాగుండును. ఇల్లాగ మూగిగా ఒకరి నొకరు చూసుకుంటూ ఊరుకోవడం బాగు లేదు" అనుకుంది కణుజు.

"అసలు నేను ఈయన కంటికి ఆనుతున్నట్టే లేదు. పెద్ద జాతివాళ్ల దురహంకారం ఇల్లాగే ఉంటుంది" అను కున్నాడు బేంబి.

కణుజు అనుమానం వేరు. ఎల్లా మాట్లాడాలీ, ఏం మాట్లాడాలీ అని దానికి అనుమానం.

"నా కసలే చక్కగా మాట్లాడడం చేతకాదు. తెలి యక ఏదో వెర్రి మొర్రి మాట లనేస్తే ఆయన వెక్కిరిస్తాడో ఏమో? ముఖం చూస్తే మాంచి తెలివైనవాడిలా ఉన్నాడు' అనుకుంది కణుజు.

"ఈయన చాలా బలవంతుడూ, గొప్ప వాడూనూ. నాకన్న బాగా పెద్దవాడూ" అని నిరుత్సాహ పడిపోయాడు, బేంబి.

"ఈయనతో పరిచయం పెట్టుకోవడం ఈవేళ కాదు. మరోసారి చూద్దాం. అవకాశం రాకపోతుందిట" అను కుంటూ అసంతృప్తిగా మందగమనంతో ఎదరకు సాగిపో యింది కణుజు.

ఆయన చూపుకి అందేటంతవరకూ చూస్తూ బేంబి

అక్కడే నిలబడిపోయాడు.

♦ ♦ ♦

సూర్యకిరణాలను పీల్చుకుని అడవి అంతా ఆవిర్లు కక్కుతూంది. ఆకాశంలో ఒక్క మబ్బు తునక కూడాలేదు. మైదానంలో, చెట్ల చివరల, పొదలమీాద, గాలి వెచ్చనై, ఊగిసలాడుతూ పైకి పోతూంది.

ఒక్క ఆకు కదలడంలేదు. ఒక్క కొమ్మ వంగడం లేదు. ఆకుల నీడల్లో అవి అన్నీ విశ్రాంతి తీసుకుంటు న్నాయి. దారులవెంట ఒక్క జంతువు నడవడంలేదు. అడవి అంతా నిశ్శబ్దంగా నిద్రపోతూన్న ట్లుంది.

బేంబి నిద్రపోయాడు.

రాత్రి అంతా ఫలీనాతో ఆటలాడేడు. గంతులేశాడు. ఆ ఆట పాటలతో తెల్లవారడమే తెలియలేదు. వెలుగు వచ్చాక తిండి తినలేదని జ్ఞాపకం వచ్చింది. బాగా అలిసి పోయా డేమో అతనికి ఆకలి తెలియనేలేదు. కళ్ళు మూతలు పడిపోతున్నాయి. గుబురుగా ఉన్న పొద చూసు కుని పడుకున్నాడు. దగ్గరలో ఉన్న పారిజాతపు పూల వాస నలు బేంబిని జోకొడుతున్నాయి. అలాగే నిద్రపోయాడు.

ఉన్నట్లుండి ఉలిక్కిపడి నిద్ర లేచాడు. ఎవరిదో భయ వ్యాకులమైన కంఠధ్వని వినిపించినట్లైంది. ఎవరిదో ఆ కేక? ఫలీనా కాదుకదా?

బేంబి తల ఎత్తి చూశాడు. ఫలీనా అక్కడ లేదు. తాను నిద్రపోకముందు ఆమె ఇక్కడే ఉండాలి. ఒకర్తికీ ఏమీా తోచక ఎటేనా వెళ్లిందేమో? ఈ ప్రాంతాలలోనే

ఉంటుం దనుకున్నాడు.

అతడికి నిద్రమత్తు ఇంకా పూర్తిగా వదలలేదు. కళ్ళు ఇంకా అరమూతలు పడుతూనే ఉన్నాయి. మనస్సు పూర్తిగా ఈ ప్రపంచంలోకి రాలేదు. అర్ధ చైతన్య దశలో అలాగే ఆలోచిస్తూ ఉన్నాడు.

"చాలాసేపు పడుకున్నానా? ఫలీనా పిలుస్తూందా? ఎంతసేపటినుంచి పిలుస్తూందో?" జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

మళ్ళీ వినిపించింది. స్పష్టంగా, పిట్ట అరుపులా సన్నంగా, ఏదో విచారంగా ఉన్నట్లు చిత్రమైన అరుపు.

"ప్రి ... దీ! ప్రి ... దీ!"

"అవును. అది ఫలీనా గొంతుకే. అనుమానంలే" దనుకున్నాడు. బేంబి చటుక్కున లేచి, ముందుకు దూకేడు. పొద గల గలమంది. కొమ్మలు గర గర మన్నాయి. ఆ మొదటి దుముకులోనే అతడు చటుక్కున ఆగవలసి వచ్చింది. పక్కకు తప్పుకోవలసి వచ్చింది. అతనికి ఎదురుగా, దారికి అడ్డుగా ముసలి నాయకుడు నిలుచబడి ఉన్నాడు!

ఇప్పుడు బేంబి మనస్సులో ఫలీనాకు తప్ప మరో దానికి స్థానం లేదు. ఆ సమయంలో ముసలినాయకుని రాక సంతృప్తి కలిగించలేదు. ఇదే మరోసారి ఎప్పుడేనా అయితే ఆయనతో మాట్లాడడానికి మహా సంతోషపడి ఉండేవాడు. కాని, ఇప్పుడు దానికి వ్యవధిలేదు. గౌరవంతో తల వంచి, దారి తొలగి, ఆయనను తప్పించుకుని, ముందుకు వెళ్ళబోయాడు.

"ఎక్కడికీ ?" అన్నాడు నాయకుడు కఠినంగా.

చెప్పడానికి బేంబికి సిగ్గువేసింది. అయినా అబద్ధం చెప్పలేదు.

"ఫలీనా దగ్గరికి" అన్నాడు నెమ్మదిగా.

"వెళ్ళడానికి వీల్లేదు" అన్నాడు, నాయకుడు ఆజ్ఞాపిస్తూన్నట్లు.

బేంబిలో కోపం రెపరెప లాడింది. 'ఫలీనా దగ్గరకు వెళ్ళడానికి వీల్లేదూ ? ఏమిటీ ముసలాడి పెత్తనం ?' అనుకున్నాడు. 'ఏమిటీ ఈయనగారి పెద్దరికం ? వెడితే ఏం చేస్తాడో ?' అనిపించింది కూడాను.

కానీ, నాయకుని నిశితమైన చూపులు బేంబిని కదలనీయలేదు. ఆలస్యం భరించలేకుండా ఉన్నాడు.

"నన్ను పిలుస్తూంది ఫలీనా !"

"ఏమీలేదు. ఆమె పిలవడంలేదు."

అంతలో పిట్ట అరుపులా సన్నగా పిలుపు వినిపించింది.

"ప్రి ... దీ ! ప్రి ... దీ !"

బేంబి ఉలిక్కి పడ్డాడు.

"అదిగో ! విన్నారా ?"

"విన్నాను" అని తల ఊపేడు, నాయకుడు.

"ఇంక నన్ను పోనివ్వండి మరి" అని బేంబి అడుగు వెయ్యబోయాడు.

"ఆగు !" అని ఆజ్ఞాపించాడు నాయకుడు.

"ఎందుకూ ? నన్ను వదిలెయ్యండి. ఫలీనా పిలుస్తోంది. నేను వెళ్ళితీరాలి."

"ఆ పిలుస్తున్నది ఫలీనాకాదు."

"ఇది మరీబాగుంది. నాకు ఫలీనా గొంతుకే తెలియ దంటా రేమిటీ ?"

"నా మాట విను" అన్నాడు నాయకుడు శాంతంగా.

అంతలో మళ్ళీ వినిపించింది.

"ప్రి ... దీ !"

బేంబికి ముళ్ళమీద నిలుచున్నట్లుంది. బ్రతిమాలేడు.

"నన్ను వెళ్ళనివ్వండి. ఇప్పుడే వచ్చేస్తాను."

"ఉఁహుఁ. ఇంక నువ్వు తిరిగిరావు" అన్నాడు నాయ కుడు, తల అడ్డంగా తిప్పుతూ.

మళ్ళీ పిలుపు వినిపించింది.

ఈమారు బేంబి కంఠంలో దృఢత్వం వినిపించింది.

"నేను వెళ్ళాలి. వెళ్లితీరాలి."

ముసలి నాయకుడు విధిలేక, విచారంతో అంగీక రించాడు.

"సరే. అల్లా అయితే మన మిద్దరం కలిసే వెడదాం."

"పదండి, త్వరగా పోదాం" అని ముందుకు ఉరక బోయాడు బేంబి.

"తొందర పడకోయ్ ! నువ్వు నా వెనకాలే అడు గులో అడుగు వేస్తూ రావాలి."

ముసలి నాయకుడు మెల్లగా ముందుకు నడుస్తున్నాడు. బేంబికి బహు తొందరగా ఉంది. కాళ్ళు వాటంతట అవే ఉరకలు వేసేలా ఉన్నాయి. అయినా బిగబట్టుకుని ఆయన వెనకాలే నడిచేడు.

"ఒక్కమాట జ్ఞాపకం ఉంచుకో. ఆ పిలుపు ఎన్నిసార్లు వినిపించినా సరే, నువ్వు నన్ను వదిలి పోవడానికి వీల్లేదు. పిలుస్తూన్నది ఫలీనాయే అయితే ఆమె నిన్ను విడిచి ఎక్కడికీ పోదు. కానీ, చెప్తున్నా విను. ఆమె ఫలీనా కాదు. నేను చెప్పినట్లు నడుచుకో" అంటూ ఒకటికి పదిసార్లు హెచ్చరించాడు, ముసిలి నాయకుడు. బేంబి అంగీకరించాడు.

ఇద్దరూ మెల్లగా ముందుకు నడుస్తున్నారు. ముసలాయనకు నడవడంలో మెలకువలు బాగా తెలుసు. అడుగు వేస్తే అసలు చప్పుడే లేదు. ఒక్క ఆకు కదిలితే, ఒక్క కొమ్మ గర గర లాడితే ఒట్టు. అది ఎంతో కాలం శ్రమించి నేర్చిన విద్య. లేక ఆయన కది స్వతస్సిద్ధమేమోకూడా అనిపించింది. బేంబి మనస్సు ఎంత తొందర పడుతున్నా ఆయన గమన పాటవాన్ని మెచ్చుకోకుండా ఉండలేక



పోయాడు. ఆయనను అనుకరించబోయాడు.

"ప్రి ... దీ!" అని మళ్లీ వినిపించింది.



ఈసారి అది మరీదగ్గరలో వినిపించింది.

నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ ఆ కంఠధ్వని వినవచ్చిన దిక్కుగా నడిచేరు.

"నీకు ఏం కనిపించినా సరే కదలవద్దు. జాగ్రత్తగా నావెనకనే ఉండు. అనవసరంగా భయపడకు" నాయకుడు మరోసారి హెచ్చరించాడు.

మరో నాలుగు అడుగులు వేసేసరికి బేంబికి ఘాటువాసన తగిలింది. తల దిమ్మెక్కించే ఆ వాసన అతనికి బాగా గుర్తు.

అది తగలగానే కంగారుపడి అరవబోయేడు. కాని, బల వంతంగా కేకను ఆపుకున్నాడు. ఉన్నచోటనే బిగుసుకు పోయాడు. భయంతో గుండె కువకువలాడింది.

ముసలి నాయకుడు గంభీరంగా నిలుచున్నాడు. ఆయ నకు భయమేమీ లేదు కాబోలు.

"అక్కడ!" అన్నట్లు కళ్ళతో చూపించాడు బేంబి.

అక్కడికి దగ్గరలో మద్దిచెట్టు నానుకుని మనిషి నిలు చుని ఉన్నాడు. గొంతు బిగపట్టి సన్నని గొంతుకతో పిలు స్తున్నాడు.

"ఫ్రి...దీ! ఫ్రి...దీ!"

అతని వీపు లేళ్ళవైపు తిరిగి ఉంది. అటు చూస్తు న్నాడు. ముఖం సరిగ్గా కనబడడంలేదు.

బేంబి నిర్విణ్ణుడైపోయాడు. తనలో తాను గొణుక్కు న్నాడు. 'అవునవును. మనిషే! అచ్చు ఫలీనా గొంతుక ననుకరిస్తున్నాడు.'

నిజం తెలిశాక బేంబికి తెలివి వచ్చింది. భయం ఆవ హించింది, వెనుదిరిగి బలంకొద్దీ పరుగెత్తాలన్న ఊహ నరా లను తోడేసింది.

"కదలకు!" అని ముసలి నాయకుని ఆజ్ఞ.

బేంబి నిలబడిపోయాడు. వినపడీ వినపడని ఆయన గొంతుకలో అంత శక్తి ఉంది.

ముసలి నాయకుని కళ్ళల్లో హాస్యరేఖ కనిపించింది. మళ్ళీ అంతలో వాత్సల్యం దీపించింది. ఇంక అక్కడ ఉండ కూడదని బేంబికి ఆ చూపులో అర్థం అయింది.

మనిషికి మరీ ఇంత దగ్గరలో ఉండడం ప్రమాదం.

బేంబి ఊహ గ్రహించి ముసలి నాయకుడు వెను దిరిగేడు.

"నడు, పోదాం!"

ముసలి నాయకుడు అడుగులో అడుగు వేసుకుంటూ మెల్లగా నడుస్తున్నాడు. బేంబికి ఆయన నడకలో మరో చిత్రం కనిపించింది. ఎందుకో కాని ఆయన సూటిగా నడవ డం లేదు. వంకర టింకరగా, పాములా నడుస్తున్నాడు. ఎందుకో అడిగే ధైర్యంలేదు. తెలియకపోయినా ఆయననే అనుకరించాడు.

నాయకుడు అక్కడక్కడ ఆగుతున్నాడు. చెవులు రిక్కించి వింటున్నాడు. మళ్ళీ కొంతసేపు మెలిక నడకలు. మళ్ళీఆగేడు. మళ్ళీ విన్నాడు. ఈమాటు నెమ్మదిగా ఏమీ తొందర లేనట్లు సూటిగా నడక మొదలుపెట్టేడు.

ప్రమాదం దాటి చాలా దూరం వచ్చేసినట్లు బేంబి గ్రహించాడు.

ఈసారి నాయకుడు ఆగినప్పుడు నమస్కరించాలనీ, కృతజ్ఞత తెలుపుకోవాలనీ బేంబి ఎన్నో అనుకున్నాడు.

కాని, అవేమీ జరగలేదు. చూస్తూండగానే ఆయన పొదలమాటున మాయమయాడు. అంత తొందరగా నడు స్తూన్నా ఒక్క ఆకు కదలలేదు. ఒక్క కొమ్మ వంగలేదు.

బేంబి ఆయనను అనుకరిస్తూ నడవబోయాడు. కాని కుదరలేదు. ఆకులు సన్నగా గలగలమన్నాయి. పొట్ట రాసు కుని కొమ్మలు కరకరలాడేయి. నేలనుపడ్డ ఎండుకొమ్మలు

చిటుకు చిటుకుమన్నాయి.

నాయకుడు వెళ్ళిన దిశగా చూస్తూ బేంబి ఒక్క క్షణం ఆగేడు. 'ఆయన నన్ను కాపాడేరు' అనుకున్నాడు.

మెల్లిగా ఆ పొదలు దాటి ఇవతలికి వచ్చాడు. హాయిగా గాలి పీల్చుకున్నాడు. స్వేచ్ఛగా ఒక్క నిమషం పరుగెత్తేడు. ఎగిరెగిరి పడుతూన్న బేంబి శరీరం మందార మొక్కల తోపును రెండు పాయలుగా చీల్చేసింది.

అత డల్లాగే చాలాసేపు తిరిగేడు. ఒకచోట ఫలీనా కనిపించింది. ఆమెను చూడగానే కళ్ళ నీళ్ళు తిరిగేయి. అంతలో సంతోషం ముంచుకు వచ్చింది.

"ఫలీనా! నే నోమాట చెప్తా. వింటావు కదా? దూరంగా ఉన్నప్పుడు ఎప్పుడూ నన్ను పిలవకు. నువ్వు పిలిస్తే నాకు మతే పోతుంది. కనుక పిలవవద్దు. కనిపించ నప్పుడు వెతుక్కోవడంలోనే ఎంతో సరదా ఉంది. కొంచెం ఆలస్యం అయితే అవుతుందిలే."

కొన్నాళ్ళ తరవాత ఒక రోజున బేంబి, ఫలీనాలు సరదాగా అడవిలో నడుస్తున్నారు. మైదానం దాటి ఆవలి వైపునఉన్న జువ్విచెట్టు దగ్గరకు వెళ్లాలని వాళ్ళ ఆలోచన.

అంతదూరం వెళ్ళేక జువ్వికింద పొదలలో ఏదో కదు లాడినట్లనిపించింది. ఆగేరు. ఏదో ఎర్రగా తళుక్కుమంది.

"ఇంకెవరూ? కారో కావచ్చు. లేకపోతే గోనో కావచ్చు" అంది ఫలీనా.

బేంబి తల తిప్పేడు.

"ఊహూం. వాళ్ళిద్దరికీ నేనంటే హడలు." ఫలీనా

జ్ఞాపకం తెచ్చుకుంది.

"అవునవును. వాళ్ళు అయివుండరు.... ఇప్పుడు కనిపిస్తోంది.... అదేమిటి? అంత చిత్రంగా నడుస్తున్నాడు ఎవడో!"

"చిత్రంకాదు, ఏమీకాదు, వట్టి చవటలా నడుస్తున్నాడను. శరీరం అయితే ఉంది. కాని కుర్రాడి తీరుగా ఉంది వ్యవహారం. ఈ లోకంలో ప్రమాదం అనేది ఏమీ లేనట్లు...."

ఫలీనా ఉత్సుకత చూపింది.

"నడు, దగ్గరగా వెళ్ళి చూద్దాం."

"సరే. పద,"

ఇద్దరూ ముందుకు నాలుగడుగులు వేశారో లేదో ఫలీనాకు పెద్ద అనుమానం పట్టుకుంది.

"తీరాచేసి వాడు దెబ్బలాటకి వస్తే? చూస్తే బలంగా కూడా ఉన్నాడు,"

"హుస్!" బేంబి నిర్లక్ష్యంగా తల విసిరేడు. "వాడి కిరీటం చూడు, ఎంత చిన్నదో! చూస్తే గుండులా ఉన్నాడు. కానీ, అది నిజమైన బలంకాదు. ఊబ వొళ్ళు. నేనా వాడికి భయపడ్డం? పద, వెడదాం!"

ఇద్దరూ ఎదరకు నడిచేరు

ఆ కొత్తలేడి తలవంచుకుని గడ్డి పరకలు కొరుకుతున్నాడు. వీళ్ళిద్దరూ మైదానంలో సగందూరం వచ్చేకకానీ వీళ్ళను గమనించనే లేదు. చూశాక చెంగున ఎగిరి వాళ్ల వైపు పరుగెత్తుకు వచ్చాడు. బేంబి, ఫలీనాలు ఆగేరు. ఆ

కొత్త లేడి పరుగెత్తుకుంటూ వచ్చి, వాళ్ళకు రెండు అంగల దూరంలో నిలుచున్నాడు.

"మీరు నన్ను గుర్తుపట్టలేదూ?"

అతడు వస్తూంటే బేంబి తలవంచి యుద్ధానికి సన్నద్ధుడై ఉన్నాడు. ఇప్పుడుకూడా తల ఎత్తకుండానే కాపు దలలో ఉండి ప్రశ్నించాడు.

"ఏం, నువ్వు మమ్మల్ని ఎరుగుదువా?"

కొత్త లేడి ఆశ్చర్యపడ్డాడు.

"బేంబీ! నేను, జ్ఞాపకం లేనూ?"

తనను పేరుపెట్టి పిలవడం వినగానే బేంబి యుద్ధ ప్రయత్నాలు తాత్కాలికంగా విరమించాడు. రెండడుగులు వెనక్కు జరిగి తలఎత్తేడు. ఆ పిలుపులో చిన్ననాటి సంగతు లేవో గుర్తుకు వచ్చాయి.

ఫలీనా ఒక్క గంతులో ఆ కొత్త లేడిని సమీపిం చింది.

"గోబోవి కదూ?" అని అరిచింది.

"ఫలీనా! నువ్వేనా నన్ను గుర్తుపట్టేవా?" అన్నాడు నెమ్మదిగా గోబో.

అతడామెను సమీపించి ముఖానికి ముఖం ఆనిం చాడు. అతని చెంపల వెంట కన్నీళ్ళు కారుతున్నాయి. ఫలీనాకూడా నోట మాటలేక, కళ్ళ నీళ్ళు కారుస్తూ నిలు చుంది.

"గోబో! అవును, గోబోయే" అంటూ బేంబి అతని దగ్గరకు వచ్చాడు.

చచ్చిపోయేడనుకున్న మిత్రుని చూడగానే ఎంతో సంతోషం కలిగింది.

"అయితే నువ్వు చచ్చిపోలేదన్నమాట?"

గోబో పకపక నవ్వేడు.

"చూస్తున్నావుగా?"

"అయితే మరి!...ఆ రోజున మంచులో..." అన్నాడు బేంబి.

అర్థోక్తిలో గోబో అందుకున్నాడు.

"అప్పుడా? ఆ మనిషే నన్ను రక్షించాడు."

"అయితే, ఇన్నాళ్ళూ ఎక్కడున్నావూ?" అంది ఫలీనా కళ్ళు పెద్దవిచేసి.

"అతడి దగ్గరే. అప్పటినుంచి ఈ రోజువరకూ అతడి దగ్గరే ఉన్నాను."

ఆశ్చర్యంతో నోట మాటలేకుండా కళ్ళప్పగించి చూస్తున్న ఫలీనా, బేంబీలను చూసి గోబో నవ్వేడు.

"మీ అడవిలోకన్న ఎన్నో సంగతులు చూశాను."

అతని మాటలు వింటూంటే వాళ్ళకు అంతులేని ఆశ్చర్యం కలుగుతూంది.

"ఊఁ త్వరగా చెప్పు, ఏం జరిగిందో" అంది ఫలీనా.

"ఓ అదా! నన్ను గురించి చెప్పుకోవాలంటే ఎన్ని రోజులైనా పడుతుంది. దానికి అంతేముందీ!" అన్నాడు గోబో.

"అసలంటూ ఏదో మూల మొదలుపెట్టు" అన్నాడు బేంబి.

ఫలీనా వైపు తిరిగి ప్రశ్నించాడు గోబో:

"అమ్మ బతికుందా?" అన్నాడు నెమ్మదిగా, అనుమానంగా.

"ఆ. అయితే నేనుకూడా అమ్మని చూసి చాలా రోజులైపోయింది" అంది ఫలీనా.

"అమ్మని చూడాలి. వెడదామా?"

ముగ్గురూ బయలుదేరేరు, మౌనంగా.

గోబో మనస్సులో అమ్మ మెదులుతూందనీ, అతణ్ణి విసిగించడం మంచిది కాదనీ బేంబి, ఫలీనాలు గ్రహించారు. దారులు చీలినప్పుడు, గోబో తప్పుదారిని పోబోయినప్పుడు మాత్రమే వాళ్ళు అతణ్ణి హెచ్చరిస్తున్నారు.

"అటుకాదు. తిన్నగా!"

"ఉహుఁ. ఇటు!"

చెట్లులేని పుంతలు, తెరపిచోట్లూ దాటవలసి వచ్చినప్పుడు వాళ్ళిద్దరూ ఆగి, జాగ్రత్తగా అవతల ఏముందో చూసుకుని మరీ అడుగేస్తున్నారు. గోబోకు అటువంటి శ్రద్ధ ఏమీ ఉన్నట్లులేదు. చటుక్కున ఒక్క పరుగులో దాటెయ్యడమే. అది చూసి బేంబి ఫలీనాలు ఆశ్చర్యపోతున్నారు. అయితే గోబోతో మాత్రం ఏమీ చెప్పలేదు. ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూచుకునేవారు.

ముగ్గురూ చాలాదూరం అడవిలో తిరిగేరు. చిన్నప్పుడు తామందరూ తిరిగిన వంకదారి కనిపించింది. బేంబి ఫలీనాలు తనను బుద్ధిపూర్వకంగా అక్కడికి తీసుకువచ్చారని గోబోకు తోచనేలేదు.

"చూశారూ? మన పాతదారి కనుక్కున్నాను" అన్నాడు గోబో.

అక్కడ రహస్య స్థలం ఉంది. అక్కడే వాళ్ళిద్దరూ పుట్టేరు. అక్కడే అమ్మతో గడిపేరు.

"ఇక్కడే" అంటూ లోపలికి వెళ్ళింది ఫలీనా. గోబో ఆమె వెనుకనే వెళ్ళేడు. పాత జ్ఞాపకాలతో అతని మనస్సు నిండి వచ్చింది. గోబో ఫలీనా లిద్దరూ ముఖాలు దగ్గర దగ్గరగా ఆనించుకుని కొద్దిసేపు అల్లాగే నిలబడిపోయారు.

వాళ్ళు మళ్ళీ అడవిలో తిరగడం ప్రారంభించారు. ఎండ బాగా కాస్తూంది. అడవి చాలా నిశ్శబ్దంగా ఉంది. అంతా విశ్రాంతి తీసుకునే సమయం అది. కాని, గోబోకు ఆ అలవాటు లేనట్లుంది. అతడు అడవి జీవితపు అలవాట్లన్నీ మరిచిపోయాడు. దారిలో అడ్డదిడ్డంగా నడుస్తాడు. సరిగ్గా చూచుకోకుండా ఏదో నిర్లక్ష్యంగా నడుస్తాడు. ఓ మాటు దారి పక్కనే నేలమీద పడుకునిఉన్న అడవి కోళ్ళను ఇంచు మించు తొక్కేసినంత పనిచేశాడు. అవి అన్నీ కేర్ కేర్ మని అరుస్తూ ఒక్కమారు రెక్కలు టపటపలాడించి పైకెగిరేయి. గోబో హడలిపోయాడు.

అతడు బొత్తిగా తెలియనివాడిలా, ఎడ్డిగా కనిపించాడు బేంబికి.

నడుస్తూ నడుస్తూ గోబో ఫలీనా వైపు తిరిగి దిగులుగా అన్నాడు.

"మనకి అమ్మ కనబడదు కాబోలు."

చిన్నతనంలో గోబోలో ఉండిన దిగులు — ఫలీనాకు

బాగా తెలిసిన దిగులు — మళ్ళీ కనబడింది.

"ఇంకెంత? వచ్చేశాం" అంది ఫలీనా.

"పోనీ, చిన్నప్పుడు మనం పిలిచినట్లు అమ్మా! అమ్మా! అని పిలుద్దామంటావేమిటి?" అంది కొంటెగా.

బేంబి ముందు ఏణి పిన్నిని చూశాడు. ఆమె బాదం చెట్టుకింద నీడలో పడుకుని విశ్రాంతి తీసుకుంటోంది.

"అదిగో? అక్కడ" అని చెప్పబోయే లోపుగానే గోబో ఫలీనాలుకూడా ఆమెను చూసేరు.

ముగ్గురూ మౌనంగా ఆమెను సమీపించారు. ఆమె మెల్లిగా కళ్ళు విప్పి చూసింది.

గోబో సిగ్గుపడుతూ ముందుకు నడిచేడు. వణుకుతున్న కంఠంతో "అమ్మా!" అన్నాడు నెమ్మదిగా.

ఏణిపిన్ని కొడుకును పరకాయించి చూసింది. ఆపాదమస్తకమూ వణికిపోయింది. ఏమీ మాట్లాడలేదు. ఏమీ అడగలేదు. దగ్గరగా వచ్చి గోబోను వంటినిండా ముద్దులు పెట్టుకుంది, చిన్నప్పటిలాగే...

గోబో చెప్పే కథ వినడానికి పరిచయం ఉన్న అడవి జంతువులన్నీ పారిజాతపు తోపు దగ్గర గుండ్రంగా ఇరుకు ఇరుగ్గా కూర్చున్నాయి.

అక్కడ కుందేలు ఉంది. అతడు చనిపోయిన కుందేలు మామయ్య కొడుకే. చెవులు నిటారుగా నిలిపి, ఒక్కమాట తప్పిపోకుండా వినడానికి సిద్ధంగా ఉన్నాడు. మాటిమాటికీ ఆ చెవులను చప్పగా కిందికి వాల్చేసి, మళ్లీ నిటారుగా నిలుచోబెడుతున్నాడు.

గోరింక బాదంచెట్టు కిందికొమ్మమీద కథకుడు బాగా కనబడేటట్లు చూచుకుని కూర్చుంది.

అక్కడే గిజిగాడు తోక పైకీ కిందికీ ఆడిస్తూ ఆశ్చర్య పడుతూ కూర్చున్నాడు. ఒక పక్కను నెమిలి, ఆయన నలుగురు భార్యలు, పిల్లలు పరివేష్టించి ఉన్నారు. రంగురంగుల మెడలు మార్చి మార్చి తిప్పుతూ అడవికోళ్లు ఓ పక్క కూర్చున్నాయి.

అలసట ఎరగకుండా కొమ్మమీదినుంచి కొమ్మమీదికి గంతులేస్తూ ఉడతమ్మ అక్కడే ఉంది. మధ్యలో ఆగి కుచ్చుతోకమీద కూర్చుని, తెల్లని పొట్టకు చేతులు నొక్కుకుంది. కాస్త సందు దొరికితే తన కథకూడా చెప్పేద్దామని అది ఉక్కిరి బిక్కిరి అయిపోతూంది. కాని అక్కడికి వచ్చిన మిగిలిన జంతువులు దాని నోరు నొక్కేస్తూ వచ్చాయి.

గోబో తన కథ మొదలు పెట్టేడు.

మంచులో పడిపోయి, లేవలేకుండా ఉన్నప్పుడు మొదలుకొని జరిగినదంతా చెప్పాలన్నారు శ్రోతలు.

అతడు అక్కడినుంచి మొదలుపెట్టేడు.

"వేటకుక్కలు నన్ను పసికట్టేయి. ఆ కుక్కలంత భయంకరమైనవి ప్రపంచంలో ఉండవు. వాటి నోళ్ళనిండా రక్తమే. వాటి గొంతునిండా కోపమే. వాటి కళ్ళనిండా నిర్దయే."

ఒకమారు తల పైకెత్తి, శ్రోత లందరినీ పరకాయించి చూచి, మళ్లీ అందుకున్నాడు.

"అటు తరువాత ఆ వేటకుక్కలతో చాలామాట్లు



"ఆయన నా దగ్గరకు వచ్చాడు. నన్ను పైకెత్తుకున్నాడు"

పుట 165

ఆడుకున్నాను. అవి అంటే నాకు భయమేమీ లేదు. ఇంచు మించు బంధువులలా ఉంటాం. అయినా ఇప్పటికీ వాటి అరుపు వింటే చాలు, పూర్వంలాగే గుండెల్లో అదురు పుడుతుంది. అవి స్వభావంచేత చెడ్డవేమీ కాదు. వాటి గొంతుక అల్లాంటిది. అంతే" అంటూ అతడు క్షణకాలం మౌనం వహించాడు.

ఉండబట్టలేక ఫలీనా తొందరపెట్టింది.

"ఊఁ. ఏమైందప్పుడు ?"

"నోళ్లు తెరుచుకుని అరుస్తూ ఆ వేటకుక్కలు పరుగు పరుగున వచ్చాయి. ఒక్క క్షణం ఉంటే అవి నన్ను చీరి ముక్కలు చేసేసేవో, ఏమో, సరిగ్గా ఆ సమయంలో ఆ మనిషి అక్కడికి వచ్చాడు."

గోబో కాస్త ఆగేడు. శ్రోతలు ఊపిరి బిగపట్టి వింటున్నారు.

"ఆయన కుక్కల్ని 'ఆగండి' అని గట్టిగా గదిమేడు. అంతే. తక్కున అవి ఆగిపోయాయి. మరేదో ఇంకో కేక వేశాడు. అవి వెళ్లి ఆయన కాళ్లదగ్గర పడుకుని తోక లాడించడం మొదలెట్టేయి. ఆయన నాదగ్గరకు వచ్చాడు. నన్ను పైకెత్తుకున్నాడు."

"ఎత్తుకోవడ మేమిటీ ?" అంది ఫలీనా.

అంటే ఏమిటో విశదీకరించడానికి పూనుకున్నాడు గోబో.

బేంబి చెప్పేశాడు.

"అందులో ఏమీ లేదు. ఉడత ముందరి కాళ్ళతో

బాదంకాయ పట్టుకోవడం చూడలేదూ? అంతే. అల్లాగే ఇదీనూ."

తనమాట వచ్చేసరికి ఉడతకు ఎక్కడలేని హుషారూ పుట్టుకువచ్చింది. తన కథ చెప్పడానికి అవకాశం దొరికిం దనుకుంది.

"మా బంధువుల పిల్ల ఒకర్తి.." అని మొదలు పెట్టింది కీచు గొంతుకతో. కాని, చుట్టుపక్కలవాళ్ళంతా చెప్పనీయకుండా దాన్ని కోప్పడ్డారు.

"ఉష్! ఊరుకో! గోబోని చెప్పనియ్యి!"

పాపం ఉడత నోరు మూసుకోవలసివచ్చింది. విచా రంగా చేతులతో గుండెలు అదుముకుంది. గోరింక కేసి చూసింది. పోనీ, అది అయినా తన కథ వింటుందేమో నని ఆశ.

"అసలు ఏం జరిగిందంటే, మా బంధువుల పిల్ల ఒకర్తి..."

కాని, గోరింక ముఖం అటు తిప్పేసుకుంది.

గోబో తాను చూచిన వింతలన్నీ చెప్పసాగేడు.

"బయట కొంకరించుకుపోయే చలి. కాని, లోపల వసంతంలోలాగ వెచ్చగా ఉంటుంది! బయట కుండపోతగా వర్షం కురుస్తూ ఉంటుంది. లోపల ఒక్కటంటే ఒక్క చుక్క పడదు. అంత పొడిగా ఉంటుంది!

"బయట తెల్లగా మంచు గుట్టలు గుట్టలుగా పడి ఉంటుంది. లోపల అంతా చాలా వెచ్చగా ఉంటుంది, నాకు బంగాళాదుంపలు, ధాన్యం, గరికగడ్డి—ఒహ ఏమిటి

నాకు కావాలన్నదల్లా తెచ్చిపెట్టేవాడు."

"గరికగడ్డికూడానా ?" అని ఆశ్చర్యంగా అడిగేయి, మిగిలిన లేళ్లు.

"అవును చక్కని గడ్డి."

అది తనకు మామూలే అన్న ధోరణిలో మాట్లాడేడు, గోబో. అంతటా క్షణకాలం నిశ్శబ్దం. ఆ అవకాశం చూచుకుని కీచు గొంతుకతో ఉడత గబగబా తన కథ మొదలు పెట్టేసింది.

"మా బంధువుల పిల్ల ఒకర్తి..."

"నోరు మూస్తావా, లేదా ?" అని అరిచేరు మిగిలిన వాళ్లు.

ఫలీనా గోబోను అడిగింది.

"అంత నడి శీతాకాలంలో గరికగడ్డి, ధాన్యం ఎక్కడ దొరికేవి ?"

"ఆయన పండించేవాడు. ఆయన తలుచుకుంటే ఎప్పుడు ఏం కావాలన్నా పండుతుంది. ఏం కోరుకుంటే అది ఆయన ముందుకి వస్తుంది."

మిగిలినవాళ్ళందరికీ బహు ఆశ్చర్యంగా ఉంది.

"ఆ మనిషి అంటే నీకు నిజంగా భయం అనిపించ లేదూ ?" అన్నారు.

గోబో పకపకా నవ్వేడు.

"అబ్బే ! భయం ఏమీ లేదు. నాకు ఆయన అపకారం ఏమీ చెయ్యడని తెలుసు. అటువంటప్పుడు నాకు భయం ఎందుకూ ? మీరంతా ఆయన్ని క్రూరుడనుకుం

మనిషిదగ్గర చాలాకాలం ఉండి తిరిగివచ్చినట్లు తెలిసి చూసి పోదామని వచ్చింది.

తన కొడుకును మరీనా చూడరావడంతో ఏణికి చాలా సంతోషమైంది. ఆమె కిప్పుడు మహా హుషారుగా ఉంది. తన జీవితం అంతటిలోనూ ఇదే మధురాతి మధురమైన ఘట్టంగా అనిపిస్తోంది ఆమెకు. అడవి అడవి అంతా తన కొడుకు మాటే చెప్పుకుంటున్నారు. ఆ కీర్తి కథనంలో ఆమె తల మునకలై పోతూంది. ప్రపంచం అంతలోకీ తన గోబో చాలా తెలివైనవాడూ, ఎంతో కీర్తి ప్రతిష్ఠలు సంపాదించిన వాడూ అని ఆమెకు దృఢమైన నమ్మకం. అడవి జీవాలన్నీ అల్లాగే గుర్తించాలని ఆమె తాపత్రయం.

"ఏమే, మరీనా, ఏమంటావ్ ? గోబో మాటే— ఏమిటె నీ అభిప్రాయం ?"

సమాధానంకోసం ఆగకుండా తానే చెప్పుకుపోతూంది.

"నవీన పిన్ని మాటలేమైనా గుర్తున్నాయా ? శీతా కాలంలో కాస్త చలి అన్నాడని ఎంత చులకనగా మాట్లా డింది ! వాడివల్ల నాకు విచారమే కాని సుఖం లేదంది. జ్ఞాపకం ఉందా ?"

"గోబోవల్ల నిజానికి నీకు విచారమే కలిగిందికదా ?" అంది మరీనా."

"ఆఁ — అదంతా ఎప్పటి సంగతో !"

ఇప్పుడు అల్లాంటి చిన్న చిన్న విషయాలు జ్ఞాపకం చెయ్యడానికి సమయమా అన్నట్లు ఆశ్చర్యపడింది, ఏణి పిన్ని.

"నా కొడుకు ఎంతవాడయ్యాడో చూస్తే నవీనా ఇప్పు

డేమనేదో ? ఆ యోగ్యత లేకపోయింది.''

మరీనా విచారం కనబరిచింది.

"అవును, పాపం! ఇంకా బతికుంటే ఎంతో సంతోష పడేది."

అమ్మ పొగడ్తలు వసంత సూర్యాతపంలాగ గోబోకు మహదానందం కలిగించాయి.

"నా గోబోని చూడడానికి ఆఖరికి ముసలి నాయకు డంతటివాడు కూడా వచ్చారు. అసలు ఆయన ఎవ్వరికంటా పడరు. అల్లాంటిది గోబొకోసం వచ్చారు" అంది ఏణి పిన్ని రహస్యం చెప్తునట్లు గొంతు తగ్గించి.

గోబో ముసలి నాయకుని పేరు విన్నాక కొంచెం అసంతృప్తి కనబరిచాడు.

"నన్ను దురదృష్టవంతుడు అన్నాడు. ఎందుకన్నాడో అడగా లనిపించింది స్మీ!"

ఏణి గోబోను ఓదార్చింది.

"ఆఁ. ఏం లేదు పోదూ! ఆయనకి పెద్దతనం వస్తూన్న కొద్దీ మతి చెడుతోంది."

గోబోకు సంతృప్తి కలగలేదు.

"అల్లాగ ఎందుకన్నారో అర్థం కావడంలేదు. నేను దురదృష్టవంతుడినా ? నా దురదృష్టం ఆయనకి ఏ మర్థమైంది? ఈ అడవి జంతువుల్లో ఏవైనా నేను చూసినన్ని సంగతులు చూశాయా ? నేను కన్న వింతలు ఎరుగునా ? ఏమంటావే, మరీనా ?"

"నిస్సందేహంగా. నీకన్న ఎక్కువ తెలిసినవాళ్ళు

అసలు ఎక్కడున్నారూ ?"

ఆ రోజునుంచీ గోబో మరీనాలు జతగా కలిసి తిరగ సాగేరు.

బేంబి ముసలినాయకుణ్ణి చూడాలనుకున్నాడు. ఆయన కోసం రాత్రివేళలలోనూ, పొద్దు పొడుస్తూన్న సమయాల లోనూ, ఫలీనా లేకుండా ఒంటరిగా కొత్త కొత్త దారులు పట్టి తిరగసాగేడు.

ఫలీనాతో ఉన్నంతసేపూ మహా సంతోషంగా గడిచేది. ఆమె హుషారుగా కబుర్లు చెప్తూంటే వింటూ ఎంతసేపైనా కూర్చునేవాడు. ఆమెతో కలిసి భోజనాలు చేసేవాడు. మైదానంలో, పారిజాతపు డొంకలలో, బాదంచెట్ల నీడలలో, మందారపు తోపులలో – ఆమెతో ఆటలాడేవాడు. అయితే, కొంచెం తేడా. ఇప్పుడు ఆమెతోడిదే లోకంగా లేదు.

పూర్వం ఫలీనా దగ్గర ఉన్నప్పుడు ముసలి నాయకుని ఆలోచన రేఖామాత్రంగానే ఉండేది. అప్పుడూ అప్పుడూ ఆయన జ్ఞాపకం వచ్చేవాడు. కాని, ఇప్పటి స్థితి వేరు. నాయకుణ్ణి వెతుకుతూంటే ఇప్పుడు ఫలీనా జ్ఞాపకం రావడం చాలా అరుదు.

గోబోను గురించి నాయకుడు అన్నమాట బేంబి చెవులలో గింగురుమంటూంది. అతడు తిరిగి వచ్చినప్పటినుంచీ బేంబి హృదయంలో ఏదో అలజడిగానే ఉంది. అతని పద్ధతి చూస్తూంటే జాలి అనిపిస్తూంది. అతని విషయమై ఏదో చెప్పలేని భయం కలుగుతూంది.

మళ్లీ ఎప్పుడైనా గోబోను కలుసుకున్నప్పుడు అతడు

సూటిగా మాట్లాడే ధోరణి, అతనిలోని గొప్పఆత్మవిశ్వాసం, తన గొప్పతనాన్ని గూర్చి ఈషణ్మాత్రం సందేహం కూడా లేకపోవడం — ఇవన్నీ చూస్తూంటే, వాటికీ, దురదృష్ట వంతుడు అన్న నాయకుని నిరసనకూ పొందిక కనిపించేది కాదు.

ఒక రోజున రాత్రి బాగా చీకటిగా ఉంది. బేంబి అడ విలో తిరుగుతూండగా అతని పాత స్నేహితుడు గుడ్లగూబ అరుపు వినిపించింది. ఆ అరపు విని బేంబి కంగారుపడి ఒక్క గంతు వేశాడు. అంతలో చటుక్కున సర్దుకున్నాడు. ఈ గూబకు నాయకుని భోగట్టా ఏమైనా తెలుసునేమో అనిపిం చింది. అడిగేశాడు.

"మా ముసలి నాయకుడు ఇప్పుడు ఎక్కడ ఉంటారో తమ కేమైనా తెలుసునా?"

తన కేమీ తెలియదని గూబ చెప్పింది. కాని, ఆ మాట లలో ఏదో దాపరికం ఉన్నట్లు బేంబికి పొడగట్టింది.

"అహఁ. మీకు తెలియదంటే నేను నమ్మను. ఇంత తెలివైనవాళ్ళు. అడవిలో ఎక్కడ ఏం జరిగినా క్షణంలో మీకు ఆచూకీ తెలిసిపోతూ ఉంటుంది — అల్లాంటిది ఇంత చిన్న విషయం తెలియదంటే నమ్మడం ఎల్లాగా? మీరే చెప్పండి."

గుడ్లగూబ పొంగిపోయింది. రెక్కలు విదిలించి, బంతిలా వూరెంచి, కుదురుగా కూర్చున్నది.

"నాకు నాయకుడుండే చోటు తెలియకుండా ఉం టుందా? కాని, అది చెప్తే ఇంకేమైనా ఉందా?"

బేంబి బ్రతిమాలేడు.

"మీరు చెప్పేరని ఎవ్వాళ్ళతోటీ చెప్పను నేను. ఒట్టంటే ఒట్టు! తమయందు నాకున్న గౌరవభావం తమకి తెలియంది కాదు."

గుడ్లగూబ మళ్ళీ బంతిలా పొంగింది. గుండ్రని పెద్ద కళ్ళు అటూ ఇటూ తిప్పింది.

"ఆహాఁ! మీకు నామీద చాలా గౌరవమన్న మాట. ఎందుకో తెలుసుకోవచ్చా?"

బేంబి తన పొగడ్త సాగించేడు.

"తమరు విజ్ఞాన నిధులు కనక. తమరు ఎప్పుడూ చాలా మర్యాదగా, చాలా సరదాగా మాట్లాడుతారు కనక. ఎంతో చాకచక్యంతో దారేపోయేవాళ్ళని ఇట్టే భయపెట్టగలరు కనక. ఆ విద్య ఓ పట్టాన అందరికీ పట్టుబడేది కాదు. దాని కెంత తెలివి కావాలి! నాకే కనక ఆ విద్య పట్టుబడితేనా..."

గుడ్లగూబ చాలా సంతోషించింది. ముక్కుతో ఈకలు సరిచేసుకుంది.

"ముసలి నాయకుడికి మీరంటే చాలా ఇష్టమని నాకు తెలుసును."

బేంబి హృదయం గుబ గుబ లాడింది.

"తమకి అల్లా ఎందు కనిపించిందీ?"

గూబ తల పంకించింది. "నాకు తెలుసు. తమమీద ఆయనకి చాలా వాత్సల్యం. అందుచేత ఆయన ఉండేచోటు మీకు చెప్తే తప్పులేదు."

మళ్ళీ ముక్కుతో ఈకలు సరిచేసుకుంది. బేంబిని ఓర కంట చూస్తూ సంభాషణ సాగించింది.

"వెలగతోపు తెలుసునా మీకు?"

బేంబి తల ఊపేడు.

"ఆ."

"దానికి ఈశాన్యంగా పెద్ద జువ్వి చెట్టు ఉంది. ఎప్పుడేనా చూశారా?"

"లేదు. ఎప్పుడూ అటువైపుగా వెళ్ళలేదు, ఇంతవరకూ" అని ఒప్పుకున్నాడు బేంబి.

"అయితే జాగ్రత్తగా వినండి" అని గూబ గొంతుక తగ్గించి రహస్యంగా చెప్పింది.

"వెలగతోపుకి ఈశాన్యంగా జువ్విచెట్టు. ఆ చెట్టుకి అవతల చిట్టడవిలాంటిది ఉంది. దాని మధ్యలో కిందటి గాలివానకి విరిగిపోయిన నేరేడు చెట్టు కనిపిస్తుంది. అక్కడికి వెళ్ళి వెతుక్కోండి. నేను చెప్పినట్లు మాత్రం నోరు జారకండి?"

"ఆ చెట్టు కిందనా?"

"విరిగిపడ్డ ఆ నేరేడుకి సరిగ్గా కిందగా పెద్ద గొయ్యి ఉంది. అందులో ఉంటాడు మీ నాయకుడు."

బేంబికి ఎంతో సంతోషం కలిగింది.

"మీ మేలు ఎప్పటికీ మరిచిపోను. మీరు చెప్పిన గుర్తులన్నీ జ్ఞాపకం పెట్టుకుని వెతుక్కోగలనో లేనో కాని, మీ సహాయం మాత్రం మరిచిపోను."

బేంబి ముందుకు గంతు వేశాడు. పరుగెడుతున్న అతని వెనకాలే చప్పుడు చేయకుండా ఎగురుతూ వస్తూంది, గుడ్ల

గూబ. ఉన్నట్లుండి "ఉఇక్! ఉఇక్!" అని అరిచింది. ఉలిక్కిపడి బేంబి తల పైకెత్తి చూశాడు.

"మీరు భయపడ్డారా?" అని సంతోషంగా అడిగింది, గూబ.

"మరే!"

ఈసారి మాత్రం అతడు చెప్పినది నిజమే. గూబ సంతృప్తిపడింది.

"నా పేరు చెప్పవద్దని జ్ఞాపకం చెయ్యడానికి వచ్చాను. అంతేం. మరేం లేదు."

బేంబి ముందుకు దూసుకుపోయాడు.

వెలగతోపు సమీపించేసరికి ఆ చిట్టడవిలో నుంచి అనుకోకుండా నాయకుడే ప్రత్యక్షమయాడు.

"ఎక్కడికి వెడుతున్నావ్? ఏమైనా పనుందా?"

బేంబి సిగ్గుతో నసిగేసేడు. "అబ్బె! ఏం లేదండీ... అంత ముఖ్యమైన పనేమీ కాదండీ."

ఒక్క నిమిషం నాయకుడు మౌనంగా నిలబడి, ఆప్యాయతతో నిండిన కంఠంతో ఇట్లా అన్నాడు:

"నాకోసం ఈ మధ్యన బాగా వెతుకుతున్నావనుకుంటాను. నిన్నటికి నిన్న రెండుసార్లు ఈ పక్కనుంచి వెళ్ళేవు. ఏమిటి విశేషం?"

"మీరు గోబోని అల్లా ఎందుకన్నారో తెలుసుకోవాలని."

"నే నన్నమాట సరియైనది కాదని అనుమానం ఉందేమిటి?"

"అబ్బే! అల్లాంటిదేమీ లేదండి. మీరు అన్నది నిజమే అని నాకూ అనిపిస్తోంది."

ముసలి నాయకుడు శిరఃకంపం చేశాడు. ఆయన బేంబి వంక ఎంతో ఆప్యాయంగా చూశాడు.

బేంబి ధైర్యంచేసి మళ్ళీ అడిగేడు:

"నాకూ అనిపించింది. అయితే ఎందుకో అర్థం కాలేదు."

"అల్లా అనిపించింది కదా? అది చాలు. సమయం వచ్చినప్పుడు నీకే తెలుస్తుంది. మరి వస్తా" అని ఆయన మాయం అయిపోయాడు.

గోబో విచిత్ర ప్రవర్తన చాలా ప్రమాదకరమని అడవి జంతువులన్నీ గమనించాయి.

రాత్రివేళ జంతువులన్నీ అడవిలో తిరిగే టప్పుడు గోబో నిద్రపోతాడు. పట్టపగలు ఏదో చోటు చేసుకుని ఎవ రికి వారు విశ్రాంతి తీసుకునే సమయంలో గోబో భయం లేకుండా, ప్రమాద పరిజ్ఞానం లేకుండా చెట్ల గుబురులు వదలి, మైదానం మధ్యగా అందరికీ కనిపించేలా నిలువబడ తాడు.

అటువంటి తెలివితక్కువ ప్రవర్తన బేంబికి బొత్తిగా నచ్చలేదు.

ఓమాటు అడిగేశాడు.

"ఏమిటది? అసలు ప్రమాదం ఉంటుందనేనా ఆలో చించవేం?"

"నాకు ప్రమాదం అనేది రాదు."

ఏణి పిన్ని కలుగజేసుకుంది.

"మా గోబోకీ, ఆ మనిషికీ బాగా దోస్తీ అన్న సంగతి మరిచిపోతున్నావోయ్, బేంబీ! మనబోటి మామూలు లేళ్ళు భయపడినట్లు చీటికీ మాటికీ గోబో భయపడ నక్కర లేదు."

ఒక రోజున గోబో బహు చిత్రంగా మాట్లాడేడు.

"ఈ అడవిలో ఉండే మీ అందరివీ చిత్రమైన అల వాట్లు, ఎప్పుడుపడితే అప్పుడు, ఏ గడ్డి దొరికితే అదల్లా నమలడం ఇక్కడి అందరికీ అలవాటు. చూస్తూంటే వింతగా ఉంది."

"మరి ఇంకేం చెయ్యాలిట?" బేంబికి అర్థం కాలేదు.

"నాకు సంబంధించినంతవరకూ కొన్ని నియమాలు ఉన్నాయి. నేను అన్నప్పుడూ తినను. దానికి సమయం ఉంది. ఆ సమయంలో నా కెవరో ఒకరు భోజనం తెచ్చి పెట్టాలి. రమ్మని ఆహ్వానించాలి. అప్పుడూ నేను భోజనం చెయ్యడం. ఆ పద్ధతికి నేను అలవాటు పడ్డాను."

బేంబి జాలిగా అతనికేసి చూశాడు. ఏణి పిన్ని, ఫలీనా, మరీనాలు అతని మాటలు చెవులు దోరపెట్టుకు వింటున్నారు.

"నా ఉద్దేశంలో నువ్వు ఈ శీతాకాలానికి అలవాటు పడడం చాలా కష్టంరా, గోబో! అప్పుడిక్కడ పచ్చగడ్డి, బంగాళ దుంపలూ, ధాన్యం ఇల్లాంటివేమీ దొరకవు" అంది ఫలీనా.

"అసలు నాకా సంగతే గుర్తులేదు. శీతాకాలంలో

ఎలా ఉంటుందో అసలు జ్ఞాపకమే లేదు. బహుశా చాలా కష్టంగా ఉంటుంది కాబోలు నేం?" అన్నాడు గోబో.

"ఆఁ మరీ అంతభయ పడవలసిందేమీ లేదు. మొదటి మాటు అయితే కొంచెం కష్టమే. కానీ మరీ బెంబేలు పడిపో నక్కరలేదు" అన్నాడు బేంబి.

"నాకు కష్టం అనిపించిందంటే ఒక్క క్షణం ఇక్కడ ఉండను. ఆయన దగ్గరకు చక్కాపోతాను. బాధలు పడవల సిన కర్మం నాకేం పట్టింది? ఇబ్బందులు ఒక్కనాటికి పడను."

బేంబి ఏమీ మాట్లాడలేదు. దూరంగా వెళ్ళి పోయాడు.

మరీనాతో కలిసి తిరుగుతూన్న సమయంలో గోబో బేంబి ప్రసక్తి తెచ్చేడు.

"వాడు నన్ను అసలు అర్థం చేసుకున్నట్లే లేదు. నే నింకా చిన్ననాటి గోబోనే అనుకుంటున్నాడు పిచ్చిబేంబి. నేను మామూలు అన్ని లేళ్ళలాంటివాడిని కాననీ, ఇతరుల కెవ్వాళ్ళకీ లేని ఒక ప్రత్యేకమైన స్థానం నాకు ఉందనీ వాడి కసలు జ్ఞాపకమేరాదు. ప్రమాదం ప్రమాదం అంటూ ఎప్పుడూ ఒకటే గుంజాటన. వాడికి నామీద ప్రేమే అనుకో. అందులో సందేహమేమీ లేదు. కానీ, తనలాంటి మామూలు లేళ్ళకే ఆ ప్రమాదం అనేది. అంతేకాని నాకు లేదని గుర్తించడేమంట?"

గోబో చెప్పిన వాటన్నింటికీ మరీనా తల ఊపుతుంది. ఆమెకు గోబో అంటే ప్రేమ. అతడికి మరీనా అంటే ముద్దు. వాళ్ళిద్దరూ చాలా ఆనందంగా ఉండే జంట.

"నీలాగ నన్ను సరిగ్గా అర్థం చేసుకున్నవాళ్ళున్నారు. నిజమే. కానీ, నీ అంత చక్కగా అర్థం చేసుకున్నవాళ్ళేరీ? మనిషి గొప్పతనాన్ని గురించీ, ఆయన మంచితనాన్ని గురించీ ఎన్నోసార్లు చెప్పేను. కాని, మళ్ళీ ఎప్పటిపాటే" అన్నాడు గోబో.

"నా కెప్పుడూ మనిషిమీద నమ్మకమే. కిందటి శీతాకాలం నువ్వు మాయమైపోక పూర్వం నేనోమాట అన్నాను, జ్ఞాపకం లేదూ? మనిషి మన దగ్గరికి వచ్చి మనతో సరదాగా ఆడుకొనే సమయం ఎప్పటికో అప్పటికి వస్తుందని నేను చెప్పలేదూ?" అంది మరీనా, అరమోడ్పు కన్నులతో పాత గాథలు స్మరిస్తూ.

"నాకు జ్ఞాపకం లేదు" అన్నాడు గోబో.

"నేను అన్నాను."

మరికొన్ని వారాలు గడిచాయి.

ఒకనాటి తెల్లవారుఝామున మైదానం దగ్గర బాదం చెట్లకింద గోబో మరీనాలు, బేంబి ఫలీనాలకి చల్లని ప్రాభాత వాయువులలో తిరిగివస్తూ ఎదురయ్యారు. ముసలి జువ్విచెట్టు దాటి కాలిదారిని వస్తూ విశ్రాంతికి మంచి చోటుకోసం వెతుక్కుంటున్నారు. చటుక్కున గోబో మరీనాలు ఎదురయారు. వాళ్లు మైదానం వైపుకి వెడుతున్నారు.

"మాతో రావయ్యా! పోదాం. ఇంకాస్త సేపటిలో సూర్యుడు వచ్చేస్తాడు. అటువంటి సమయంలో మైదానంలో ఎవ్వళ్ళూ ఉండరు" అన్నాడు బేంబి.

గోబో నవ్వేడు.

"అల్లాగేం? నేను నీకు ఎన్నోమాట్లు చెప్పేను – మిగి లిన లేళ్ళ పద్ధతి నాకు నచ్చదని."

అతడు ముందుకే నడువసాగేడు. అతనిని అనుసరిం చింది, మరీనా.

"సరే, వాడిష్టం వాడిది. మనం పోదాం రా" అన్నాడు ఫలీనాతో, బేంబి.

రెండు అడుగులు వేశారో లేదో మైదానం అవతలి వేపున చెవులు చిల్లులు పడేలా గోరింక అరిచింది. అది ప్రమాద సూచన.

బేంబి చటుక్కున వెనుదిరిగి గోబో దగ్గరికి పరుగెత్తేడు. వాళ్ళిద్దరినీ జువ్విచెట్టు దగ్గర ఆపేడు.

"విన్నావా?" అని అడిగేడు బేంబి.

గోబోకు అర్థం కాలేదు

"ఏమిటి వినడం?"

మళ్ళీ గోరువంక అరుపు.

"అరే! అది అల్లా అరుస్తూంటే నీకు వినబడడమే లేదూ?"

"ఓరి! గోరింక అరుపా? అది అరుస్తే నాకేమిటి?"

"ప్రమాదం తెలుపుతూందని నీకు తెలియదూ? ప్రమాదంరా బాబూ, ప్రమాదం!"

అంతలో గిజిగాడు అరిచింది.

దాని తరువాత మరొకటి అరిచింది.

ఇంతలో గోరువంక మళ్ళీ అరిచింది.

పైనుంచి ఎగిరిపోతూ కాకి అరిచింది.

ఆఖరికి ఫలీనా కూడా సోదరుణ్ణి బ్రతిమాలింది.

"వెళ్ళకురా, గోబో! ప్రమాదంరా. ఆగు. వెళ్ళకు.



నా మాట విను. మంచివాడివి కదూ? అందరం కలిసి వెళ్ళి పోదాం. రా."

గోబో పకపకా నవ్వేడు.

"ప్రమాదం, ప్రమాదం! మీ ప్రమాదాలతో నాకేం పని? వస్తా!"

అంతలో ఫలీనాకు ఒక చక్కని ఊహ తట్టింది.

"అల్లా అయితే నువ్విక్కడ నిలుచో. మాలో ఒకళ్ళం వెళ్ళి అసలు ఏమవుతోందో చూసి వస్తాం."

ఫలీనా ఆ మాట అనగానే మరీనా గబ గబా ముందుకు నడిచింది, చూచి రావడానికి. మిగిలిన ముగ్గురూ ఆమెను చూస్తూ నిలుచున్నారు. బేంబి ఫలీనాలు ఊపిరి బిగపట్టి చూస్తున్నారు. గోబో నవ్వు అణిచిపెట్టుకుంటున్నాడు.



మరీనా మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ ఆగి ఆగి మైదానం దగ్గరగా వెళ్ళింది. తల బాగా పైకెత్తి నలుమూలలూ వాసన చూసింది.

అంతే. చటుక్కున వెనుదిరిగి, మెరుపులా ఒక్క గంతులో చెట్ల గుంపులో ప్రవేశించి! వగరుస్తూ తిరిగి వచ్చింది. భయంతో ఆమె గొంతు పూడిపోయింది. మాట

కూడా సరిగ్గా రావడంలేదు.

"మ_ని_షి! అక్కడ... మైదానానికి అవతల......
దూరంగా. మనిషి!"

"పారిపోదాం, రా, తక్షణం" అన్నాడు బేంబి.

"గోబో! రా. పోదాం" అంది ఫలీనా.

మరీనా బ్రతిమాలింది.

"గోబో! ఇక్కడినుంచి దూరంగా పారిపోదాం రా.
రావూ?"

కాని, గోబో కదలలేదు. వాళ్ళను అపహాస్యం
చేశాడు.

"పరుగెత్తండి. మిమ్మల్ని పట్టుకున్నదెవరు? కాని నేను
మాత్రం అల్లా రాను. మైదానంలోకి వెడతాను. వెళ్ళి ఆ
మనిషిని చూస్తాను. చూసి పలకరిస్తాను."

ఆ మాట అంటూనే గోబో ముందుకు నడిచేడు.
మిగిలిన ముగ్గురికీ భయంతో నాలుకలు పిడచ కట్టుకుపోతు
న్నాయి. నిస్తబ్ధులై అతను వెడుతున్న దిశకే చూస్తున్నారు.

గోబోకు భయం అన్న మాటే లేదు. అనుమానం
అసలు లేదు. తడబాటే లేదు. ముందుకు అడుగేసి మైదా
నంలో ప్రవేశించాడు. ఇంకా ముందుకు వెళ్ళి నిలబడ్డాడు.
మనిషి ఎక్కడున్నాడని కాబోలు అటూ ఇటూ చూశాడు.
మనిషి కనిపించాడు కాబోలు, సంతోషంతో తల ఆడిం
చాడు. అని బహుశా పలకరింపేమో?

అంతలో గుండెలు పగిలేటట్లు ఉరుము వినిపించింది.
గోబో గాలిలోకి అల్లంత ఎత్తు ఎగిరేడు. రెండు దుముకులల్లో

చెట్ల వరసలలో ప్రవేశించాడు. తడబడుతున్న అడుగులతో తన బంధువుల దగ్గిరికి వచ్చాడు. వాళ్ళకు భయంతో నోట మాట రావడంలేదు. గోబో ఆయాసపడుతూండడం వినిపించింది. అతణ్ణి మధ్యను పెట్టుకుని ముగ్గురూ ముందుకు తోసుకుపోయారు. ముసలి జువ్విచెట్టు దగ్గర గోబో కింద పడిపోయాడు.

ముగ్గురూ ఆగేరు. మరీనా గోబో పక్కనే నిలుచుంది. ఫలీనా, బేంబి మరికాస్త దూరంలో నిలుచున్నారు. గోబో పక్కకు ఒరిగేడు. తల కాస్త పైకి ఎత్తేడు. అతి కష్టంమీద "మరీనా! ఆయన నన్ను గుర్తు పట్టలేదు" అన్నాడు.

మైదానం ఆ కొసకు ఢమఢమలతో చెవులు గింగుర్లెత్తేయి.

మరీనా గోబోమీదికి వంగింది.

"గోబో! అదుగో, అతడు వచ్చేస్తున్నాడు. లేవాలి. లే. పారిపోదాం."

గోబో తల పైకెత్తడానికి ప్రయత్నించాడు.

మైదానం మొగలో ఆకులూ కొమ్మలూ గలగలమంటూ పెద్ద చప్పుడయాయి. మనిషి వచ్చేశాడు. చాలా దగ్గర్లోకి వచ్చేశాడు.

బేంబి ఫలీనాలు అప్పటికే ఆ చోటు వదిలి వెళ్ళిపోయారు. నెమ్మదిగా, నిశ్శబ్దంగా వెనక్కు నడిచి, అడవిలో కలిసిపోయింది మరీనా. అక్కడినుంచి చప్పుడు చేయకుండా లాఘవంగా దుముకుతూ బేంబి ఫలీనాలను చేరుకుంది.

దారిలో వెనక్కి తిరిగి ఓమాటు చూసింది.

పడిఉన్న గోబో దగ్గర ఆ మనిషి వంగి చేతితో ముట్టుకోడం కనిపించింది. గోబో బావురుమన్నాడు. ఆ అరపు హృదయ విదారకంగా వినిపించింది.

బేంబి ఒంటరిగా సెలయేటి ఒడ్డున నడుస్తున్నాడు. రెల్లు పొదలలోనుంచి వాగు వంకర టింకరగా నెమ్మదిగా ప్రవహిస్తోంది. బేంబికి ఇప్పుడు ఒంటరితనం ఇష్టం. తరుచుగా వాగు గట్టుకు వస్తున్నాడు.

ఈ ప్రాంతాల్లో బాగా నలిగిన దారులు లేవు. కనుక, తనవాళ్లెవరైనా కనిపిస్తారనే భయం లేదు.

బేంబిలో ఈమధ్య చాలా మార్పు వచ్చింది. ఎప్పుడూ ఆలోచనల్లో ఉంటున్నాడు. ముఖంలో విచారం గూడు కట్టుకుంది. అతనికి జీవితం అంతా నిరాశామయంగా కనిపిస్తోంది. అసలు తానలా ఎందుకు తయారయాడో అతనికే తెలియదు. తెలుసుకోవాలనే ప్రయత్నమూ లేదు. ఏవేవో అస్పష్టమైన ఊహాలు వచ్చేవి. ఆలోచించబోతే అలసట అనిపించేది. ఊరుకునేవాడు.

ఏటిఒడ్డున చాలాసేపు కదులుతూన్న నీళ్ళనుచూస్తూ నిలుచోనడం అలవాటైంది. నీటిమీదుగా వచ్చే ఆ చల్లని గాలి ఏదో తెలియని క్రొత్త వాసనలతో మనస్సుకు ఊరట కలిగించేది.

కాస్త లోతుగా వెడల్పుగా ఉన్నచోట వాగులో బాతులు తిరుగాడేవి. ఒకటీ రెండూ కాదు. వందలూ, వేలూనూ. అది ఒక బాతులరాజ్యం. తెలివిగా, ప్రేమగా

కబుర్లు చెప్పుకుంటూ ఉండేవి. క్వాక్! క్వాక్! అంటూ అరుస్తూంటే వాటిని చూస్తూ బేంబి ఎంతసేపైనా నిలబడేవాడు.

తల్లి బాతులు బాతుకూనల్ని వెంటబెట్టుకుని ఒడ్డు వెంబడే ఈదుకుపోతూ ఉండేవి. వాటికి విసుగు అంటూ లేదు. ఎప్పుడూ ఏవో కొత్త కొత్త సంగతులు పిల్లలకు నేర్పుతూ ఉండేవి.

ఉన్నట్లుండి తల్లిబాతులు ప్రమాదసూచకంగాఅరిచేవి. ఆ అరుపు వినీవినగానే బాతు పిల్లలన్నీ చడీ చప్పుడూ చేయకుండా గబ గబా తలో మూలకూ పారిపోయేవి.

ఎగరడం చేతకాని బాతుకూనలు చటుక్కున రెల్లు పొదలలోకి ఈదుకుపోవడం బేంబి గమనించాడు. రెల్లుగడ్డి కదిలి తామున్నచోటు తెలిసిపోకుండా ఎంతో లాఘవంగా బాణాల్లాగ దూసుకుపోవడం చూసి బేంబి ఆశ్చర్యపడ్డాడు. అంతలో తల్లి నెమ్మదిగా పిలిచేది. పిల్లలన్నీ గబగబా గడ్డి దుబ్బులలోంచి ఇవతలికి వచ్చేసి, ఒకచోట గుమిగూడేవి. ఏమీ జరగనట్లే ప్రశాంతంగా ఈదులాడుతూ ఉండేవి. ఇదంతా గారడీలా కనిపించి బేంబి ఆశ్చర్యపడ్డాడు.

ఒకసారి తల్లిబాతును పిలిచి అడిగేడు.

"ఇంతకుముందే మీరు ప్రమాదం సూచిస్తూ అరిచేరు. నేను ఎంత జాగ్రత్తగా పరిశీలించినా నాకు ప్రమాదం ఏమీ కనిపించలేదు. మరి తమరు అల్లా ఎందుకు అరిచారో తెలుసుకో వచ్చునా?"

"ఏమీలేదు" అని మామూలుగా అంది బాతు.

మరోసారి ఒక బాతుకూన ప్రమాద సూచకంగా అరిచింది తల్లి ననుకరిస్తూ. అల్లా అరుస్తూనే రివ్వున రెల్లు గడ్డిలో దూరి బేంబి నిలుచున్న గట్టు దగ్గరికి వచ్చింది.

"ఏం జరిగిందీ? నా కేమీ కనిపించలేదే?" అన్నాడు, బేంబి ఆ పిల్లతో.

"అఁ — ఏమీ లేదు" అంది బాతుపిల్ల.

ఒక నిమిషం ఉన్నాక ఆ బాతుకూన తన చిన్నారి తోక ఈకలు ఝాడించి, రెక్కల అంచులు వాటిమీద తమాషాగా ఆనించి మళ్ళీ నీళ్ళలోకి దిగింది.

బాతుల తెలివి తేటలమీద ఎంతో సదభిప్రాయం ఉన్న బేంబికి ఆ బాతుపిల్ల మాటలు నమ్మకం కలిగించలేదు. తనకన్న వాటి కళ్లు, చెవులు బహు తీక్ష్ణం కాబోలు అనుకున్నాడు. వాటిని చూస్తూ గడుపుతూంటే ఈమధ్య తంలో జరిగిన విచారకరమైన సంఘటనలతో వ్యాకులమై పోయిన అతని మనస్సు స్థిమిత పడినట్లు ఉండేది.

బాతులతో కబుర్లు చెప్పడం బేంబికి చాలా ఇష్టం. అడవిలోని మిగిలిన జీవుల్లా ఇవి వ్యర్థ ప్రసంగాలు చెయ్యవు. గాలిని గురించి, నీళ్ళను గురించీ, తియ్యని మెత్తని గడ్డి దొరికే బహు దూరపు చెలకలను గురించీ చెప్పేవి.

దూరంగా అవతలి ఒడ్డున రంగు రంగుల మెరుపులా ఏదో కొత్త పిట్ట ఎగురుతూ కనిపించింది. తనలో తానే "షిర్ ర్ ర్ ర్!" అంటూ నెమ్మదిగా అరిచేది. ఎగురుతూ ఎగురుతూన్నది చటుక్కున నిలిచిపోయేది. రెక్కలు గబగబా ఆడిస్తూన్నా ఒక్కచోటనే నిలబడి ఉండేది. ఉన్నట్లుండి

రెక్కలు ముడిచి, ముక్కు కిందికిపెట్టి, రంగు రంగుల రాయిలా నీళ్ళల్లో పడిపోయేది. మళ్ళీ అంతలో లేచి, రెక్కలు దులుపుకుని ఎగిరిపోయేది.

బేంబి అంత అందమైన పిట్టను ఇదివరకు చూడలేదు. దాని అందానికీ, దాని చేష్టలకూ అతడు ముగ్ధుడైపోయాడు. దానితో ఏలాగైనా పరిచయం కల్పించుకోవాలనే ఉద్దేశంతో చాలాసార్లు గొంతెత్తి పిలిచాడు. కాని, లాభం లేక పోయింది.

"మీారు పిలవడం దండుగ. అతడు మీాకు సమాధానం ఇవ్వకేం!" అంటూ నీటికాకి గొంతుక వినిపించింది.

బేంబి అటూ ఇటూ చూశాడు. ఎవరూ కనబడ లేదు.

"మీారు ఎక్కడ ఉన్నారు?"

"ఇక్కడ" అంటూ పక్కనున్న రెల్లు దుబ్బుల్లోనుంచి వినిపించింది. "ఆ లకుముకి పిట్టకి ఎంత అతిశయం, ఎక్కడి కేదర్రి! ఎవ్వరితోటీ మాట్లాడదు. కనక మీారు కష్టపడి పిలవడం అనవసరం."

"ఆ పిట్ట చాలా అందంగా ఉంది."

"దాని మొహం" అంది నీటికాకి రెల్లులో మరో చోట తేలి.

"ఏం అల్లా అన్నారూ?"

"దానికో సరదా లేదు, చట్టుబండలూ లేదు. లోకం అంతా మసి అయిపోయినా దానికి అక్కర లేదు. ఇతరుల యోగక్షేమాలు దానికి అక్కర లేదు. ఇతరులు అడిగినా

సమాధానం ఇవ్వదు. దగ్గర్లోనే ప్రమాదం ఉంటుందా, తనకి తెలిసినాసరే చెప్పదు. అరిగిపోతుందో, ఏమో ? అది ఇంతవరకూ ఎవరితోనైనా మాట్లాడుతూండగా నేను చూడలేదు."

"పిచ్చిపిట్ట!" అన్నాడు బేంబి.

నీటికాకి ఈసారి కలువల మాటుకుచేరి మాట్లాడ సాగింది.

"రెండో మూడో తప్పించి తన రంగుల్ని కూడా ఎవ్వర్నీ చూడనివ్వదు, ఎవరో ఎత్తుకుపోతా రన్నట్లు."

"మరి మీరుకూడా సరిగ్గా చూడనివ్వరుకదా ?" అన్నాడు బేంబి.

నీటికాకి బేంబి ముందుకు వచ్చింది. పొడుగుపాటి మెడ బాగా సాగదీసుకుంది. నిగ నిగలాడే నలుపు. అయితే అందంగా, నాజూగ్గా ఉంది. మళ్లీ అంతలో చటుక్కున నీళ్లల్లో మునిగిపోయింది. సెలయేటి రెండోవేపున తేలింది.

"అబ్బ! అంతంతసేపు ఒక్కచోట నిలబడడం నావల్ల కాదు సుమండీ. నాకు విసుగు" అంది. అంటూ బుడుం గున మునిగి ఇంకోచోట తేలింది.

"చాలాకాలం బ్రతకాలంటే, హాయిగా జీవించాలంటే తిరుగుతూ ఉండాలి."

ఇంతలో దగ్గర్లో గరికగడ్డి కదులాడింది. బేంబి చెవులు రిక్కించాడు. జాగ్రత్తగా చూశాడు. ఏటిగట్టున గడ్డిలో ఏదో బూడిద రంగు జీవం తళుక్కుమని మాయమైంది. ఘాటు వాసననుబట్టి అది నక్క అని అర్థమైంది. అరుద్దామని

నోరు తెరిచేలోగానే రెల్లు గడ్డిలో ఏ దో జరిగినట్టు చప్పుడు. ఒక బాతు బాధగా కీచుమంది. రెక్కల టపటప. నక్క నోటిలో చిక్కుకుని జాలిగా అరుస్తూన్న బాతు గడ్డిలో నుంచి ఒక్కమాటు కనిపించింది. మళ్ళీ గడ్డిలో మూసుకుపోయింది. మరో నిమిషంలో బాతును నోట కరుచుకుని ఓరకంటితో బేంబిని వెకిలి నవ్వుతో చూస్తూ నక్క సంతోషంగా చెట్ల గుంపులలో కలిసిపోయింది.

బేంబి నిర్విణ్ణుడై నిలుచున్నాడు. రెండు ముసలి బాతులు "క్వాక్!" అని గట్టిగా అరుస్తూ గాలిలోకి లేచేయి. నీటికాకి అపాయాన్ని సూచిస్తూ బలంకొద్దీ అరిచింది. ఆకంఠం ఏక సమయంలో ఎన్నో చోట్లనుంచి ప్రతిధ్వనించి నట్లైంది. ఏటిఒడ్డున పొదలమీద పిచికలు కంగారుగా అరిచేయి. రెల్లు పొదలో బాతు పిల్లలు "అమ్మా!" అని అరిచేయి. వాగు మీదుగా రంగు రంగుల రెక్కలు ఆడించుకుంటూ లకుముకి పిట్ట విలాసంగా ఎగిరింది.

"మీరు మా అమ్మని చూశారా?" అని బాతుపిల్లలు ఏడుపు ముఖాలతో అడిగేయి.

"షిర్ర్ర్! బాగుంది. మీ అమ్మతో నాకేం పని?" అని ఎగిరి వెళ్ళిపోయింది, లకుముకి పిట్ట.

బేంబి నడిచి పోసాగేడు. తుమ్మల బీడు దాటేడు. తేగు డొంకలు వెనుకబడ్డాయి. సీమచింతలు దాటేడు. అతడు ముసలి నాయకుణ్ణి కలుసుకోవాలని వెతుకసాగేడు. గోబో చనిపోయాక ఆయన్ను మళ్ళీ కలుసుకోనేలేదు. చివ రికి నాయకుడు దూరంలో కనిపించాడు. ఒక్క పరుగున

ఆయనను కలుసుకున్నాడు.

ఇద్దరూ కొద్దిసేపు మౌనంగా పక్క పక్కనే నడిచారు. కొంతసేపటికి ముసలి నాయకుడు ప్రశ్నించాడు.

"మీరంతా అతణ్ణి తరుచు తలుచుకుంటూ ఉంటా రనుకుంటాను.

'అతడు, ఎవరో బేంబికి అర్థం అయింది — గోబో.

"తెలియదండి. నేనీ మధ్యన ఒంటరిగానే తిరుగు తున్నాను. నామటుక్కి నాకు తరుచు జ్ఞాపకం వస్తూనే ఉంటాడు,"

"అంటే నువ్వు ఇప్పుడు ఒంటరిగాడివన్న మాట?"

"ఊఁ" అని బేంబి నాయకుని ముఖంలోకి చూశాడు.

నాయకుడు మాటాడలేదు. ఇద్దరూ ముందుకు నడిచారు. ఉన్నట్లుండి నాయకుడు చటుక్కున ఆగేడు.

"నీ కేమైన వినబడుతోందా?"

బేంబి చెవులు రిక్కించాడు. ఏమీ వినబడలేదు.

"పోదాం. నడు!" అని నాయకుడు ముందుకు దారి తీశాడు. బేంబి ఆయన వెనకనే పరుగెత్తేడు.

"ఈమాటూ ఏమీ వినబడడం లేదూ?"

ఈమారు బేంబికి ఏదో అస్పష్టమైన చప్పుడు వినిపించింది. ఎక్కడో, ఎవరో ఎగిరి దూకుతున్నట్లూ, కొమ్మలు వంచుతున్నట్లూ అనిపించింది. అంతలో దబ్బున ఏదో నేలను పడిన శబ్దం.

బేంబి వెనక్కు పారిపోవడానికి సిద్ధం అయాడు.

"నడు, అల్లా వెడదాం" అని నాయకుని ఆజ్ఞ. శబ్దం

వినవచ్చిన దిశగా ఆయన వేగంగా పరుగెత్తుతున్నాడు. తానూ ఆయన వెనువెంటనే పరుగెత్తేడు, బేంబి.

"అక్కడ ప్రమాదం ఏమీ లేదాండి?" అని అడిగాడు బేంబి.

"లేకపోనడమేమిటి? బోలెడంత ఉంది."

ఇద్దరూ త్వరలో ఓ రేగుచెట్టు దగ్గరకు వచ్చారు. ఎవరో పట్టుకుని కిందికి లాగి మళ్ళీ విడిచిపెడుతున్నట్లు దాని కొమ్మలు కిందికీ మీదికీ ఊగిసలాడుతున్నాయి. ఇంకా దగ్గరకు వచ్చాక తుప్పలు కొట్టేసి చేసిన సన్నని దారి కనిపించింది. అక్కడ నేలమీద దొర్లాడుతూన్న తన దోస్తు కుందేలు కనిపించాడు. అతడు ఓమాటు అటూ ఓమాటు ఇటూ పరుగెత్తుతున్నాడు. అంతలో కొయ్యబారిపోతాడు. మళ్ళీ పరుగెత్తబోతాడు. అతడు కదలినప్పుడెల్లా రేగు కొమ్మలూ కదులుతున్నాయి.

బేంబికి ఏదో సన్నని దారంలాంటిది కనిపించింది. దానికి ఒక చివర రేగుకొమ్మకు కట్టిఉంది. రెండో చివర కుందేలు మెడకు తగులుకుని ఉంది.

ఎవరో వస్తున్నట్లు విన్నాడో ఏమో కుందేలు ఒక్క గంతు వేశాడు. పడిపోయాడు. మరోగంతు. పారిపోవాలని గట్టి ప్రయత్నం. కాని సాధ్యం కాలేదు. నిరాశా నిస్పృహలతో ఆయాసపడుతూ నేలమీద పడిపోయాడు.

"కంగారు పడకు. నేనే. భయపడకు" అన్నాడు, నాయకుడు దగ్గరగా వచ్చి.

దయ, ప్రేమ నిండిన ఆయన గొంతుక విని బేంబి

ఊగిపోయాడు.

"భయపడకు. కదలకు. ఏమాత్రం కదలకూడదు సుమీ!" అన్నాడు మళ్ళీ నాయకుడు.

కుందేలు ఆయన చెప్పినట్లు వింది. కదలకుండా పడుకుంది. దాని గుండెలు ఎగిసి పడుతున్నాయి. శ్వాస బరువుగా వస్తూంది.

నాయకుడు నోటితో రేగుకొమ్మను కిందికి వంచేడు. కాలితో నొక్కిపట్టేడు. కొమ్మల సందున కొమ్మను బిగియ బట్టి ఒక్క ఊపుతో దాన్ని విరిచేశాడు.

అది అయాక కుందేలును హెచ్చరించాడు.

"ఎంత నెప్పిపుట్టినా కదలకు సుమా!"

ఆయన తల పక్కకు వంచి ఒక కొమ్మ చివరి భాగాన్ని కుందేలు మెడ దగ్గర మెత్తని బొచ్చులో గుచ్చి ముడికోసం వెతికేడు. కుందేలు క్షణకాలం గిలగిలలాడింది. నాయకుడు వెంటనే పట్టు వదిలేశాడు.

"కదలవద్దు. కదిలితే చచ్చిపోతావు సుమీ!"

మళ్ళీ ఆయన తన పని మొదలుపెట్టేడు. కుందేలు కదలకుండా పడుకుంది. వాళ్ళిద్దర్నీ ఆశ్చర్యంగా చూస్తూ బేంబి నిలబడ్డాడు.

నాయకుని కొమ్మ కుందేలు మెడ దగ్గర బొచ్చులో లోతుగా దూరి ఆఖరికి ముడికి సరిగ్గా తగులుకుంది. ఆయన తల నేర్పుగా కదిలిస్తూ కొమ్మను ముడిలోకి దూర్చేడు. అది కొద్దిగా వదులయింది.

కుందేలు బాధ భరించలేక గట్టిగా అరిచింది.

"నోరు మూసుకో!" అన్నాడు నాయకుడు కొంచెం మందలింపుగా.

ఏడుస్తూన్న కుందేలును చూస్తూంటే నాయకుడు అతణ్ణి చంపేస్తున్నాడా అనిపించేటట్లుంది.

"చాల్లేవయ్యా ఏడుపు!"

నాయకుని కంఠంలో మామూలుగా వినబడే కాఠిన్యం మచ్చుకైనా లేదు.

"ఏ నక్క అయినా ఇల్లా రావాలని ఉందా ఏమిటి?" అంటూ ఆయన జాగ్రత్తగా నెమ్మదిగా తన పనిలో మునిగి పోయాడు.

ఉన్నట్లుండి ముడి పటుక్కుమంది. మెడ ఉచ్చు జారి పోయిందనీ, తనకు స్వేచ్ఛ లభించిందనీ కుందేలుకు ముందర తెలియనే లేదు. రెండడుగులు వేశాడు. భయపడుతూ నెమ్మదిగా ఎగిరేడు. తరువాత ధైర్యంగా ఎగిరేడు. అంతలో కాళ్లు విసిరి బలంకొద్దీ పరుగెత్తేడు.

జేంబికి కోపం వచ్చింది.

"ఆఖరికి కృతజ్ఞత చెప్పాలని అయినా తెలియదా?"

"వాడికి పోయిన మతి ఇంకా రాలేదు, పోనిద్దూ!" అన్నాడు నాయకుడు.

ఉచ్చు నేలమీద పడిఉంది. చూడడానికి అసలు అందులో అపాయం ఉన్నట్లేలేదు. జేంబి దాన్ని నెమ్మదిగా కాలి గిట్టతో రాసేడు. సన్నని ధ్వని వినిపించింది. భయపడి కాలు తీసేసేడు. మామూలుగా తనకు పరిచయమైన ధ్వనుల వంటిది కాదది.

"మనిషా?" అన్నాడు బేంబి నెమ్మదిగా.

ముసలి నాయకుడు తల ఊపేడు.

వారు నెమ్మదిగా అక్కడనుంచి కదిలి వెళ్ళిపోయారు.

ఒక్క సంగతి జ్ఞాపకం ఉంచుకో. చెట్లు కొట్టేసిన సన్నని దారిలోనుంచి వెళ్ళదలుచుకుంటే ముందు జాగ్రత్తగా కొమ్ములు చూసుకో. కొమ్ములు ముందుకుపెట్టి పైకీ కిందకీ ఆడించు. ఇప్పుడు వినిపించిన చిత్రమైన చప్పుడు వినిపిస్తే, వెనక్కి జరగాలి. నెత్తిమీద కిరీటంలేని రోజుల్లో అయితే మరింత జాగ్రత్తపడాలి. అటువంటప్పుడు సన్నదారుల వెంట అసలు తిరగనేవద్దు."

దీర్ఘాలోచనలో మునిగి బేంబి మౌనం వహించాడు.

"అతడు ఇక్కడ లేనేలేడు" అన్నాడు బేంబి చాలా ఆశ్చర్యం కనబరుస్తూ.

"అవును. ప్రస్తుతం అడవిలో లేడు" అన్నాడు నాయకుడు.

"లేడు. కాని ఉన్నాడు" అన్నాడు బేంబి.

నాయకుడు బేంబికేసి తీక్షణంగా చూశాడు.

"మీ గోబోకూడా ఇల్లాగేకదూ అన్నాడు? అమాయకుడు. అత చేయలేనిది లేదు అన్నాడు. అంతటి దయాసముద్రుడు లేడట.

"అతణ్ణి దయాసముద్రుడు అనడం ఎంత నిజమో ఇదీ అంతే నిజం" అన్నాడు నాయకుడు. ఆయన కళ్ళలో కోపం బాగా కనిపించింది.

"మరి గోబో విషయంలో అతడు దయగానే ఉన్నాడు

కదా?" అన్నాడు బేంబి అనుమానిస్తూ.

"నువ్వుకూడా అల్లాగే అనుకుంటున్నావా, బేంబీ!"

బేంబిని నాయకుడు పేరుపెట్టి పిలవడం అదే మొదటి సారి.

బేంబి ఆలోచనలో పడ్డాడు.

"తెలియదు. నాకేమీ తెలియదు."

నాయకుడు నెమ్మదిగా ఆచి ఆచి చెప్తూ వెనుదిరిగి పోయాడు.

"జీవితాన్ని అర్థం చేసుకో. జాగ్రత్తగా ఉండు."

ఆ రోజున బేంబికి పెద్ద ప్రమాదం జరిగింది.

తెల తెలవారబోతూంది. అడవిలో అంతటా దట్టమైన తెరలా పొగమంచు కమ్మి ఉంది. అడవి అంతా నిశ్శబ్దంగా ఉంది. చల్లని ఉత్తరమైనగాలి తెరలు తెరలుగా వీస్తూంది. కాకులు, గోరింకలు ఇంకా నిద్ర లేవలేదు. గిజిగాళ్ళు గూళ్ళలో వెచ్చగా నిద్రపోతున్నాయి.

ఆ రాత్రే బేంబిని ఫలీనా దారిలో కలిసింది. ఆమె సిగ్గుపడుతూ బేంబికేసి విచారంగా చూసింది.

"నేను ఒంటరిదాన్ని అయిపోయాను"అంది నెమ్మదిగా.

"నేనూ అంతే" అన్నాడు బేంబి విచారంగా.

"నాతో కలిసి తిరగడమే లేదు నువ్వు ఈ మధ్యని" అంటూ ఆమె సమాధానంకోసం ఎదురు చూసింది. ఆ చూపులో వెనుకటి సంతోషం, హుషారు లేవు. ఆమె స్వభావం చాలా మారిపోయింది. నెమ్మదితనం, ఏదో నిండుతనం వచ్చాయి ఆమెలో. ఆమెను ఊరడిస్తూ బేంబి

ఏదేదో చెబ్దా మనుకున్నాడు. కాని, ఏమీ చెప్పలేక పోయాడు.

"అయితే నేనంటే నీకు ప్రేమ లేనట్టేనా ?" వినపడీ వినపడకుండా అడిగింది ఫలీనా.

"నాకు తెలియదు" అన్నాడు బేంబి ఎటో చూస్తూ.

ఫలీనా మరి ఇంక మాట్లాడలేదు. నెమ్మదిగా నడుస్తూ ఆమె తన దారిని వెళ్లిపోయింది.

మైదానపు పొలిమేరలో ఉన్న ముసలి జువ్వికింద బేంబి నిలుచబడ్డాడు. పరిశుభ్రమైన చిక్కని చల్లని గాలి నిండుగా పీల్చుకున్నాడు. తెల్లవారుఝామున పడే మంచులో తడిసి చెట్ల మధ్యనుంచి గడ్డిమీదుగా, నేలమీదుగా ఈదు కుంటూ వస్తూన్న ఆ గాలి తగులుతూంటే ఎంతో హాయిగా ఉంది. మనస్సు ఎంతో తేలిక పడింది. ఈ మధ్యను ఎన్నడూ లేనంత ఉత్సాహం కలిగింది. హుషారుగా పొగమంచు ముసు గులో ఉన్న మైదానంలో ప్రవేశించాడు.

ఇంతలో పెద్ద ఉరుము !

బేంబి అదిరిపోయాడు. ఆ అదరిపాటుకు కాళ్ళు ఈడి గిల బడ్డాయి. చెప్పలేని భయంతో ఎగిరేడు. వెనుకవు దుమికి చెట్ల వరుసలో దూరేడు. ఏం జరిగిందో అతని కేమీ అర్థం కాలేదు. ఏ ఆలోచనా నిలవడంలేదు. ఒకటే అంతు లేని కోరిక. పరుగెత్తాలి. పరుగెత్తాలి. అంతే. భయం గుండెల్ని నొక్కేస్తూంది. ఊపిరి పీల్చడమే కష్టంగా ఉంది. అంతలో సూదులు గుచ్చుతున్నట్లు బాధ. కుడి తుంటిమీద భరించరాని నెప్పి. అనుకోకుండానే పరుగు ఆపేడు. నడుస్తూ

న్నాడు. అంతలో అదీ మందగించింది. వెనుక కాళ్ళు బిరు వెక్కి పోయాయి.. నేలమీద చతికిలబడిపోయాడు.

'ఏమీ ఆలోచించకుండా, కదలకుండా అల్లాగే పడు కుని ఉండిపోతే, ఎంత బాగుంటుందో' అనుకున్నాడు.

"లేవాలి, బేంబీ! లే!"

ఎవరో భుజం మీద తట్టుతున్న ట్లనిపించింది. బరువుగా వాలిపోతూన్న కనురెప్పల్ని బలవంతంగా పైకి ఎత్తేడు. ఎదురుగా ముసలి నాయకుడు!

"బేంబీ! లేవాలి."

నాయకుని అధికార యుతమైన కంఠంలో మార్దవం మిళితమై వినిపించింది. శరీరాన్ని కోసేస్తూన్నట్లున్న బాధ కాస్త ఉపశమించినట్లైంది.

"లేవాలి! లే!" బలమైన గంభీరమైన నాయకుని కంఠంలో మొదటి మాటుగా వణుకు వినిపించింది.

"లే, నాయనా! పారిపోవాలోయ్!"

నాయనా అన్న మాట అనుకోకుండానే నాయకుని హృదయం చీల్చుకుని వచ్చింది. చటుక్కున లేచి బేంబి నిలబడ్డాడు.

"అదీ!" అని నాయకుడు తల ఊపేడు. బరువుగా నిశ్వసించాడు.

"నాతో రా! పోదాం! ఇహ నాతోనే ఉందువుగాని."

బేంబి ఆయనతోపాటు ముందుకు అడుగు వేయ బోయాడు. కాని, నేలమీద చతికిలబడిపోయి, కళ్ళు మూసు కుని, సర్వం మరిచి, అల్లాగే ఎంతకాలమైనా ఉండిపోవాలనే



ఎవరో భుజంమీద తట్టుతున్నట్లని పించింది

పుట 199

మనస్సులో కోరిక బలమైపోతూంది.

బేంబి మనస్సును నాయకుడు గ్రహించాడు.

"ఇప్పుడు ఎంత నెప్పి అయినా ఓర్చుకోవాలి. విశ్రాంతి కిది సమయంకాదు. దానిమూలే పనికిరాదు. తప్పించుకు పోవడం తప్ప ఇప్పుడింకో ఆలోచనే వద్దు. వినపడిందా? పరుగెత్తాలి. లేకపోతే ప్రాణాపాయం సుమీ! వాడు వచ్చేస్తాడు. దయాదాక్షిణ్యమూ లేదు. నిన్ను చంపేస్తాడు. ఊఁ! అడుగు ముందుకు వెయ్యి ... అదీ!... అల్లాగే!... అల్లాగే, బాబూ!...అదే!...రా పోదాం!..."

బేంబికి ఏమీ ఆలోచించడానికీ శక్తి లేదు. ప్రతిఅడుగూ బల్లెంతో పొడిచినంత బాధ కలిగిస్తూంది. ఒళ్ళంతా పచ్చి పుండులా ఉంది.

నాయకుడు తిన్నని దారిపట్టక పెద్ద పెద్ద సున్నలు చుడుతున్నాడు. ఆ నడక అంతులేనట్లనిపించింది బేంబికి. ఇంతసేపూ నడుస్తే మళ్ళీ ఆ ముసలి జువ్విదగ్గరకే వచ్చినట్లు అంత బాధలోనూ గ్రహించాడు.

నాయకుడు ఆగి నేల వాసన చూసి, నెమ్మదిగా అన్నాడు:

"ఇక్కడే ఎక్కడో దగ్గర్లోనే వాడూ, వాడి కుక్కా ఉన్నారు. పోవాలి త్వరగా."

ఇద్దరూ పరుగెత్తేరు. ఒకచోట నాయకుడు చటుక్కున ఆగేడు.

"ఇదిగో, నువ్వు ఇక్కడే పడిపోయావు. చూశావా?"

గడ్డి నలిగి ఉన్నది అక్కడ. రక్తపు మడుగు. నల్లని

చిక్కని నెత్తురు గడ్డిమీద పరుచుకునిఉంది.

నాయకుని ముక్కుపుటాలు అదిరేయి.

"వాసన తెలుస్తోందా? బేంబీ! వాళ్లు ఇప్పుడే ఇక్కడికి వచ్చి వెళ్ళేరు. వాడూ వాడి కుక్కానూ. రా పోదాం."

ఇద్దరూ ముందుకు వెళ్ళేరు. నేలమీది నెత్తుటి చుక్కలు కనబడ్డాయి బేంబికి.

"మనం ఈ దారివెంటే ఇంతకుముందే వెళ్ళేం" అని చెప్పాలనుకున్నాడు. కాని, మాట్లాడలేకపోయాడు.

"వాళ్ళని తప్పుదారి పట్టించాం. నడు" అన్నాడు, నాయకుడు తృప్తిగా ఊపిరి విడుస్తూ.

మరికొంతసేపు బేంబిని వెనుకటి దారినే తీసుకువెళ్ళి, తరువాత మరో పెద్ద వలయం చుట్టసాగేడు.

బేంబి నాయకుని వెంట అర్ధ జాగ్రదవస్థలో నడుస్తున్నాడు. అప్పుడే రెండోసారి ముసలి జవ్వని రెండో దిశ నుంచి సమీపించారు. బేంబి పడిపోయిన చోటును రెండోసారి కూడా టేరు. నాయకుడు మరో దిశనుంచి మరోమారు వలయం తిరుగసాగేడు.

"ఇదిగో! ఇది తిను!"

నాయకుడు ఆగి, బేంబికి ఏదో చెట్టు ఆకు చూపించాడు. ముదురు ఆకుపచ్చ రంగులో, నూగుతో, జిడ్డు జిడ్డుగా, నొక్కులు నొక్కులుగా ఉన్న చిన్న ఆకుల తుప్ప అది.

నాయకుడు చెప్పినట్లు చేశాడు బేంబి. ఆ ఆకులు చేదుగా ఉన్నాయి. కడుపో వచ్చేటంత వాసన.

కొంతదూరం నడిచేక నాయకుడు అడిగేడు.

"ఇప్పు డెల్లా ఉంది ?"

"కొంచెం నయం."

ఉన్నట్లుండి బేంబికి నోట మాట వచ్చింది. మూసుకు పోతూన్న కళ్ళు తెరుచుకున్నాయి. మనస్సు తెరిపి ఇచ్చింది. అలసట తగ్గింది.

"ఇహ ముందుకు పోవాలి." నాయకుడు ఆజ్ఞాపించాడు.

బేంబి ముందర, అతని వెనుక నాయకుడు. ఇద్దరూ చాలా దూరం నడిచేరు.

"అమ్మయ్య! ఇంతసేపటికి......" అన్నాడు సంతోషంగా నాయకుడు.

బేంబి వెనుదిరిగి చూశాడు.

"గాయంలోంచి రక్తం కారడం ఆగింది. నెత్తురు ఇంక గడ్డిమీద పడదు. వాడికీ, వాడి కుక్కకీ నీ ఆచూకీ ఇంక తెలియదులే" అని వివరించాడు నాయకుడు.

ఆయన అలసిపోయినట్లు కనిపించాడు. కానీ, కంఠంలో ధైర్యం దీపిస్తూనే ఉంది.

"రా పోదాం! ఇహ నీకు విశ్రాంతి అవసరం."

కొంతసేపటికి ఇద్దరూ పెద్ద వాగు దగ్గరకు వచ్చారు. నాయకుడు వాగులోకి దిగి నాలుగైదు గంతులలో నిటారుగాఉన్న ఆవలిగట్టు ఎక్కేశాడు.

బేంబి ఆయనను అనుసరించాడు. కాని, ఎంత ప్రయత్నించినా ఆవలిగట్టు ఎక్కలేకపోయాడు. బాధ మళ్ళ మొద



లైంది. కాలుజారింది. పడిపోయాడు. లేచి మళ్ళీ ఎక్కేడు. కొంత దూరం ఎక్కి, తూలి వెనక్కి పడిపోయాడు.

గట్టుమీద నిలుచున్న నాయకుడు హుషారు చేస్తున్నాడు.

"ఇప్పుడు నేనుచేయగలిగిందేమీ లేదు. నువ్వు పైకిఎక్కాలి. తప్పదు. వింటున్నావా? పైకి ఎక్కితీరాలి."

భరించరాని బాధతో, బలం అంతా కూడ దీసుకుని బేంబి గట్టు ఎక్కేడు. ఇంక పిసరంత ఓపికకూడా లేదనిపించింది. బాధ గుండెల్ని నలిపేస్తూంది.

"గాయం రేగి మళ్ళీ రక్తం కారుతోంది. అయితే ఇదివరకటి అంత కాదులే. ఇల్లా అవుతుందని నాకు తెలుసును. అయినా, ఇప్పుడు మనం భయపడవలసిన పనేమీ లేదు:

ఆకాశం ఎత్తున పెరిగిన వెలగతోపులోనుంచి నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ఇద్దరూ నడుస్తున్నారు. నేల గట్టిగా, నున్నగా ఉండడంచేత కాళ్ళకుపట్టు" దొరకడంలేదు. నడక దుర్భరంగా ఉంది.

నేలమీద చతికిలబడిపోయి ఏమీ ఆలోచించకుండా

కళ్ళు మూసుకుని ఉండిపోవాలనే కోరిక జేంబిలో మళ్ళీ తల ఎత్తింది! పెద్ద పెట్టున జ్వరం వచ్చినట్లుంది. తల పగిలి పోతుందేమో అన్నట్లుంది. కళ్ళ ముందర నల్లని తెర కప్పి నట్లు దృష్టి మందగించింది. విశ్రాంతి. విశ్రాంతి. అది తప్ప మరో ఆలోచనే లేదు. జీవితం అంతా ఒక్క క్షణంలో ఎల్లా మారిపోయిందీ, అన్న ఆశ్చర్యం కలిగింది.

'అసలు ఎప్పుడేనా నేను ఆరోగ్యంగా, బలంగా ఉండే వాడినా?' అని అనుమానం కలిగింది.

అవునవును... ఈ రోజు ఉదయమే... ఎంతో సేపు అవనేలేదు. కాని, ఎప్పుడో... ఎప్పుడో.... ఎవ్వరూ ఎరగ నంతకాలం జరిగిపోయినట్లు అనిపించింది.

అల్లాగే నడిచేరు. సీమ చింతలు దాటేరు. బొగడలు దాటేరు. బ్రహ్మాండమైన నేరేడు. విరిగిన కొమ్మలూ అదీ, దారి కడ్డంగా ఉంది.



"వచ్చేశాం."

ఎక్కడో నిద్రలో వింటున్నట్లు నాయకుని కంఠం వినిపించింది.

బాధతో, కళ్లు మూసుకుని అలసటగా, ఆ ధ్వని వినిపించిన వేపు జేంబి అడుగు వేశాడు. చటు

క్కన గోతిలోకి దొర్లిపోయాడు.

"అల్లాగా!" అన్నాడు నాయకుడు సంతృప్తిగా.

"కొంచెం జరుగు.... చాలు. ఇంక నిద్రపో!"

బేంబి పడిపోయిన గోయి, విరిగిన నేరేడు చెట్టుకింద ఉంది. లోతుగా, విశాలంగా, గుహలా ఉంది. రేగు పొదలూ, సీమచింతలూ, గడ్డీ గాఢం పట్టంగా పెరిగి దానిని కప్పేస్తున్నాయి. వెలుగు చొరని వాటి నీడలో పడుకున్నాడు బేంబి.

"పడుకో! ఇక్కడ నీకేమీ ప్రమాదం ఉండదు."

రోజులు గడిచేయి.

బేంబి వెచ్చని భూదేవి ఒడిలో పడుకున్నాడు. మొదట అతనికి బాధ రోజు రోజుకూ పెరుగుతున్నట్లనిపించింది. శరీరం అంతటా సూదులతో పొడుస్తున్నట్లుండేది. మెల్లిగా జ్వరం తగ్గింది. నెప్పి తుంటికి మాత్రమే పరిమితమైంది. రోజులు గడిచినకొద్దీ అదికూడా మెల్లిమెల్లిగా తగ్గింది.

మొదట్లో అతి ప్రయత్నంమీద లేచి నిలబడడానికి బేంబి ప్రయత్నించాడు. కాళ్ళు బలహీనంగా ఉన్నాయి. తరువాత ఒకటి రెండు అడుగులు వేయడానికి ధైర్యంచేశాడు. అప్పుడప్పుడు ఆ గోతిలోంచి బయటికి వచ్చి, తన ఆహారం తానే సంపాదించుకోడానికి ప్రయత్నించాడు.

ఇదివరకెప్పుడూ వాసనకూడా చూడని గడ్డి ఇప్పుడు తింటున్నాడు. ఆఖరికి శీతాకాలంలో ఎప్పుడూ ఏమీ దొరకనప్పుడుకూడా దాని నతడు ముట్టుకోలేదు. ఇప్పుడు దానికి

చిత్రమైన ఒక రుచి ఉంది అనిపించింది. దాని వాసన ఇప్పుడు ఇష్టం అవుతూంది. ఇదివరలో తినిన తియ్యని మెత్తని గడ్డి కన్న ఇది కొంచెం ఘాటుగా, నాలుక జిలజిలలాడుతూ ఉంది. ఆతడున్న దశలో అది చాల రుచి అనిపిస్తూంది. తింటే ఎంతో బలం వచ్చినట్లూ ఉంది. కొన్ని కొన్ని రకాల గడ్డి ఇప్పటికీ వెగటుగానే ఉంది. అయితే, వాటివల్ల ఉపయోగం ఉందని తెలిసింది. కనుక బలవంతంగానైనా అలవాటు చేసుకోసాగేడు.

గాయాలు త్వరత్వరగా మానుపట్టేయి.

బేంబి ఇంచుమించుగా పూర్ణారోగ్యవంతుడయాడు. అయినా ఇంకా ఆ గోతిని విడిచి దూరంపోవడం లేదు. ఒక్క రాత్రివేళ మాత్రం బయట కొద్దిగా తిరుగుతాడు. పగలంతా ప్రమాద భయంలేని ఆ గోతిలో హాయిగా ఆదమరిచి నిద్రపోతాడు.

బాధ బాగా తగ్గిపోయాక మెల్లిగా ఆలోచించుకుంటూంటే తనకు వాటిల్లిన ప్రమాదం అర్థం అయింది. భయంతో వణికిపోయాడు.

అతడు శారీరకంగా ఆరోగ్యవంతుడయాడు. ఇంకా మానసికమైన దార్ఢ్యం చేకూరలేదు. వెనుకటి ధైర్యం, ఆత్మవిశ్వాసం కలగలేదు. అందుచేత బయటి ప్రపంచంలోకి వెళ్ళి వెనుకటిలాగ తిరగాలనిపించడం లేదు.

రోజులూ, వారాలూ ఆ గోతిలోనే, విరిగిన నేరేడు కింద, దట్టమైన ఆకుల కప్పుకింద పడుకుని గతజీవితం నెమరు వేసుకున్నాడు. భయం, సిగ్గు, ఆశ్చర్యం ముప్పిరి

గొన్నాయి. నాయకుని యెడ కృతజ్ఞతా భావంతో మనస్సు నిండిపోయింది. బ్రతికి బయటపడినందుకు ఎంతో సంతోషం కలిగింది. ఇల్లాగ అనేక రకరకాల భావాలతో తల మునకలయాడు.

మొదటి రోజుల్లో నాయకుడు బేంబి దగ్గరే రాత్రీ పగలూ కూర్చుని ఉండేవాడు. కొన్నాళ్ళుపోయాక మధ్య మధ్యన బేంబిని ఒంటరిగా వదిలి కొంచెంసేపు తిరిగి వచ్చేవాడు. ఒంటరిగా పడుకుని ఆలోచించుకోవడం అతనికి మంచిదని నాయకుని ఉద్దేశం. బయటికి వెళ్ళినా ఆ గోతికి దగ్గరలోనే తిరిగేవాడు.

ఒక రోజున సాయంకాలం మెరుపులతో ఉరుములతో పెద్ద వర్షం కురిసింది. వాతావరణంలో ధూళి అణగిపోయి పరిశుభ్రమైంది. చెట్ల కొమ్మలమీద చేరి పిచికలు, తేనె పిట్టలు, గిజిగాళ్ళూ కిచకిచలాడుతున్నాయి. తుప్పలలో, దుబ్బులలో అడవి కోళ్ళు పరుగులెత్తుతున్నాయి. వడ్రంగి పిట్ట సంతోషంగా, "హహ్హాహ్హా!" అంటూంది. పావురాలు కువకువ లాడుతున్నాయి.

బేంబి గోతిలోనుంచి బయటికి వచ్చాడు. బయట అంతా హాయిగా ఉంది. దగ్గరలోనే ఇతనికోసం ముసలి నాయకుడు ఎదురు చూస్తున్నాడు. ఇద్దరూ మౌనంగా కొంతసేపు పక్క పక్కల నడిచేరు.

శిశిర ఋతువులో ఒకనాటి రాత్రి పండిపోతున్న కదంబ వృక్షపు ఆకుల మధ్య కూర్చుని గుడ్లగూబ భయంకరంగా అరిచింది. కొంచెంసేపు ఆగి మళ్లీ అరిచింది.

దూరాన్నుంచే గుడ్లగూబ ఉనికిని పసికట్టిన బేంబి ఏమీ చలించలేదు. అది చెట్టు కింది కొమ్మలమీదికి దిగి ఇంకా గట్టిగా అరిచింది. కాసేపు ఎదురుచూసింది. ఈసారి కూడా బేంబి ఉలికిపడ్డట్లు లేదు. గూబ ఇంక ఉండబట్ట లేకపోయింది.

"మీరు భయపడలేదా?"

"ఏదో కొంచెం" అన్నాడు, బేంబి నెమ్మదిగా. గూబ అసంతృప్తిగా గొణుక్కుంది.

"ఇంతా చేస్తే కొంచెమేనా? ఇదివరకు నా అరుపు వింటే మీరు మహా కంగారు పడిపోయేవారు. ఇప్పుడా భయం ఎందుకులేదో?"

గూబకు పెద్దతనం వస్తూన్నకొద్దీ స్వోత్కర్ష ఎక్కువ అవుతూంది.

"కొంచెం కొంచెం!" అని విసుక్కుంది.

"మీ కూత విని ఇదివరకూ నేను భయపడలేదు. మిమ్మల్ని సంతోషపెట్టడానికి అబద్ధం చెప్పేవాడిని" అని నిజం చెప్పేద్దామనిపించింది బేంబికి. ఆ మాట నాలిక చివర దాకా వచ్చిందికూడా. కాని, మనస్సులోనే అణిచేసు కున్నాడు. దాని కోపం, బుంగమూతి చూడగా ఆ ముసిలి గుడ్లగూబమీద ఎంతో జాలివేసింది. పైకి ఇల్లా అన్నాడు.

"అసలు ఏమైందంటేనండీ — సరిగ్గా మీరు అరిచిన సమయంలోనే మిమ్మల్ని గురించి నేను ఆలోచిస్తున్నాను."

గుడ్లగూబ సంతోషించింది.

"నన్ను గురించా? ఏమనీ?"

"మిమ్మల్ని గురించే. సరిగ్గా మీరు అరిచినప్పుడే. కాకపోతే మీ కూత విని ఇదివరకులాగే హడలి గంతేసే వాడిని కదూ?"

"నిజంగా?"

బేంబికి అవునంటే వచ్చిన నష్టం లేదు. ముసలి గూబను సంతోషపడనీ.

"నిజం. హఠాత్తుగా మీ కూత వింటే చాలు, భయంతో నా కాళ్లు మడతలు పడిపోతాయి."

గూబ రెక్కలు విదిల్చి, గుండ్రంగా బంతిలా పొంగింది. చాలా సంతోషించింది.

"మీరు చాలా మంచివారు. నన్ను గురించి మీకింత మంచి అభిప్రాయం ఉందంటే నిజంగా మీరు చాలా మంచివాళ్ళే.... అన్నట్లు మనం కలుసుకుని చాలాకాలమైనట్లుంది."

"అవును. చాలాకాలమే అయింది."

"ఏం? మీరా పాత దారులవెంట తిరగడం మానేశారా?"

"ఊఁ. ఇంక ఆ దారిని తిరగదలచుకోలేదు."

"నేనూ అంతే. నూతిలో కప్పలా కాకుండా ఈ విశాలమైన ప్రపంచాన్ని నాలుగు మూలలా చూడాలనిపించింది" అంది గుడ్లగూబ.

ఒక పడుచు గూబ తనను పాత గూటిలోంచి తరిమేసిందన్న విషయాన్ని అది దాచిపెట్టింది.

"ఎప్పుడూ ఒకే చోట పాతుకుపోకూడదు" అని సమా

ధానంకోసం ఎదురు చూచింది.

కాని, బేంబి అప్పటికే వెళ్ళిపోయాడు. చప్పుడు కాకుండా హఠాత్తుగా మాయమైపోయే నేర్పు ముసలి నాయకుని దగ్గర నేర్చుకున్నాడు.

'వీడి కెంత బడాయి!' అనుకుంది గూబ అక్కడలేని బేంబిని తలుచుకుని. రెక్కలు విదిలించి, రొమ్ము దగ్గర ఈకలు ముక్కుతో సరిదిద్దుకుంటూ తత్వచింతనలో పడింది.

'పెద్దవాళ్ళ స్నేహం నమ్మమని ఎక్కడుంది? తమకు అవసరమైనప్పుడు ఎక్కడలేని ప్రేమా ఒలకబోస్తారు. అవసరం తీరగానే గుడ్డి గవ్వకింద కట్టేస్తారు. ఇదిగో ఇప్పుడు చూస్తున్నాగా!'

మాట పూర్తికాకుండానే గూబ రాయిలా నేలమీద పడింది. అక్కడ ఆకుల మధ్యన ఓ ఎలుక కనిపించింది. కింద పడగానే దానిని గోళ్ళ మధ్య నొక్కిపట్టింది. పిసరంతైనా దయాదాక్షిణ్యాలు లేకుండా వాడిగాఉన్న తన ముక్కుతో ఆ ఎలుకను తూట్లు తూట్లుగా పొడిచేసింది. అంతగా ఆకలి లేకపోయినా గుటుకూ గుటుకూ ఇంతలేసి మాంసపు ముక్కలు మింగేసింది. భోజనం పూర్తిచేసింది.

'అసలు ఈ బేంబిగాడికీ నాకూ సంబంధం ఏమిటీ? వీడు కాకపోతే వీడి తాత మరొకడూ! అయినా ఈ లేడి జాతే అంత....'

గూబ చెవులు చిల్లులు పడేలా అరుస్తూ ఎగిరిపోయింది. చెట్టు తొర్రలో నిద్దురపోతున్న గువ్వజంట ఆ అరుపు విని ఉలిక్కిపడింది. గాభరాగా లేచి రెక్కలు టపటపలాడించి

అవి ఎగిరిపోయాయి.

కొన్ని రోజులపాటు వరుసగా శిశిరఋతు పవనాలు విడవకుండా వీచేయి. చెట్లను ఒక్క ఆకు మిగలకుండా అన్నీ ఊడ్చుకుపోయాయి. అడవి ఆమూలనుంచి ఈ మూలకు బోసిగా కనబడింది.

ఒకనాటి తెల్లవారుఝామున బేంబి లోయలోకి బయలుదేరేడు. ముసలి నాయకుడూ, అతడూ కలిసి చాలా సార్లు విశ్రాంతి తీసుకున్న చోటు అది. వెడుతూండగా ఎవ రిదో సన్నని కీచుకంఠం విని నిలబడ్డాడు. మెరుపులా, కళ్ళు తిరిగి పోయేటంత వేగంగా అంచెలమీద పై కొమ్మలమీది నుంచి కిందికి దూకేసి బేంబి ముందు నిలబడింది, ఉడత.

"మీరే అవునా కాదా అనుకున్నాను. మీరే నన్న మాట. దూరంనుంచి చూశాను. ఒక్క క్షణం మెరుపులా తళుక్కుమన్నారు. పోల్చేశాను. పోల్చేశాను కానీ, మీరు ఇల్లా వస్తున్నారంటే నమ్మలేకపోయాను" అంది ఉడతమ్మ తన పరుగంత వేగంగానూ మాట్లాడుతూ.

"తమ రిక్కడికి ఎప్పుడు దయచేశారూ ?" అని అడి గేడు, బేంబి.

మాంచి హుషారుగా, సంతోషంగా ఉన్న ఉడత ముఖ కవళికలు క్షణంలో మారిపోయాయి. ముఖాన విచారం పులుముకుంది.

"ముసలి జువ్విచెట్టు ఇంక లేదు. మా చెట్టు మా ఇల్లు, మా సర్వస్వం అయిపోయింది. మా చెట్టును నాశనం చేసేశారు" అంది ఉడత. ఆమె కళ్ళ నీళ్ళు తిరిగేయి.

ముసలి జువ్విచెట్టు బేంబికి కూడా ప్రేమపాత్రమైనదే. అతనికి కూడా ఎంతో విచారం కలిగింది. ఉడత ఆ కథ అంతా చెప్పింది.

"అదంతా అనుకోకుండా జరిగిపోయింది. దానిమీద పిల్లా జెల్లాతో కాపరాలు ఉంటున్న మేము ఎల్లాగో ప్రాణా లతో బయటపడ్డాం. అతడు తళ తళ లాడుతున్న ఒక పేద్ద పన్నుతో జువ్విచెట్టును కొరికేశాడు. మేము దూరంనుంచి చూశాం. పాపం! జువ్వి ఎంతో గోలెత్తిపోయింది. పెద్ద పెద్ద గాయాలు. నీళ్ళు కారిపోయింది. కానీ, అతని పంటికి దయలేదు. కొరికింది. ఇంకా కొరికింది. ఆఖరికి పాపం! జువ్వి ఫెళా ఫెళామని అంటూ మైదానంలో కూలిపోయింది. మేమంతా దూరంనుంచి చూసి ఏడ్చాం."

బేంబి మౌనం వహించాడు.

ఉడత నిట్టూర్చింది.

"అతడు చేయలేనిది లేదు. నిజమే. అన్నింటికీ సమ ర్థుడు."

బేంబి ఏమైనా సమాధానం చెప్తాడేమోనని కళ్లు ఇంత చేసుకుని చూసింది. కాని, అత డేమీ మాట్లాడ లేదు.

"అదిగో, అల్లా అయిపోయింది, మా చెట్టు పని. అందరూ తలో మూలకీ వలసపోయారు. నే నిలా వచ్చే శాను. మళ్ళీ అల్లాంటి చెట్టు కావాలంటే దొరుకుతుందా?"

"ముసలి జువ్వి...ఏనాటిది! ఎన్ని స్మృతులు! ఎంత చరిత్ర!" అని గొణుక్కున్నాడు బేంబి

"అయితే మీరు బేంబిగారే నన్నమాట?" అంది ఉడతమ్మ సంతోషంగా.

"అందరూ అనుకుంటున్న దేమిటంటే...తమరు ఇహ లేరని. అప్పుడప్పుడు తమరు జీవించే ఉన్నారన్నమాట వినిపించేది. ఎవరో ఎక్కడో మిమ్మల్ని చూచినట్లు చెప్పు కునేవారు. అటువంటివి వట్టి పుకార్లు మాత్రమేనో నిజమేనో ఎల్లా తెలుస్తుందీ? ఎంత కాలమైనా మీరు మీవాళ్ళ దగ్గ రకు రాకపోయేసరికి అల్లా అనుకుంటారు. నిజమే మరి..."

బేంబి ఏదో చెప్తాడని ఎంతో ఆశగా ఎదురుచూసింది, ఉడతమ్మ. కానీ, అతడేమీ మాట్లాడలేదు. ఫలీనాగురించి, ఏణిపిన్ని, రోనో, కారో వగైరాలను గురించి తెలుసుకోవా లని ఉన్నా అతడేమీ అడగలేదు.

ఉడతమ్మ కొంతసేపు అతనివేపు అల్లాగే చూస్తూ కూర్చుండిపోయింది. తరువాత తానే మళ్ళీ ప్రారంభించింది.

"ఓహో! మీ కిరీటం ఎంత అందంగా ఉందీ! దానిని వర్ణించలేం. ఇంత సొగసైన కిరీటం ఒక్క ముసలి నాయ కునికి తప్ప మరెవ్వరికీ లేదు."

ఇదివరలో అయితే అటువంటి పొగడ్తకు బేంబి చాలా సంతోషించేవాడే. కానీ, ఇప్పుడు, "ఆహా, అల్లాగా!? కావచ్చు" అని మాత్రం ఊరుకున్నాడు.

ఉడతమ్మ తెల్లని గుండెలకు చేతులు నొక్కుకుంది.

"అరే! మీ జుట్టు కొద్దిగా నెరుస్తున్నట్లుందే!"

బేంబిదీనికీ సమాధానం ఇవ్వలేదు. మౌనంగా ఎదరకు సాగిపోయాడు. ఉడతమ్మ అక్కడే కూర్చుని, వెళ్ళిపోతున్న

జేంబి నుద్దేశించి, కీచుగొంతుతో గట్టిగా అరిచింది :

"ఇంక సెలవా మరి ? మిమ్మల్ని చూశాను ఈవేళ. నాకు పండుగులా ఉంది. మన ఇద్దరికీ తెలిసినవాళ్లెవరైనా కనిపిస్తే మిమ్మల్ని చూశాననీ, మీరు కులాసాగా ఉన్నారనీ చెప్తాను. వాళ్ళంతా చాలా సంతోషిస్తారు..."

ఈ మాటలు జేంబి విన్నాడు. ఏదో అడగాలనే కోరిక మనస్సులో కదులాడింది, కానీ, ఏమీ అడగలేదు. చిన్నప్పుడే ముసలి నాయకునిదగ్గర ఒంటరిగా - ఉండడం గొప్ప అనేది నేర్చుకున్నాడు. ఎప్పుడో, అమ్మను విడిచి ఉండలేక అడవిలో తిరుగుతూ ఆమెను పిలిచినప్పుడు ముసలి నాయకుడు ఎదురై చెప్పినమాటలు ఇప్పటికీ చెవులలో గింగురు మంటున్నాయి.

"అమ్మ లేకుండా ఒంటరిగా ఉండలేవూ ? సిగ్గు లేక పోతే సరి !"

జేంబి ముందుకు నడిచేడు.

మంచు పడి నేలంతా తెల్లగా దూది పరిచినట్లుగా ఉంది. ఉండీ ఉడిగీ ఒకటీ అరా కాకి అరుస్తూంది. గోరింక ఆందోళనతో అరుస్తూంది. భయంగా సన్నగా పిచికల కూతలు వినవస్తున్నాయి.

ఉదయ సంధ్యలో అడవిలోని ప్రశాంతతను భంగ పరుస్తూ కుక్క అరుపు వినవచ్చింది. అది భయంకరమైన అరుపు. పిచ్చి ఎక్కించే అరుపు. క్రౌర్యానికి కొలబద్దలాంటి అరుపు. గాలిపాటున చెట్ల సందులలోనుంచి వినవచ్చింది. విరిగిన నేరేడు చెట్టుకింద గోతిలో జేంబి పడుకుని ఉన్నాడు.

తలయెత్తి పక్కనే ఉన్న ముసలి నాయకుని కేసి చూశాడు.

"మన కేమీ భయంలేదు" అన్నా డాయన. వాళ్లున్న గోతిని నేరేడు కొమ్మలు బాగా మూసిపెట్టి ఉంచాయి. ఈసురు గాలి తగలకుండా మంచు గుట్టలు గుట్టలుగా పడి అడ్డంగా ఉంది. ఆకులు రాలిపోయి ఉన్నా రేగు డొంకలు, సీమచింత మొదళ్ళు పరాయివాళ్ళ కంట పడకుండా వాళ్ళను కాపాడుతున్నాయి.

కుక్క అరుపు అంతకంతకు దగ్గరపడుతూంది. అది పరిశీలిస్తే ఆ కుక్క చిన్నది అని తేలుతూంది.

కొంతసేటికి కుక్క అరుపుల మధ్యన మరో అరుపు — సన్నంగా, బాధగా, భయంగా, మూలుగులా — ఉండి ఉండి వినిపించింది.

బేంబి కంగారు పడ్డాడు కాస్త. కాని, ముసలి నాయకుడు మళ్లీ అన్నాడు :

"దానివల్ల మన కేమీ భయం లేదు."

వాళ్ళు కొంచెం పైకి జరిగేరు. కొమ్మల సందునుంచి బయట జరుగుతున్నవన్నీ కనిపిస్తున్నాయి.

తుప్పలమీద పడిఉన్న మంచు జలజలా రాలింది. అటు తరువాత దూరాన జరుగుతున్నదంతా మరీ స్పష్టంగా కనిపించింది.

రేగు డొంకల పక్కగా తుమ్మల బీడుకు అడ్డపడి ముసలి నక్క దౌడు తీస్తూంది. ఎగిరి దుముకుతూంది. కాలు జారి పట్టుతప్పి పడిపోతూంది. దాన్ని తరుముకుంటూ ఒక పొట్టి కాళ్ళ బొచ్చుకుక్క వెంటబడి పరుగెడుతూంది.

నక్క ముందరికాలొకటి విరిగిపోయింది. ఆ కాలు పైకెత్తి కుంటుతూనే పరుగెడుతూంది. దాని గుండెదగ్గర తగిలిన గాయంలోంచి రక్తంకారుతూంది. భయంతో, ఆందోళనతో, నీరసంతో అది మతిపోయి ఉంది. ఉన్నట్లుండి గిరుక్కున తిరిగి గుర్రుమంది. పళ్ళు ఇకిలించి బెదిరించింది. ఆ ధూకుడుకు కుక్క భయపడి వెనక్కు అడుగేసింది. నక్క కూర్చుండిపోయింది. ఇహ పరుగెత్తే ఓపిక దానికి లేదు. నోరు తెరిచి ముఖం సాధ్యమైనంత భయంకరంగాచేసి గుర్రుగుర్రుమంటూంది. దానికి సమాధానం అన్నట్లుగా అడవి అంతా వినిపించేలా కుక్క అరవసాగింది.

"భాభా! ఇదిగో! ఇక్కడుంది! ఇక్కడుంది!"

ఆ అరుపు ఎవరో దూరంగా ఉన్న వ్యక్తిని ఉద్దేశించి.

కుక్క మనిషిని పిలుస్తూందని బేంబికీ, ముసలి నాయకునికీ అర్థం అయింది. నక్కకూ ఈ సంగతి తెలిసింది. దాని ఒంటి గాయాలనుంచి నెత్తురు కారిపోతూంది. దాని లోని శక్తి సన్నగిలిపోయింది. విరిగిపోయిన కాలు తోటకూర కాడలా కిందికి వేలాడిపోయింది. ఆ పుండు మంచుకు తగిలి భరింపరాని బాధ కలిగింది. కష్టపడి కాలు పైకెత్తి పట్టుకుంది.

"నన్ను వదిలేసెయ్యి. నీకు పుణ్యం ఉంటుంది. నన్ను విడిచిపెట్టు" అని బ్రతిమలాడింది కుక్కను.

"వీల్లేదు. నిన్ను విడిచిపెట్టను" అంది కుక్క.

నక్క మళ్ళీ బ్రతిమలాడింది.

"నా పని అయిపోయింది. నా జీవితం చివరికి వచ్చే

సింది. నన్ను పోనియ్యి. కనీసం హాయిగా చచ్చిపోనీ."

"వీల్లేదు" అంది కుక్క.

"మన మిద్దరం వేలు విడిచిన అన్నదమ్ములం. ఒకే జాతివాళ్ళం. నన్ను వదిలెయ్యి. నా అన్నవాళ్ళున్న చోటికి పోయి ప్రశాంతంగా ప్రాణాలు విడుస్తాను. నన్ను పోనీ."

"వీల్లేదు !" అని గట్టిగా అరిచింది కుక్క.

నక్క, కుక్క ముఖంలోకి తిన్నగా తీక్షణంగా చూసింది. మిగిలిన శక్తినంతనూ కూడదీసుకుంది. స్వరం మారింది. వెనుకటి వణుకు తగ్గి కంఠంలో కసి పెరిగింది.

"నీకు అసలు సిగ్గుందా ? ద్రోహీ !"

"భౌయ్ భౌయ్" మని అరిచింది, కుక్క.

"సిగ్గుమాలినవాడా! ఆత్మవంచకుడా ! జాతిభ్రష్టుడా!" అని నోటికి వచ్చినట్లల్లా తిట్టేసింది నక్క. దాని కళ్ళలో కోపం, అసహ్యం నిండిఉన్నాయి.

"వాడు వెతుక్కోలేని మమ్మల్ని నువ్వు పట్టి ఇస్తున్నావు. వాడు రాలేని చోట్లకి నువ్వు వెంట బడుతున్నావు. మనది ఒకే జాతి. ఇంచుమించు అన్నదమ్ములం. అయినా ప్రీతిలేదు. నన్ను పట్టి వాడికిస్తున్నావు. చంపిస్తున్నావు. నీకెంత సిగ్గులేదురా !"

చుట్టూ అనేక కంఠాలు నక్క మాటలను ప్రతిధ్వనించాయి.

"సిగ్గుమాలినవాడా !" అని చెట్టుమీంది కాకులు అరిచేయి.

"ఆత్మవంచకుడా !" అంది వెంట్రుక.

"జాతి భ్రష్టుడా !"అంది గువ్వపిట్ట. అన్ని వేపులనుంచీ, అన్ని చెట్లమీాదా, అన్ని డొంకలలోనూ కోపంతో జంతువులూ, పక్షులూ అరిచేయి.

"మన మధ్యలో ద్రోహి ఉన్నాడు, జాగ్రత్త !" అని కాకులు ఆకాశంలో ఎగురుతూ అరిచేయి.

తమ కోపాన్నీ, కసినీ ప్రదర్శించడానికి జంతువులూ, పక్షులూ అక్కడ గుమికూడేయి. నక్కలో కనిపించినకోపం, అసహ్యం మిగిలిన జీవుల్లో ప్రతిబింబించాయి. కుక్క లోగడ తమకూ, తమవాళ్ళకూ చేసిన అపకారాలను నెమరుకు తెచ్చుకుని అన్నీ కోపంతో వణికిపోయాయి. మంచులోపడ్డ రక్తాన్ని చూశాక వాటిలో మామూలుగా ఉండే భయం ఇగిరిపోయింది.

కుక్క పళ్ళు ఇగిలించి కోపంతో అరిచింది :

"ఏమిటి మీరంతా ? ఏం కావాలి మీాకు ? అసలు మీాకేం తెలుసు ? మీరు మాట్లాడేదానికి అర్థం ఏమైనా ఉందా ? ఇవి అన్నీ ఆయనివే. ఆఖరికి నేనూనూ. నాకు ఆయన అంటే మహా ఇష్టం, ఆయనకు మొక్కుతాను. సేవిస్తాను. ఏమిటనుకుంటున్నారేమిటి ? ఆయనకి ఎదురు తిరుగుదామనేనా మీా ఉద్దేశం ? మీాలాంటి ఇంత అల్పులకి ఇంత సాహసమా ! ఆయన మనకందరికీ రారాజు. అందరి కన్నా పైవాడు. మీాకున్నవన్నీ ఆయనవే. ఆయనవల్లనే మీరు పెరుగుతున్నారు. మీరు గాలి పీలుస్తున్న దాయన వల్లనే."

"ద్రోహీ ! వంచకుడా ! జాతి భ్రష్టుడా !" అని పళ్ళు

కొరికింది నక్క.

కోపం పట్టలేక నక్క గొంతు పట్టుకుంది కుక్క.

ఇద్దరూ గుర్రు గుర్రుమని అరుస్తూ ఆ మంచులో ఒకళ్ళమీద ఒకళ్ళు పడి దొర్లేరు. మంచు, రక్తం, బొచ్చు—కలగా పులగంగా ఎగిరిపడ్డాయి. కొంతసేపటికి యుద్ధం పూర్తి అయింది. నక్క వెల్లకిలా పడిపోయింది మంచులో. కొంత సేపు కాళ్ళు కొట్టుకుంది. తరువాత చచ్చిపోయింది.

కుక్క దానిని మరోసారి కదిలించి చూచి, చచ్చి పోయినట్లు రూఢి చేసుకుని అరిచింది.

"ఇదిగో, ఇక్కడ! ఇదిగో, ఇక్కడ!"

ప్రేక్షకులంతా భయంతో నలుదిక్కులకూ చెదిరి పోయారు.

"ఎంత భయంకరంగా ఉందీ!" అన్నాడు బేంబి నెమ్మదిగా.

"అవును. దాని చావు భయంకరమే."

నాయకుడు ఒక నిమిషం ఆగి, మళ్ళీ అన్నాడు:

"ఆ కుక్క మాటలు విన్నావు కదూ? ఆ భావాలు అన్నిటికంటే భయంకరమైనవి. అతనికన్న గొప్పవాళ్లు లేరు, అతడు చేయలేనిది లేదు అనే పిచ్చి నమ్మిక అన్నిటికన్నా భయంకరం. దానివలన బ్రతుకంతా భయమైపోతుంది. ఆ భయంవల్లనే కాలూ, చెయ్యీ ఆడించనైనా ఆడించకుండా అతని చేతుల్లో చచ్చిపోతున్నారు..."

ఉన్నట్లుండి చలి తగ్గింది. శీతాకాలానికి ఇది కాస్త ఆటవిడుపు. కరిగిన మంచు నీటిని భూదేవి ఆత్రంగా తాగె

సింది. నేల అంతా చెమ్మగా, నల్లని మచ్చలు మచ్చలుగా తయారైంది. నేల నుండి బయటికి వస్తూన్న వాన పాములను, పురుగులను పిచికలు ఆశగా మింగుతున్నాయి. పత్రంగి పిట్టల కూతలు దూరంనుంచి వినిపిస్తున్నాయి. గోరింకలు, కాకులు పనిపోసినట్లు ఒకటే కబుర్లు. శీతాకాలం అంతా చెట్లకొమ్మలమీద గడిపిన అడవి కోళ్లు కిందికి దిగేయి. నెమళ్ళు ఉదయ సూర్యునికి స్వాగత వచనాలు పలికేయి. అడవి అంతా క్రేంకారాలతో నిండింది. వసంతం ప్రారంభమైంది.

ఒకనాడు జేంబి దూరంగా లోయలోకి వెళ్ళేడు. లోయకు అవతలివేపున ఏదో జీవం కదులాడుతున్నట్లు తోచింది. పొదలవెనుక నిలబడి జాగ్రత్తగా చూశాడు. తన జాతిదే ఎవరో నేలమీద అప్పుడప్పుడే మొలకలెత్తుతూన్న గడ్డి పరకలు వెతుక్కుంటూంది.

వెనక్కు తిరిగి వెళ్ళిపోదామనుకున్నాడు. అంతలో ఆమె ఫలీనా అని గుర్తు పట్టేడు. ఒక్క పరుగులో వెళ్ళి ఆమెను కలుసుకోవా లనిపించింది. కాని, కాళ్ళు నేలకు అతుక్కుపోయినట్లు కదలలేదు.

ఫలీనాను చూసి ఎంతకాలం అయిపోయిందీ?

ఆమె మెల్లిగా, కష్టంమీద కదులుతూన్నట్లు అనిపించింది. అలిసిపోయిందో ఏమో? లేక విచారంగా ఉందా?

ఆమె అచ్చంగా వాళ్ళ అమ్మ పోలికలో ఉంది. అనుమానం ఏమిటి? ఏణి పిన్ని పోలికే. జేంబికి దిగులు కలి

గింది.

ఫలీనా బేంబి ఉనికిని పసికట్టినదానిలా తలయెత్తి దిక్కులు పరికించింది.

మహోత్సాహంతో ఆమె దగ్గరకు పరుగెత్తబోయాడు బేంబి. మళ్ళీ ఈసారికూడా కాళ్ళు కదలలేదు. పిచ్చి ఫలీనా! ఎంత ముసిలిదైపోయిందీ? చెవుల దగ్గర నెరసినట్లుకూడా ఉందే! చిన్ననాటి కబుర్లు, గంతులు జ్ఞాపకం వచ్చాయి.

'ఎంత హుషారుగా గంతులు వేసేదీ! ఎంత అందంగా ఉండేదీ!' అనుకున్నాడు. బేంబిలో మరల యౌవనపు జ్ఞాపకాలు తల యెత్తేయి. ఫలీనా, గోబోలతో పరిచయమైన మైదానం, వాళ్ళతో కలిసి దాగుడు మూతలు, తూతుమ్మొండలు ఆడడం, ఫలీనాకోసం రోనో, కారోలతో యుద్ధం చెయ్యడం — అన్నీ గుర్తుకు వచ్చాయి.

లోయలో దూరంగా విచారంగా తల కిందికి వాల్చి అలసటగా వెనుదిరిగి నడిచి వెళ్ళిపోయింది ఫలీనా. చిన్నప్పుడెప్పుడూ ఎరగనంత ప్రేమ ఆమెను చూస్తూంటే కలుగుతూంది. ఒక్క గంతులో లోయదాటేసి ఆమెను కలుసుకోవాలనీ, ఆమెతో మనసు విప్పుకుని మాట్లాడాలనీ అనిపించింది. తమ ఆటలను గురించీ, జీవితాలను గురించీ, కష్టసుఖాలను గురించీ — ఒకటేమిటి, అడవిలో తమ అనుభవాలన్నిటిని గురించీ ఏకబిగిని మాట్లాడెయ్యాలనిపించింది. కాని, కాలు కదపలేడు.

ఫలీనా చెట్ల తోపులలో మాయమైపోయింది.

బేంబి శూన్యాకాశంలోకి చూస్తూ అక్కడే చాలా సేపు నిలువబడ్డాడు.

ఉన్నట్లుండి పెద్దగా ఉరుము!

బేంబి ఉలికిపడి జాగ్రదవస్థలోకి వచ్చాడు. ఉరుము ఎక్కడో. మరీ దగ్గరలో మాత్రం కాదు. అంతలో మరో ఉరుము. తరువాత ఇంకొకటి.

నాలుగు అడుగుల్లో చెట్ల వరసలలో దూరి నిలబడ్డాడు. చెవులు రిక్కించి విన్నాడు. అంతటా నిశ్శబ్దం. జాగ్రత్తగా ఇంటికి తిరిగి వచ్చాడు. విరిగిపోయిన నేరేడు చెట్టు దగ్గర ముసలి నాయకుడు తన కోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

తన్ను చూస్తూనే, "విన్నావా?" అని అడిగేడు.

"ఆ. మూడుసార్లు ఉరిమింది. వాడు అడవిలోనే ఉన్నాడు."

"అవును. ఇక్కడే ఉన్నాడు. మనం బయలుదేరి వెళ్లాలి."

ఎక్కడికో బేంబికి అర్థం కాలేదు. తాము ఇప్పుడుం టూన్న చోటుకంటే భద్రమైనచోటు మరొకటి ఉంటుందనే సంగతి అతనికి తెలియదు.

"అటే! వాడున్నచోటికే" అన్నాడు నాయకుడు బరువైన కంఠంతో.

బేంబి ఉలిక్కిపడ్డాడు.

"మరేం భయంలేదు. ప్రమాద భయం లేకుండా ఇప్పుడే వెళ్ళవచ్చు, మనం... పూర్తిగా విడిపోకముందే,

నిన్ను అక్కడికి తీసుకువెళ్ళ గలుగుతూన్నందుకు సంతో షంగా ఉంది."

ముసలి నాయకుని కంఠం వణికింది.

ఆయన కంఠంలో వణుకు వినడం అదే మొదటిసారి, బేంబికి. నాయకుని తల మంచుకన్న తెల్లగా నెరిసింది. ముఖం ముడుతలు పడింది. లోతైన కళ్ళలో పూర్వపు కాంతి లేదు. అవి అలిసిపోయి లేత ఆకుపచ్చరంగులో ఉన్నాయి.

ఇద్దరూ తమ గోతిని వదిలి బయటికి వచ్చారు. బాగా పరిచయముండున్న ఘాటైన వాసన - తల దిమ్మెక్కించే వాసన పసి తెలిసింది. ఆ వాసన భయ ప్రమాదాలకు ఆటపట్టు.

బేంబి నిలబడ్డాడు. కానీ, నాయకుడు ఆ వాసన వస్తున్న దిశగా నడిచేడు. ఏం చెయ్యాలో తోచక బేంబి ఆయనను అనుసరించాడు.

ఆ వాసన మిగిలిన అడవి వాసనల నన్నింటినీ దిగ తొక్కి గాలి అలలలో తేలివస్తూంది. అడుగడుక్కూ మరింత ఘాటుగా, మరింత మత్తుగా... ముక్కులూ, నోరూ నిండి పోయి మామూలుగా గాలి పీల్చుకోనివ్వడం లేదుకూడా. అక్కడినుంచి పారిపోవాలన్న ఆలోచన ఒక్కటే బేంబి మన స్సును ఆక్రమించి ఉంది. మనస్సు నంతనూ ఏదో తెర కప్పి నట్లు, ఇతర ఆలోచనలేమీ తోచనివ్వడం లేదు. శరీరమంతా తన చెప్పుచేతలలో లేనట్లు బిగుసుకుంటూంది. ఏ ఆలోచనా లేకుండా అతడు నాయకుని వెంటబడి నడిచాడు.

"ఇదిగో? ఇక్కడే!" అని నాయకుడు పక్కకు తప్పుకున్నాడు.

పొదల పక్కను, కరిగిపోతున్న మంచులో వెల్లకిలా కాళ్లూ చేతులూ బారజాపి పడిఉన్నాడు, మనిషి!

వెనుకటి భయం — గుండెలను నలిపివేసే భయం — బేంబికి ఊపిరాడ నివ్వడం లేదు. ఎంతో సేపటినుంచి బిగపట్టి వస్తూన్న కోరిక ఉబికి పరుగెత్తబోయాడు.

"ఆగు!"

నాయకుని ఆజ్ఞ విని బేంబి ఆగేడు.

నాయకుడు ధైర్యంగా నేలమీద పడిఉన్న మనిషి దగ్గరకు వెళ్ళి నిలుచున్నాడు.

మనిషి వెల్లకిలా పడిఉన్నాడు. ముఖం — ఆ అసహ్యకరమైన ముఖం — ఆకాశంవైపు చూస్తూంది. అతని టోపీ పక్కన పడిఉంది. టోపీ అంటే ఏమిటో ఎరగని బేంబి, అతని తల రెండు చెక్కలైంది కాబోలు ననుకున్నాడు.

అతని మెడదగ్గర పెద్ద పుండు రెండో నోరు అన్నట్లు కనిపిస్తూంది. అందులోంచి రక్తం కాలువలుగా కారి, కరుగుతున్న మంచుతోపాటు నేలలో ఇంకిపోతూంది.

నాయకుడు అతని వైపు చూపించి బేంబితో అన్నాడు:

"ఇదిగో, చూడు! వీడి పక్కని నిలుచున్నాం. అంతగా పొగిడిన వీడిలో ఇప్పుడేముంది శక్తి?"

బేంబి కింద పడిఉన్న మనిషికేసి చూశాడు. అతడి ఆకారం, అవయవాలు, చర్మం — అన్నింటా ఏదో కొత్త



పొదల పక్కను, కరిగిపోతున్న మంచులో వెల్లకిలా కాళ్ళూ చేతులూ బార జాపి పడి ఉన్నాడు, మనిషి,

పుట 225

దనం, వింత, నిగూఢత్వం, అజేయత కనిపించాయి. కానీ, కళ్ళలో జీవం లేదు.

బేంబికి ఏమీ అర్థంకాలేదు.

"బేంబీ! గోబో ఏమన్నాడో జ్ఞాపకం ఉందా? మొన్నటికి మొన్న ఆ బొచ్చుకుక్క ఏమందో గుర్తుందా? ఈఅడవి జంతువులు, పక్షులు — అన్నిటికీ అదే నమ్మకం... గుడ్డి నమ్మకం!"

"అవును" అన్నాడు బేంబి.

"ఇదిగో! ఇప్పుడు నీకళ్లారా చూస్తున్నావుగా? ఇతడు ఎంత అజేయుడో అర్థం అయిందా? ఇతడూ మన అందరి లాంటివాడే. ఇతడికీ భయం, కోరిక, బాధ, చావు — అన్నీ ఉన్నాయి. మనమీదికైతే నిర్భయంగా, కర్కశంగా, క్రూరంగా, ఒంటి కాలిమీద దండెత్తివచ్చాడు. ఇప్పుడు? ప్రాణంపోయి, నేలమీద పడిఉన్నాడు. ఇతణ్ణి చూసి అంతా వణికిపోయేవారు. ఎందుకో? మనకిలాగ ఇతడికి బలమైన కాళ్ళు లేవు. కాకికి ఉన్నట్లు రెక్కలు లేవు. వెంట్రుకకుఉన్న లాఘవం లేదు. నక్కకిఉన్న పంటివాడి లేదు. అయినా ఇతడు అందరికన్నా బలవంతుడయాడు. అదెల్లా సాధ్యం అయిందీ? అతడు ధైర్యసాహసా లున్నవాడు కనక. యోధుడు కనక. మన లేళ్లు ఎవ్వరినీ చంపవు. జీవులముగా అతడూ మనమూ ఒకటే. కాని అతడు మనమీద మృత్యువు కురిపిస్తున్నాడు. అయినా మనం బతకాలి! మనలో ప్రతి ఒక్కడూ వేయిళ్ళ మొదలుకావాలి! మన జాతి అసంఖ్యాకం కావాలి! మన్ని కాపాడుకోవాలి! మన మనుగడను

రక్షించుకోవాలి! దగ్గరవాళ్ళని కూడదీసుకోవాలి! ఇతడికి వ్యతిరేకంగా మిగిలిన జీవాలకి సాయపడాలి! జాగ్రత్త, లాఘవం, ఉపాయం నేర్చుకోవాలి! అంతు చిక్కనివ్వ కూడదు. శీఘ్రగాములం కావాలి. అంతేకాని పిరికిగా మాత్రం ఉండకూడదు — ఇదీ జీవితధర్మం! వింటున్నావా?"

"ఊఁ!" అన్నాడు నెమ్మదిగా బేంబి. "జీవిత ధర్మం-పోరాటం!"

ముసలి నాయకుడు వాత్సల్య పూర్వకంగా చూశాడు. ఆ కళ్లలో రాజసం, సాత్వికం చివరిసారిగా తళుక్కు-మన్నాయి.

"అంతే. ప్రశాంతమైన మనస్సుతో నిన్ను విడిచి వెళ్లగలనోయ్!"

ఇద్దరూ వెనుదిరిగేరు. ముసలి కదంబ వృక్షం దగ్గరకు వచ్చాక ముసలి నాయకుడు నిలబడ్డాడు.

"బేంబీ! నా వెనుక రావద్దు ఇంక. నా జీవితం ఆఖరి దశకి వచ్చేసింది. ఇంక ఎన్నాళ్ళో బ్రతకను. ఏదో ప్రశాంత స్థలం చూచుకుని హాయిగా ప్రాణాలు విడుస్తాను."

"నేనుకూడా తమతో..." బేంబి కంఠం వణికింది.

"వద్దు! మనం ఇక్కడే విడిపోదాం. ప్రతివాడూ చివరిదశలో ఏకాంతంగానే ఉండాలి. జాగ్రత్తగా వెళ్ళు."

ఆ రోజున ఉషోదయపు వేళనుంచీ బాగా వెలుగు

గానే ఉంది. మబ్బులూ ఏమీా లేవు. నక్షత్రాలు అల్లా మాయమయాయో లేదో సూర్యుడు తొందర పడుతూన్నట్లు ఇల్లా ఉదయించేశాడు. మైదానంమీాద గడ్డిని అంటుకుని ఉన్న సన్నని మంచు క్షణంలో మాయమైంది. నేల పొడిగా ఉంది.

అడవిలో నలుమూలలా జీవాలు ఇంకా కదలటం లేదు. అక్కడా అక్కడా వడ్రంగి పిట్టల ముక్కుపోట్లు, పావురాల గురగురలూ మాత్రం వినిపిస్తున్నాయి.

ఎవ్వరూ రాని ఏకాంత ప్రదేశాన్ని వెతుక్కుంటూ బేంబి చిన్న చెట్ల తెరపిలో నిలుచున్నాడు. అతని తలమీాద ఈగల గుంపు ఎండ వెచ్చదనంలో గిరికీలు చుడుతూంది.

అంతలో ఒక పెద్ద తుమ్మెద ఝుయ్‌మని చప్పుడు చేస్తూ ఈగల మధ్యనుంచి దూసుకు పోయింది. దాని విసురుకు చెదిరిపోయిన ఈగలు మళ్లీ బేంబి తలమీాద గుమిగూడేయి. సూర్యకిరణాలలో నల్లగా మెరిసిపోతూన్న తుమ్మెదనూ, దాని రెక్కలమీాది రంగుల్నీ చూస్తూ బేంబి ముందుకు నడిచేడు.

అతన్ని చూస్తూ ఈగలు కథోప కథనం సాగించాయి.

"ఈయన ఎవరో తెలుసా ?" అంది ఒక ఈగ.

"ఈయనకి ఎన్నేళ్ళో!?" అంటూ ఒక ఈగ ఔత్సుక్యం కనబరచింది.



"చెప్పడం కష్టం" అంది ఒక ముసలి ఈగ.

"లేళ్ళు బహుకాలం జీవిస్తాయి. సూర్యుణ్ణి ముప్పై నలభై సార్లు కూడా చూస్తాయి. మన జీవితంకూడా ఏమంత తక్కువేమీ కాదు. కానీ, మనం సూర్యుణ్ణి ఒక్కమారే చూస్తాం. ఒకొక్కప్పుడు రెండుసార్లు చూచిన ఈగలు కూడా లేకపోలేదు."

"మరి ముసలి నాయకుడో?"

"అబ్బో! ఆయన అందరికన్నా పెద్దవాడు. ఆయన బతికినంతకాలం ఇంతవరకూ ఎవళ్ళూ బతకలేదు. ఆయన ఎన్నో చూశారు. ఎంతో అనుభవం సంపాదించారు. అది మన ఊహకి అందదు."

వాటి సంభాషణ విని బెంబి నవ్వుకున్నాడు.



భయంతో కూడిన సన్నని అరుపేదో అతనికి వినబడింది. బేంబి జాగ్రత్తగా విన్నాడు. చప్పుడు చెయ్యకుండా చెట్ల గుంపులలోకి నడిచేడు. ఆ విధంగా నడవడం అతనికి అలవాటైపోయింది. మళ్ళీ అదే పిలుపు. విచారంతో, భయంతో అరుస్తున్న రెండు చిన్నారి గొంతుకలు. అవి వినగానే బేంబికి తన చిన్నతనం గుర్తుకు వచ్చింది.

"అమ్మా! అమ్మా!"

సన్నని దారిలో ఒకదానినొకటి ఒరుసుకుంటూ ఇద్దరు చిన్నపిల్లలు – అన్నా, చెల్లెలూ – ఎర్రని చుక్కల మెత్తని చర్మాలతో, అరుస్తూ కనిపించారు.

"అమ్మా! అమ్మా!"

బేంబి వాళ్ళ ముందర ప్రత్యక్షమయాడు.

"అమ్మ ఇప్పుడు ఏదో పనిలో ఉంది" అన్నాడు కఠినంగా. పిల్లవాడి కేసి చూశాడు.

"అమ్మ లేకుండా ఒంటరిగా ఉండలేననడానికి సిగ్గు లేదూ?"

ఆపిల్లలిద్దరూ హడలిపోయారు. నోళ్ళు మూసేసు కున్నారు.

బేంబి గిరుక్కున తిరిగి చెట్ల వరసలలోకి నడిచాడు.

'కుర్రాడు బాగున్నాడు. నచ్చాడు. కాస్త పెద్దవా డయాక మళ్ళీ కలుసుకోవాలి. ఆ పిల్ల ఎంత ముద్దుగా ఉంది! ఫలీనా చిన్నప్పుడిల్లాగే ఉండేది' అనుకున్నాడు.

అతడు అల్లా ఆలోచించుకుంటూ ముందుకు సాగిపో యాడు. అడవి చెట్ల చీకట్ల ముసుగులో అంతర్హితు డయాడు.

సమాప్తం.

